# భారతి

మాసపత్రిక

సంపాదకుడు:
వలెంక శంఖుప్రసాద్

ఫిబ్రవరి 1968

సంపుటము: 45 : : సంచిక 2 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఫిబ్రవరి 1968


| | | |
|---|---|---|
| ఎవరది దూరంగా | శ్రీ మాదిరాజు రంగారావు | 1 |
| పెద్ద దూగాం శాసనము | శ్రీ కజ్జి సాంబమూర్తి శాస్త్రి | 3 |
| తెలుగు హిందీ సాహిత్యములలో ఆధునిక యుగకర్తలు | శ్రీ బయ్యా వెంకటసూర్యనారాయణ | 8 |
| నిరీహ | శ్రీ వేగుంట మోహనప్రసాద్ | 15 |
| భావభేదము - రసదృష్టి | శ్రీ కొండిపర్తి శేషగిరిరావు | 17 |
| మాయ | శ్రీమతి ఆర్. వసుంధర | 20 |
| సంస్కృత సారస్వతమున జంటకవులు | శ్రీ ఈ. వేంకట వీరరాఘవాచార్యులు | 29 |
| తప్పించుకుపోయావు | శ్రీ సి. నాగేశ్వరరావు | 42 |
| ప్రథమ ప్రాసంగిక వ్యాకరణము | డా. బొడ్డుపల్లి పురుషోత్తం | 43 |
| శ్రీ మధురాంతకం రాజారాం సాహితీ వ్యాసంగం | శ్రీ కొలకలూరి ఇనాక్ | 48 |
| ద్వితీయ అంతర్జాతీయ తమిళ మహాసభ - ఒక సమీక్ష | శ్రీ తి. రా. | 57 |
| గ్రంథవిమర్శలు | | 73 |

# ఎవరది దూరంగా

## శ్రీ మాదిరాజు రంగారావు

ఎవరది దూరంగా
చెదరిన కేశరాజితో
బొప్పికట్టిన ఫాలంతో
విసరు వాయు ఛురికలకు
కందిన కపోల పాళితో
దెబ్బతిన్న భుజాలపై
మాయని గాయాలతో
అడుగులో అడుగువేస్తూ నడచే
గ్రహణం విడువని చంద్రబింబం !
ఎవరది దూరంగా.

ఆడినమాట తప్పక మెప్పుకై
అవసరమైతే సముద్రంలో దూకి
చావడానికైనా వెనుదీయక,
వచ్చే వరదల్లో కొట్టుకొని
పోవడానికీ సిద్ధంగా ఉన్న
శాంత సహన భావ రూపం.
తాకితే కాల్చని మణిదీపం
ఎవరది ?

ఆకలి దారిద్ర్యపు ఎండలలో
కాలు సాగని ఇసుక దిబ్బలపై
గమనం సాగిస్తున్న సాహసమతి
నిన్న వేసిన తప్పటడుగు పరిణామం
ఇవాల్టికైనా తెలిసి రావడంలేదు.

గడచిన ఏ ఒక స్థితినీ
తిరిగి ఎవడూ కూర్చలేడు.
ఆఖరికి భగవంతుడైనాసరే !

కాలం ఎవరి చెప్పుచేతల్లోనూ ఉండదు.
కాలం ఎవరినీ ఎన్నడూ లక్ష్యపెట్టదు.

భోజన సమయంలో టేబిల్ పైనుండి
క్రిందపడి ముక్కలు ముక్కలైన
గాజుపాత్రపై ఆశ వదలి
క్రొత్తదానికోసం ప్రయత్నించు.

లేనిపోని మమకారం పెంచుకొని
పగిలిన ముక్కల నేరి కూర్చి నిలుపుతూ,
తల వాల్చి, ఆవేదన పడేకన్నా
అలౌకిక మేముంది? జీవితంలో.

ఇంతకూ ఎవరది?
జ్ఞాపకం రావడంలేదు.
చితికిన సౌందర్యదీపం.
తెలివివచ్చి ఊడిన స్వప్నం.

గంధంలేని వెలుగులేని
వర్ణంలేని ఊహ వలయం.
ఎక్కడ చూచానో పూర్వం
గుర్తుకు రావడంలేదు.

ఋతువులు వచ్చిపోతూనే ఉన్నవి.
దొడ్లలో, బయళ్లలో గడ్డిపోచలు.
అక్కడక్కడా ఉద్గమిస్తూన్నవి పూలు.
బ్రతుకులు తెల్లవారిపోతూనే ఉన్నవి.

కాలం కదలుతూంది నదివలె.
క్రమిస్తున్నవి లిప్తలు తరగలవలె.

వయస్సు పైబడిపోతూనే ఉంది
ఆయువు తరగిపోతూనే ఉంది.

ఆకులపై చిగుళ్లపై పూలపై పండ్లపై
ఉదయం మెరుస్తున్న మంచు బిందువులు.
సూర్యుడు పైకి ఎక్కిరావడంతో
అంతలో ఎక్కడివక్కడే ఇగిరిపోతూన్నవి,
అక్కడికక్కడే కన్పిస్తూ ఆర్ద్రత బ్రతుకులో
ఎక్కడికక్కడే మాయమౌతూంది అంతలో.

ఎండలో చలిలో వానలో
నిశ్శబ్దంగా నిలచిన రోదసి,
ఆత్మనేత్రంవలె తెరచుకొని
దాగిన రహస్యానికి సాక్షిగా ఉంది.

ఔజ్వలం సౌభాగ్యం సంస్కారం
పూర్వచరిత్రలో ఆకాశమంత ఎత్తుగా
భవిష్యత్తుయోజనలో స్వప్నమంత సొగసుగా
వర్తమానంలో వాస్తవంగా పీడకలగా
ఎదురౌతున్నది ఎవరది?

బరువు రెప్పల క్రింద
అణగిన వెలుగులతో,
వెలుగు చూపుల క్రింద
దాగిన చీకట్లతో,
మెడపై వ్రేలాడు ముఖాలతో
దుస్థితిలో కంపించు మనస్సులతో,
మొగిలు మెరపు కనుచూపులతో
చెవులు దిబ్బళ్లువేయు గోడులతో
ఎండటు కాసిన కన్నులతో
చీకటి క్రుమ్మిన కన్నులతో
స్త్రీలు — పురుషులు, పిల్లలు;
ఈ దీపమూర్తి నాశ్రయించిన
ఎందరో దౌర్భాగ్య మహాభాగ్యులు.

శరీరంలో జీవం ఉంది, మృత్యువు ఉంది.
మనస్సులో దైవత్వం ఉంది, దానవత్వం ఉంది.
మానవునిలో దానవత తలఎత్తినపుడు
ఎవడికివాడే ఏ దేశంలోనైనా,
వేరువేరు పోతల్లో అజ్ఞాన రూపాలు.

మానవునిలో మానవత చివురు లెత్తినపుడు
ఎవరైతేనేం ఏ దేశమైతేనేం?
అంతా ఒకటే ఆకృతిలో, చైతన్యశిఖలు.

---



# పెద్ద దూగాం శాసనము

## శ్రీ కట్టి సాంబమూర్తి శా

శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట తాలూకా పెద్దదూగాం గ్రామములో పదునాలుగు సంవత్సరముల క్రిందట బయటపడిన ఈ శాసనము భారత ప్రభుత్వమువారి పురాతన శాసన శాఖవారిచే రూ 600—00 ల బహుమానమునకు పాత్రమైనది ఈ శాసనము ఆకారమున చిన్నది. మూడు రేకులు మాత్రమే దాత ప్రసిద్ధుడు కాడు. భాషగూడ ప్రశస్తమైనది కాదు. అయినను దీనికింత ఘనత ఎట్లు వచ్చినదో విచారింపవలసియున్నది.

శాసనమునందు దానకాలము, లిపి, అను రెండు విశేషము లగపడుచున్నవి. ముందుగా కాలమును విమర్శింతము. దాత శత్రుదమనమహారాజు. విజయసింహపురమునుండి 9 వ సంవత్సరమున ఈ దానమును ప్రకటించెను. ఈ 9 వ సంవత్సరము ఏ శకమునకు సంబంధించినదో తెలియదు కళింగమును పాలించిన పూర్వగాంగవంశజులగు హస్తివర్మ మొదలగు రాజులు తమ విజయరాజ్య సంవత్సరములను దక్క నితర శకములనువేనినీ పేర్కొనలేదు. కావున వారి కాలనిర్ణయము మిక్కిలి కష్టముగానున్నది వీరేకాక ఖారవేలుడు సముద్రగుప్తుడు మొదలగు ప్రాచీనులు గూడ కాలమును తెలుపలేదు అయినను విదేశీయుల వ్రాతలవలననూ, ఇంకను మఱికొన్ని యాధారములవల్లను వారి కాలములు నిర్ణయింపబడినవి. ఈ పూర్వగాంగుల కాలము సముద్రగుప్తుని కాలము వలన ప్రాయశః నిర్ణయింపబడుచున్నది. ఈ శాసన కాలముగూడ అతని కాలమును బట్టియే నిర్ణయింపవలసి యున్నది.

హస్తివర్మ లిరువురు అందొకడు సాలంకాయనులకు కూటస్థుడు. అతడు వైంగేయక హస్తివర్మ. ఇతడు సముద్రగుప్తునిచే ఓడింపబడినట్లు అలహాబాదు శాసనమున గలదు. కావున క్రీ. శ. 350 నాటివాడు. కావున అతని కాలము నిశ్చితముగా తెలియుచున్నది. రెండవవాడు గాంగహస్తివర్మ. ఈతని కాలము తెలిసికొనుటకు ఉపాయము లేకున్నది. సాధారణముగా చారిత్రకులు సముద్రగుప్తుని కాలము నుండియే ఇతరుల కాలములన్నియు నిర్ణయించుచున్నారు. ఈ హస్తివర్మ కాలమును లిపికి కొంత ప్రాచీనత్వము నంగీకరించి సముద్రగుప్తుని తరువాతిదిగా చెప్పుచున్నారు. కాని అది సరియైన మార్గమని అంగీకరించుట న్యాయముకాదని నా తలంపు. ప్రాచీన కళింగరాజులు తమ విజయరాజ్య సంవత్సరములను చెప్పుకొనిరి.

| | | |
|---|---|---|
| శత్రుదమన మహారాజు | ...... | 9 సం॥ |
| చండవర్మ | ...... | 17 సం॥ |
| నందప్రభంజనవర్మ | ...... | 20 సం॥ |
| తిర్లింగి శాసనకర్త | ...... | 28 సం॥ |
| ఇంద్రవర్మ | ...... | 39 సం॥ |
| దేవేంద్రవర్మ | ...... | 51 సం॥ |
| (రాజసింహ) హస్తివర్మ | ...... | 80 సం॥ |
| (రాజసింహ) ఇంద్రవర్మ | ...... | 87 సం॥ |

ఈ రీతిగా 397 సంవత్సరముల వఱకు తమ కాలములను తెలుపుకొనియుండిరి వీరు ప్రాచీన గంగవంశమునకు చెందినవారు గాంగులనబడుదురు. తరువాతి రాజులు శాలివాహన శకములను పేర్కొనుచున్నారు. కావున వారి విషయమై ఏ సందేహములును లేవు గాంగేయ హస్తివర్మ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములనేకాని శకాదికాబ్దములను దెలుపలేదు. అయినను అతని శాసనమునందలి అతిప్రాచీనమైన ఆంధలిపినిబట్టి యతనిని సముద్రగుప్తునికంటె నర్వాచీనునిగను తక్కిన కళింగ రాజులకంటె పూర్వుడుగను నిర్ణయించినారు. ఆ లిపినిబట్టియే ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో హస్తివర్మ ఉర్లాం శాసనము

ప్రకటించిన వారాతనిని క్రీ. శ. 2, 3 శతాబ్దముల వాడని నిర్ణయించిరి. ఇందెవరి వ్రాత సిద్ధాంత మగును?

వేదవేదాంగాది సమస్త వాఙ్మయమును హృదయ ఫలకములందే లిఖించికొని ప్రాచీన విజ్ఞాన భాండాగార మును భద్రపఱచుకొనెడి యా దినములలో లిపి పరి ణామము అంతవేగము గాదు. మూడు, నాలుగు శతా బ్దములకించుక మార్పు కొన్ని యక్షరములలో నగ పడును. ఎన్ని శతాబ్దములుగానో వచ్చుచున్న తాళపత్ర లిపి ముద్రణ యంత్రములవలన విశేషముగా మార్పు చెందినది. అయినను నీ ఊటకలముల కాలమందు సైతము సపఱాము, బండ్డి, అంగాకరకాయ, రోంకలి, పమ్మిం చెను, అంమ్మనోము. లొవ, చేసెనూ మొద లగు వ్రాతలు కొందఱి లేఖలలో నగపడుచునే యున్నవి. కీ. శే. మా తండ్రిగారు తాటాకు పైని వ్రాయునపుడు గంటమును బట్టుకొను గనే ఫౌంటన్ పెన్నుగూడ బట్టుకొని వ్రాసెడివారు. ఏతావతా చెప్పదలచినదేమనగా లిపి బహుశతాబ్దము లకుకాని మార్పుచెందుట ఆ ప్రాచీనకాలమున సంభ వము గాదని.

ఈ ప్రాచీన శాసనము కాలము నిర్ణయించుటకు వేఱొక మార్గము నూతనముగా గోచరించినది దాని నీ క్రింద చూపుచున్నాను మొదట చంద్ర గుప్తుని కొడుకు సముద్రగుప్తుడును; నాతని కొడుకు రెండవ చంద్రగుప్తుడునుగదా వర్గత్రయము ఈ ముప్పురు రాజులలో నేయెకరికో విక్రమాదిత్యు డను బిరుదము గలదు అతని యాస్థానమున నవ రత్నములని ప్రసిద్ధి నందిన కవిపండిత ప్రవరు లుండువారు వారిలో కాళిదాసు మహాకవి యొకడు.

ధన్వంతరి క్షపణ కామరసింహ బాణ
భేతాళభట్ట ఘటకర్పర కాళిదాసాః
ఖ్యాతో వరాహమిహిరో నృపతేస్సభాయాం
రత్నాని వై వరరుచి ర్నవవిక్రమస్య॥

అను సూక్తి ప్రసిద్ధమే.

రెండవ చంద్రగుప్తుడే విక్రమాదిత్యుడని కొందఱును, సముద్రగుప్తుడే విక్రమాదిత్యుడనియు నాతని దండయాత్రనే కాళిదాసు రఘుదిగ్విజయ యాత్రగా వర్ణించినాడని కొందఱును జెప్పుదురు. చంద్రగుప్తు లిరువురును విక్రమాదిత్యులైన గావచ్చును కాని విద్యాధినాథులుమాత్రము గారను టకు సంశయములేదు. సముద్రగుప్తుడు సర్వవిద్యా సనాథుడు, సకల కళాపారీణుడునని యలహాబాదు శాసనమున హరిషేణుడు చెప్పనే చెప్పినాడు అట్టి విద్యా వివేకములు గలవాడు కళాపిపాసువు నగుటచేతనే తన యాస్థానమున కవిపండిత ప్రముఖుల నవరత్నముల నుంచుకొని భాషాశాస్త్రములకు వృద్ధిచేకూర్చినాడు. సముద్రగుప్తుని అలహాబాదు శాసనమునకును కాళి దాసుని రఘువంశమందలి మూడు నాలుగు సర్గముల కును అత్యంత సన్నిహిత సంబంధమున్నది. దానిని వేఱొకమాఱు తెలుపుదును.

కాళిదాసు సముద్రగుప్తుని యాస్థానకవియైనను గాకున్నను నీతని సమకాలికుడనుట కేయభ్యంతరము లేదుకదా! కాబట్టి కాళిదాసు క్రీ 350 ప్రాంతమువాడని గ్రహించుట కేయభ్యంతరము నుండదు కాళిదాసుని కాలము ననుసరించి ప్రాచీన గాంగరాజుల కాలము నిర్ణయించుటకు గోచరించిన నూతన మార్గమేదనగా—కాళిదాసు తన నాటక త్రయ మున మొదటిదగు మాళవికాగ్నిమిత్రము ప్రస్తా వనమున 'ప్రథిత యశసాం భాస సౌమిల్లక కవిపుత్రా దీనాం ప్రబంధానతిక్రమ్య వర్తమాన కవేః కాళి దాసస్య క్రియాయాం కథం పరిషదో బహుమానః' అని భాసుని దనకు బూర్వుడుగాను బహుమాన్యుడు గాను శ్లాఘించినాడు. ఇంతియకాక భాసుని వాక్య మును 'దేవస్య మండోదరీ... సేయం శక్రరిపోరశోక వనికాభగ్నేతి విజ్ఞాప్యతాం' అను పదములుగల దాని నను కరించియే —

పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం
యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనా విభవతాం
స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమ ప్రసూతి సమయే
యస్యా భవత్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం
సర్వైరనుజ్ఞాయతామ్॥

అను శ్లోకమును రచించినట్లు స్పష్టపడుచునే

యున్నది. కాబట్టి కాళిదాసునకు భాసుడు పూర్వుడు. ఎంతకాలము పూర్వుడో యని చూచినపుడు మూడు తరములైనను బూర్వుడై యుండునని యు, ప్రథమున కిరువదేనేండ్లు చొప్పున లెక్కించిన డెబ్బదేనేండ్లు ప్రాచీనుడుగా నగుననియు దెలును అయినచో కీ. శ. 350 ప్రాంతముననున్న కాళిదాసునికంటె బూర్వుడగు భాసుడు క్రీ శ. 290 ప్రాంతమువాడగును. ఇంకను గొంత పూర్వుడైనను గావచ్చును.

భాసుని కాలము తెలిసినచో తక్కిన విషయములును సుగమములగును. భాసుని నాటకములు పదమూడింటిలో తలతోకలు (ప్రస్తావనా భరత వాక్యములు) లేని దొక్క దరిద్రచారుదత్తమె. తక్కిన యన్నిటియందు నా రెండు నొక్క రీతిగనే యున్నవి. అందు భరతవాక్య మిది —

ఇమాం సాగర పర్యంతాం
హిమవద్వింధ్య కుండలామ్
మహీ మేకాతపత్రాంకాం
రాజసింహః ప్రశాస్తునః॥

ఈ శ్లోకమున నిర్దేశింపబడిన రాజసింహుడెవడు? ఏ దేశపువాడు? ఇది యాతని బిరుదుమా? లేక నామమా? పదుమూడు నాటకములందు ప్రశంసింపబడిన వాడొక్కడా? లేక పెక్కురా? అను ప్రశ్నముల కుపలబ్ధములగు కావ్యనాటకాదులందు సమాధానము లభింపదు. ఏ గద్యపద్య ప్రబంధములందుగాని దృశ్యశ్రవ్యకావ్యములందుగాని రాజసింహుడను పేరగపడలేదు. అక్కడక్కడ వర్ణనావసరమున నితర ప్రశస్తి వాచక పదములతో గూడి యీ పదమును గోచరించినను నీ కృతులందువలె బిరుద వాచకమునుగాదు· పేరసలేకాదు ఇంక నీ బిరుదాంచితుని గనుగొను టెట్లు? భాసునిచే బహుళముగా సకల మహీమండలమును ప్రశాసించుగాతమని యేరాజ సింహు డాశాసింపబడివాడో యాత డీకళింగ మహీమండల శాసనుడు. ప్రాచీన గాంగరాజుల శాసనములందిత డగపడును. ఒక్కపురుషుడు గాడు—ఇరువురు రాజులు. ప్రాచీన గాంగరాజుల శాసనములలో ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరము 28 నాటి తిర్లింగ శాసనమును 80, 82 సంవత్సరములనాటి హస్తివర్మ ఉర్లాం, నరసింగపల్లి శాసనములను 87 సంవత్సరమునాటి ఇంద్రవర్మ అచ్యుతాపుర శాసనమును లిఖించినాడు. చెక్కినవాడు నొక్క పురుషుడే. భానుచంద్రుని కొడుకు వినయచంద్రుడనువాడు 28 సం॥ శాసనమున 'ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరస్య అష్టావింశతి తమస్య ఫాల్గుణ కృష్ణాష్టమ్యామ్' అనియు 80, 82 సం॥ శాసనములందు 'ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరా అశీతిః కార్తీక దిన 7 (సప్తమియా).

ఇదం వినయచంద్రేణ భానుచంద్రస్య సూనునా శాసనం రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా మండలాగ్ర వినిష్పేష నిష్పిష్టారాతి సంహతేః। శ్రీమకోఽ ప్రతి ఘాజ్ఞస్సరణాభీతస్య శాసనమ్ అనియు, అచ్యుతాపుర శాసనమున 'ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరాః సప్తాశీతిః (87) చైత్రామావాస్యాం

ఇదం వినయచంద్రేణ భానుచంద్రస్య సూనునా।
శాసనం రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా॥'

అనియు లిఖించినాడు. వీనిలో తిర్లింగ శాసనకర్తకు (దాతకు) రాజసింహ బిరుదము లేదు. హస్తివర్మకు, ఇంద్రవర్మకు మాత్రమే కలదు. భాసుని నాటకముల యందలి రాజసింహుడు ఒక్కడో? పెక్కురో? మనకు తెలియదు. ఒక్క కవి అన్ని నాటకములు వ్రాసినపుడు ఆ నాటకములందు ప్రసక్తుడైన రాజసింహుడు గూడ ఒక్కడే అనుటకు విప్రతిపత్తి ఏదియూ ఉండదు. ఆ రాజసింహుడు ఈ గాంగామలకులతిలకులలో నెవడో ఒకడేయని యనవచ్చును. ఎవడోయన నేల— హస్తివర్మ శాసనముచే గాంగామలకులప్రతిష్ఠుడైన మహారాజ హస్తివర్మయేయై యుండును.

హస్తివర్మ కళింగమున గాంగ సామ్రాజ్యమును స్థాపించినవాడు. అతని రాజ లాంఛనము సింహము. ధాన్యము మొదలగునవి కొలుచు కొలపాత్రలపై సింహము బొమ్మయు, దానిక్రింద మహారాజ హస్తివర్మణః అను పేరును పోతపోయబడుచుండెడివి. ఏదో కొలపాత్ర యొక్క చిన్నముక్కమీద ఈ రాజముద్రిక లభించినది. అది శాసన శాఖావారికి పంపబడినది. కాబట్టి ఇతడే ప్రాచీన గాంగరాజులందఱిలోను మిక్కిలి ప్రసిద్ధుడు. ఇతనికి కేవల రాజసింహ బిరుదమేగాక రణాభీత బిరుదము మున్నట్లు తెలియనగును.

మండలాగ్ర విని ష్పేష నిష్పిష్టారాతి సంహతేః!
శ్రీమతో౽ ప్రతిఘరాజ్ఞ స్సరణాభీతస్య శాసనమ్॥

అను శ్లోకమువలన గూడ ఇతడు మహాపరాక్రమశాలి యనియు సకల కళింగములను ఏకఛత్రముగా పాలించిన చక్రవర్తి యనియు స్పష్టము. స్పష్టముగా నీతడు రాజ్యమున కెపుడు వచ్చినాడో, ఎంతకాలము పాలించినాడో మనకు నిర్ణయించుట కవకాశము లేదుగాని ప్రవర్ధమాన విజయరాజ్య సం॥లు 87 నాటికి కీర్తిశేషుడైనట్లు మాత్రము ఇంద్రవర్మ శాసనమువలన తెలియుచున్నది హస్తివర్మయే రాజసింహుడనియు, ఇతని కాలముననే ఇతని యాస్థానమునందే భాసుడు కవిగా నుండినట్లు నిర్ణయింపవచ్చును. లేనిచో ఇంద్రవర్మ (అచ్యుతాపుర శాసనకర్త) హస్తివర్మ కుమారుడే యైన యెడల అతని కాలమున ఆతని ఆస్థానమందు కూడనుండి తన నాటకమును రచియించి భారత వాక్యములందు తన ఏలికలను పేర్కొనుచు కృతజ్ఞత చూపించిన వాడు నగును. కాబట్టి భాసుడును, హస్తివర్మయు సమకాలికులు.

తరమునకు 25 సం॥ లు లెక్కచూచుకొనినచో క్రీ. శ. 350 లో నున్న సముద్రగుప్త కాళిదాసులకంటె భాసుడు హస్తివర్మయు 3 తరములు పూర్వులగుదురు. కావున క్రీ. శ 275 ప్రాంతము వారగుదురు. ఆ హస్తివర్మ కాలము విజయరాజ్య సం॥ 80 గావున ప్రవర్ధమాన విజయరాజ్య సం॥ 9లో దానమిచ్చిన శత్రుదమన మహారాజు క్రీ శ 204 ప్రాంతము వాడగును. కాబట్టి 2 వ శతాబ్దము చివరను 3 వ శతాబ్దము ప్రారంభమునందును పాలించిన వాడగును. ఈతడు కేవలము గాంగశకము ప్రారంభించినవాడు కాడు. 6 వ సం॥లో పాలించిన గాంగరాజు వేతొకడున్నాడు. కావున శత్రుదమనుడు ద్వితీయుడై యుండును. కనుక ఈ పెద్దదూగాం శాసనము క్రీ. శ. 175 నుండి క్రీ. శ. 204 మధ్య కాలపుది. కావున అతిప్రాచీనము. క్రీ. శ. 120 ప్రాంతమున నృతినందిన కళింగరాజు ఖారవేలుని హస్తిగుంఫా శాసనమునకును ఈ శాసనమునకును మధ్యకాలమున శిలాతామ్రశాసనము లేవియు నింతవఱకు ఉపలబ్ధము కాలేదు.

లిపినిబట్టి కాలము నిర్ణయించుట మిక్కిలి కష్టమైనది. భాష వ్యవహారములో మారినంత వేగముగా లిపి మారదు. వ్రాతసాధనము లంతగా సులభముకాని యా ప్రాచీనకాలమున ముందుగా చేతివ్రాత మార్పుచెందిన కొంతకాలమునకుగాని తామ్రశిలాఫలకములు చెక్కుటలో మార్పులు సంభవింపవు. కాబట్టి శతాబ్దముల వ్యవధిలోగాని లిపిమారదు. పెద్దదూగాము శాసన లిపికిని, హస్తివర్మేంద్రవర్మల లిపికిని భేదముగనబడలేదు. లేఖక ప్రమాదమువలన రణాభీతుడనుటకు రణభీతుడని చెక్కబడినదికదా! అక్కడ హ్రస్వ, దీర్ఘముల కాకాలమున నొక్క రూపమే యుండెడి దనవచ్చునా!

ప్రాచీన గాంగుల శాసనములలో పూర్వతర శాసనములు బ్రాహ్మీలిపిలోనుండి పరిణామమందిన వేంగి లిపిలో నున్నవి. విజయసింహపురము (సింగుపురము) రాజధానిగా వేంగిరాజులీ ప్రాంతమును కొంత కాలము పాలించిరి. వారి సంబంధమున నా లిపి యీ ప్రాంతమునకు వచ్చినది. బప్పభట్టారకుడు సాలంకాయనుల శాసనములయందగపడును. బప్ప పదమును, భట్టారక పదము నీ దూగాం శాసనమున గలవు. వేంగిరాజులు సాలంకాయనులు హస్తివర్మాదులు గాంగా మేకులతిలకులు. శత్రుదమనుడన్నచో తన కుల గోత్రము లేవియు చెప్పుకొనకున్నను బప్పపద వ్యవహారము భట్టారకపాదానుధ్యాతత్వము నాతనికి గల సాలంకాయన సంబంధమును సూచించుచున్నది.

హస్తివర్మ వంశకులగు పాలకులు కళింగములో కొంత కొంత భాగమును వశపఱచుకొని పాలించిన చిన్న రాజులేకాని మహారాజులు గారు. స్వాసిధారా పరిస్పందాధిగత సకల కళింగాధి రాజ్యముగలవాడు తొలుత హస్తివర్మమాత్రమే. తరువాతి వారాబిరుద మను వృత్తము గావించుకొనిరి. వేంగిలిపిలోను, నందనాగరీలోను, తెలుగు కన్నడ లిపిలోను కనబడుచున్న శాసనము లన్నియు మధ్యకళింగమగు శ్రీకాకుళము జిల్లాలోను, అందును ముఖలింగ, కళింగపట్టణములకు చేరువనే కనబడుచున్నవి. కాని మందసా కుత్తరమున నొక్కటి యయిన గనపడలేదు కారణ మాయుత్తర ప్రాంత మరణ్యమయమై జనావాసశూన్యమగుట కతన గాబోలు. ఉత్తరమున భువనేశ్వర ప్రాంతమును పాలించిన మొదటి రాజు అనంతవర్మ చోడగంగ మహారాజు. అతని పిదప

నాతని వంశమక్కడ నెలకొనినది. కాలక్రమమున మత్కళులుగామారి ఒకప్పుడు నెల్లూరు జిల్లా వఱకు రాజ్యము నేలిపిన కపిలేంద్ర ప్రతాప వీరరుద్రాది గజపతు లాతని వంశమువారే.

శాసన పరిశోధకులకు భాస నాటక విషయములును వాఙ్మయ విమర్శకులకు శాసన విషయములును సుదూరములగుటచే సుమారు 50 ఏండ్ల నాడు హస్తివర్మ శాసనము ప్రకటింపబడినను ఆ రెండింటి సంబంధమును ఎవ్వరునూ స్పృశింపరైరి నేడు ఈ శాసనమువలన నాకాయవకాశము కలిగినది బుద్ధికి గోచరములైన విశేషాంశములను యథామతిగా తెలుపుకొన్నాడను. నా ఊహలు అంగీకరింపనినాడు సరియైన ప్రమాణములతో కాలనిర్ణయము గావించు బాధ్యత సహృదయులపై నుండునని సవినయముగా మనవి చేయుచున్నాను.

## వ్యవసానము

ఈ పెద్ద దూగాము శాసనమువలన దెలిసిన విశేషములే మన ప్రాచీన గాంగశకము క్రీ. శ. 2 వ శతాబ్దముతో నారంభించి (చీడివలస శాసనము 397) నాలుగు శతాబ్దములు ప్రవర్తించినది. తరువాత కొందఱు విజయరాజ్య సంవత్సరములను శక వర్షములను గూడ బేర్కొనుటవలన గంగ గాంగ వంశముల సంధికాలము నిర్ణయించుట కవకాశమేర్పడు ననియు, నా పరిశోధనమునకు యత్నింతురుగాక యనియు ప్రార్థించుచు సెలవు తీసికొనుచున్నాను.



# తెలుగు హిందీ సాహిత్యములలో ఆదునిక యుగకర్తలు-

## (కందుకూరి వీరేశలింగము—భారతేందు హరిశ్చంద్రుడు)

శ్రీ బయ్యా వెంకటసూర్యనారాయణ

ఆధునిక భారతీయ భాషలలో తెలుగు, హిందీ భాషల కొక ప్రత్యేక స్థానము కలదు. తత్తద్భాషాభాషి జనసమూహమును లెక్కించి చూచిన నేటి భారతమున హిందీ ప్రథమస్థానమును, తెలుగు ద్వితీయ స్థానమును ఆక్రమించుచున్నవి. ఇందొకటి ఆర్య భాషా కుటుంబమునకు జెందినది, రెండవది ద్రావిడ భాషా పరివారమున జేరినది. ఒక విధముగా నాంధ్రభాష ఆర్యద్రావిడ భాషా సంస్కృతులకు కూడలివంటిది. ఉత్పత్తి వికాసములనుబట్టి హిందీకంటె తెలుగు ప్రాచీనమైనదయ్యు, నే డుభయ భాషలును విశాలమును, ఉత్కృష్టమునునగు సాహిత్యముతో పురోగమించుచున్నవి. ఇట్టి తెలుగు—హిందీ సాహిత్యములలో నాధునిక యుగకర్తలగు మహాపురుషులు కందుకూరి వీరేశలింగము, భారతేందు హరిశ్చంద్రుడు.

వీరేశలింగము పవిత్ర గోదావరీ తీరస్థమై చరిత్ర ప్రసిద్ధమగు రాజమహేంద్రవరపురంబున క్రీ. శ. 1848 ఏప్రిలు 16 వ తేదీని జననమందెను. పుణ్యదంపతులగు పున్నమాంబా సుబ్రహ్మణ్యము లతనిగన్న భాగ్యశాలురు బాల్యముననే తలిదండ్రుల గోల్పోయిన ఈ యదృష్టహీనుడు తన వలన ఆంధ్రజాతి, ఆంధ్రసాహిత్యము అదృష్టవంతములగునట్లు చేసిన యఖండ ప్రజ్ఞానిధి. పెంచిన పెదతండ్రి సైతము 1867 లో మరణింపగా ఆర్థిక స్థితి, ఆరోగ్య పరిస్థితికూడా సరిగాలేని జీవితపథమున సమాజ సాహిత్యద్వయోద్ధరణోద్యమ రూపమగు దివ్య రథమును పూనికలో, నైపుణిలో ముందుకు సాగించి గమ్యమునుచేరిన ధన్యజీవి.

ఈయన ముఖ్యవృత్తి అధ్యాపకత్వము. పదుగురు విద్యార్థులకేకాక జాతికే దేశికుడైన యుగపురుషుడు వీరేశలింగముపంతులు. సమాజసంస్కరణము, సాహిత్య విస్తరణము, వాని మూలమున దేశాభ్యుదయము వీరి జీవితాదర్శములు. ఆర్థిక బలము, శరీర బలము ఎట్లున్నను, నైతికబలమున, ఉత్సాహబలమున లోపమిసుమంతయు నాత డెన్నడును అనుభవించలేదు. నాటి సామాజికస్థితిని పరికించి, తదధోగతికి హేతువుల నారసి, తదభ్యున్నతి కనువగు నుపాయముల నన్వేషించి యాచరణపూర్వకముగు ప్రబోధము గావించిన దేశహితైషి యాతడు. మూఢాచారములకు మనుగడనే ముడుపు పెట్టి, దైన్యభారమున మూల్గుచున్న జాతికి దేశకాలముల కనుగుణముగ మారని ఆచారములు, ఆదర్శములు మానవుని పురోగతికి సహకారులుగాక శృంఖలములవలె తన్నిరోధకములేయగునని యుద్ఘోషించిన ధీరుడు. స్త్రీ జనాభ్యుదయమునకై యాతడు తన జీవిత సర్వస్వమునే యర్పించెనన్న నత్యుక్తి కానేరదు.

అప్పటి ఆంధ్రసాహిత్యస్థితికూడ అంతంతగనే ఉండెను. ఇంచుమించుగ నెనిమిదిన్నర శతాబ్దుల కాలము సంస్కృత సాహిత్యస్రవంతికి కాల్వలుకట్టి ఆంధ్ర సాహితీ కేదారముల పండించుట జరిగినది. చంపూరూపముననో, ద్విపదరూపముననో, గద్యరూపముననో తెలుగు కవులకు సంస్కృత కావ్యపురాణేతిహాసాదులే అనువాదయోగ్యములు, అనుకరణ యోగ్యములునైనవి. రానురాను నవ్యత, విశిష్టతలేని అంధానుకరణ రూపమగు క్షీణదశ సాహిత్యము నావరించినది. ఒకే సాహిత్యముయొక్క ప్రభావము వర్తిల్లిన ఈ దీర్ఘకాలపరిమితిని జూచిన ధ్రువ

ప్రాంతములందలి రేయింబవళ్లవలె విసువు జనియింపక మానదు కదా! అట్టి తరుణమున నీతడు ప్రభావవంతమగు నాంగ్ల సంస్కృతి సంపర్కమున నేర్పడిన భావవిప్లవమును ఉదాత్తమగు నాంగ్లసాహిత్య సంపర్కమున పరిచితములైన నూత్న రూపములలో వెలయించి, సమాజోద్ధరణముతోబాటు సాహిత్యోద్ధరణమునకును హేతుభూతుడైనాడు.

1867 ప్రాంతములోనే వీరేశలింగము కేశవ చంద్రసేనుని యుపన్యాసములను పఠించి, బ్రహ్మ సమాజ మత ప్రభావితుడయ్యెను. క్రమముగ నీతడు పరిశుద్ధాస్తిక ధర్మప్రచారముగావించి, ఏకేశ్వరోపాసనను ప్రబోధించి, దక్షిణదేశమున బ్రహ్మసమాజ మత విస్తరణకు ప్రధాన కారకుడయ్యెను. బ్రాహ్మ ధర్మ స్వీకారానంతర మీతడు క్రమముగ యజ్ఞోపవీతమును గూడ త్యజించి అదే సూత్రముతో చుట్టబెట్టి వర్ణభేదాదుల నైతము ఆవల బారవైచినాడు. ఇతని సమాజ సంస్కరణములలో మొట్టమొదట పేర్కొనదగినది స్త్రీ పునర్వివాహోద్యమము. సమాజమంతయు నెదురు తిరిగినను నీత డీయుద్యమమును వీడక ధైర్యముతో ముందడుగు వైచినాడు. బహుదేవతారాధన, వేశ్యావృత్తి, లంచగొండితనము మున్నగువానిని ప్రతిఘటించినాడు. ఎడతెరపిలేకుండ వ్రాసి పత్రికలలో ప్రచురించిన రచనలు, అడుగడుగున నిచ్చిన యుపన్యాసములును ఈత డీరణరంగమున నుపయోగించిన దివ్యాస్త్రములు. అవిద్యానిర్మూలనమునకు; విజ్ఞాన వ్యాప్తికి పాటుపడుచు నందెక్కుడుగ నీతడు స్త్రీ విద్యను ప్రోత్సహించినాడు; బాల్య వివాహముల నిరసించి వితంతు వివాహముల సమర్థించెను. ప్రజా హితము నపేక్షించి యీతడు నిర్మించిన పాఠశాలలు, పఠనమందిరములు, పురమందిరములు, ప్రార్థనా మందిరములు, పుస్తక భాండాగారములును ఎన్నో కలవు. ఇవి యీతని యచంచల సమాజసేవా తత్పరత కేనాటికిని చెక్కుచెదరని స్మృతి చిహ్నములు. ప్రభుత్వ మీతనిని 1893 లో 'రావు బహద్దరు' బిరుదునిచ్చి సన్మానించినది. 1898 లో చెన్నపట్టణమున జరిగిన హైందవ దేశీయ సాంఘిక మహాసభ కగ్రాసనాధిపత్యము వహించియుండ నీతనికి శ్రీ మహాదేవ గోవింద రానడే దక్షిణదేశవిద్యాసాగరుడని బిరుదునొసంగెను. 1908 లో హితకారిణీ సమాజ స్థాపన మొనర్చిన వీరేశలింగము సుమారు ఏబది వేల రూప్యముల విలువగల తన ఆస్తినంతను ఆ సంస్థ కిచ్చివేసిన వదాన్యశేఖరుడు.

వీరేశలింగము సంఘసంస్కరణమునకై యెంతగ కృషిచేసెనో ఆంధ్రసాహిత్య విస్తరణకు కూడ అంతకు మించిన పూనికతో పనిచేసెను.

'దేశ భాషాభివృద్ధికై లేశమైనం
బ్రాలు మాలక పాటుబడ నిచ్చ గలవాడ'

అని యీతడు వివేకవర్ధనిలో తన భాషాసేవాతత్పరతను వెల్లడించి యున్నాడు. ఈతని రచన లసంఖ్యాకములు. సమాజ సంస్కరణమును దృష్టియందుంచుకొనియే అందు పెక్కింటికి రూపకల్పన గావించుట జరిగినది. చిన్ననాటనే ఆంధ్రసాహిత్యముపై అభిరుచి గల్గి చిన్నచిన్న పద్యములు, శతకములు రచియింప మొదలిడినను పంతులుగారి రచనావ్యాసంగము ప్రధానముగ 1870 ప్రాంతమునుండి 1900 ప్రాంతము వరకు జరిగియుండెనని చెప్పవచ్చును. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమువంటి గారడీ రచనలు, సంధి విగ్రహములవంటి పాండిత్య స్ఫోరక రచనలు గావించియు, అవధానములు చేసియు నారంభించిన వీరేశలింగము అచిరకాలములోనే అది సాహిత్యమునకు గాని, సమాజమునకుగాని నూత్నశకమున నేమాత్రము నుపకరింపదని యెరింగి, పండితైక వేద్యముకాక సర్వోపభోగ్యమగు సాహిత్యమును సృజియింప బూనుకొనెను. ఆంధ్రభాషా సాహిత్యముల గ్రహస్థితిలో శనీశ్వరుడు గ్రహాంతరస్థానములోనికి కాలు చాచని ఒక శుభముహూర్తమున నీ మహనీయునిలో ఈ మార్పు గల్గియుండును.

ఆధునిక సాహిత్య యుగమహారథమును ముందుకు సాగించిన చక్రద్వయము ముద్రణకళ, పత్రికా రచనము. వీరేశలింగము పత్రికారచనము సేయ నారంభించునాటికి తెలుగులో కొన్ని పత్రికలు వెలువడి యున్నను తత్త్వయుక్తమగుభాషగాని, తదంతర్గత విషయములుగాని సమాజ, సాహిత్యముల పురోగమనమున కంతగ సహకరించునట్లు లేవు. వివేకవర్ధని, హాస్యసంజీవని, సతీ హితబోధిని, చింతామణి మున్నగు

పత్రికల నిర్వహించి యీతడొక నూత్న చైతన్యమును గల్గించెను. వానిలో సారళ్యసంశోభితమగు భాష, సమాజ సంస్కారకములగు సదుపదేశములు, సాహిత్యవిస్తారకములగు సమ్యగ్రచనలు వెలయించి యీ హితకారి సమాజ సాహిత్యరంగములలో నొక నూత్న యుగమునే సృష్టించినాడు. పాండిత్య ప్రదర్శనముగాని, ద్రవ్యార్జనముగాని లక్ష్యములుగాక భాషాభివృద్ధి, దేశాభివృద్ధి మాత్రమే తన పత్రికలకు ప్రయోజనములని వివేకవర్ధనిగూర్చి యీతడు చెప్పియున్నాడు.

ఆంధ్రభాషా సాహిత్యముల వికాస విస్తరణముల కీతడొనరించిన కృషి బహుముఖము. ఇతని యుద్యమమారంభమగునప్పటికి తెలుగు భాషలో రెండు ప్రధాన శైలులు ప్రచారములో నున్నవి. ప్రాచీన సాహిత్యముతోబాటు పరవస్తు చిన్నయసూరి, కొక్కొండ వెంకటరత్నము మున్నగు వారిచే ప్రచలితమైన శుద్ధ క్లిష్ట గ్రాంథిక మొకటి; కొన్ని వ్యాఖ్యలలోను, వేదాంత గ్రంథములలోను, కథా రచనలయందును ప్రచారముపొందిన వ్యావహారిక మింకొకటి. ఇందొక శైలిలో ననావశ్యకమగు భారమున్న రెండవ దానిలో ననుచితమగు బలహీనత యిమిడి యున్నది. కావున నీ రెండింటికిని మధ్యేమార్గము నవలంబించి, ఉభయ పక్షముల యాదర్శముల సమన్వయించి, సాహిత్యమునకు జాతికి ఉపకారకము, సర్వజనోపభోగ్యమునగు సరళగ్రాంథిక రచనను పంతులుగారు రూపొందించి వెలయించియున్నారు.

వివిధ విషయములపై లిఖియించి యీతడు పత్రికలలో ప్రచురించిన వ్యాసము లసంఖ్యాకములు. ఇందు దేశాభిమానము, దేశభాషలు, ఆంధ్రభాషాభివృద్ధి, హిందూ దేశాభివృద్ధిమార్గము, స్త్రీ విద్య, శిశుపోషణము, కన్యాశుల్కము, బాల్యవివాహము, కాలముయొక్క విలువ, కృష్యాది వ్యాపారములు మున్నగునవి కొన్ని. ప్రాచీన గ్రంథముల సేకరించి ముద్రింపించి బ్రౌనుదొరమార్గము ననుసరించిన యీ సాహిత్య సేవకుడు ఉన్న సాహిత్యమును శిథిలముగాకుండ కాపాడుటతోబాటు వివిధములగు నూత్న పథములలో దానిని విస్తరింపజేసినాడు. ముఖ్యముగ నవ్యయుగమున పద్యముకంటె గద్యము ప్రముఖపాత్ర నిర్వహించగలదని గుర్తించిన దూరదర్శి.

'If life is the creterion and not art, the prose of a nation is far more important than its poetry.' Evans.

వీరేశలింగము తన గద్యరచనల స్వరూప వైవిధ్య విస్తారముల మూలమున 'గద్యతిక్కన' యను బిరుదు గడించుకొన్నాడు; వ్యాసములేగాక నాటకములు, ప్రహసనములు, వ్యంగ్యరచనలు, నవల, జీవితచరిత్రలు, ఆత్మకథ, శాస్త్రగ్రంథములు మున్నగు నెన్నో రచనల గావించి, తెలుగు సాహిత్యమున గద్యయుగప్రవర్తకుడైనాడు. శకుంతలా రత్నావళీ ప్రబోధ చంద్రోదయాదు లితని సంస్కృతానువాద నాటకములు; వెన్నిసు వర్తక చరిత్రము, చమత్కార రత్నావళ్యాదులు ఆంగ్ల నాటకానువాదములు; ప్రహ్లాద హరిశ్చంద్రాదులు స్వతంత్రములు; బలాత్కార గాన వినోదము, బ్రాహ్మ వివాహము మొదలగునవి ప్రహసనములు; రాజశేఖరచరిత్ర ఆంగ్లానుకరణమగు నవలా రచనము; నీతికథలు, సత్యరాజాపూర్వదేశయాత్రలు మున్నగునవి కథా రచనలు; విక్టోరియా మహారాజ్ఞి చరిత్ర, జీసను చరిత్ర మొదలగునవి జీవిత చరిత్రలు; 'స్వదేశ సంస్థానాధీశులు' వంటివి చారిత్రకములు. ఈయన క్రమించి కవుల చరిత్ర వ్రాసినాడు; స్వీయచరిత్ర వ్రాసెను, తర్క వ్యాకరణ జ్యోతిషాదులతోబాటు జంతుశాస్త్ర వృక్షశాస్త్రాదులగూడ రచియించెను; విగ్రహ తంత్రాదుల విమర్శను వెలయించెను. ఇట్లీయన రచనలలో విస్తృతి, వైవిధ్యమును గాననగును. స్వీయ ముద్రణాలయమును స్థాపించుకొని, విరివిగా రచనలు సాగించి త్వరత్వరగా ముద్రించుచుండెడివాడట. ఈతని యుపన్యాసములు సాహిత్యములో నొక నూత్నశాఖగ జేరినవి. 1900 నాటికే ఈతని రచనలు పది సంపుటములుగ వెలువడినవి.

1910 సం॥లో పంతులుగారికి పత్నీవియోగము తటస్థించెను; ఆరోగ్యము చెడినది. అట్లయ్యు నీతడు తన సంస్కరణోద్యమముల సడలనీయక 1919 లో మద్రాసు నగరమునగల పుస్తక భాండాగారమున ప్రాచీనాంధ్ర సాహిత్య పరిశోధనకై వెడలినాడు. ఆరోగ్యము చక్కబడలేదు. తుదకు 1919, మేనెల 27 వ తేదిని యీ మహారథుడు కీర్తిశేషుడైనాడు. తన జీవితాధ్యాయము త్వరలో ముగియు నున్నదని యెరింగి తుది కోర్కెలుగ నీతడు వ్యక్తము

చేసినవి — రాజమహేంద్రవరమున నొక గ్రంథాలయ స్థాపనము, కవుల చరిత్ర పూర్తిచేయుట, తెలుగు భాషకు సమగ్రమగు వ్యాకరణము నొకదానిని రచించుట. తుది గడియలలో స్వైత మాత్మక్లేశమును గణియింపక ఆంధ్ర సాహిత్యాభివృద్ధి గూర్చియే స్మరించిన ఈ పునీతుని కెన్ని ధన్యవాదము లర్పించి, ఎంతటి కృతజ్ఞతను దెలిపి జాతి ఋణవిముక్తము కాగలదు!

**భారతేందు హరిశ్చంద్రుడు :**

అనాదికాలమునుండి సరస్వతీ పీఠముగ ఖ్యాతి గాంచిన పవిత్ర కాశీ క్షేత్రమున భారతేందు హరిశ్చంద్రుడు 1850 సెప్టెంబరు 9 వ తేదీని జననమందెను. ఈతని తండ్రి శ్రీ గోపాలచంద్రుడిరువదియేడువత్సరములైన జీవింపక పోయినను, ఆ అల్పకాలములోనే సుమారు నలువది గ్రంథముల రచియించినాడు. పండితపుత్రునివలెగాక తండ్రిని మించిన సుతుడై భారతేందు హరిశ్చంద్రుడు శతాధిక గ్రంథకర్తయై ఖ్యాతి గడియించినాడు. ఈతని యైదవయేట తల్లియు, తొమ్మిదవయేట తండ్రియు స్వర్గస్థులైరి. బాల్యముననే మాతాపితరుల గోల్పోయియు, నల్పాయువయ్యు నీతడు ప్రజ్ఞాశాలియై హిందీ సాహిత్యమున నొక యుగకర్త స్థానము నలంకరించినాడు. తన పదునేడవయేట రచనా వ్యాసంగము మొదలిడినను భారతేందు తరువాతి పదునేడు, పదునెనిమిది వత్సరముల కాలములో నించుమించు రెండు వందల రచనల వెలయించినాడన్న నిక రచయితగానాతని ప్రతిభను గూర్చి చెప్పవలసిన దేముండును!

హరిశ్చంద్రుని దేశభక్తి, మాతృభాషాభిమానము నిరుపమానములు. సమాజ సంస్కరణము, సాహిత్య విస్తరణము ఈతని ధ్యేయములు. ప్రాత రోత, క్రొత్త వింత అన్నట్లుగ నీతడు ప్రాచీన సంప్రదాయములనుగాని, పాశ్చాత్య సభ్యతా సంపర్కజన్య నవ్య సంప్రదాయములనుగాని గ్రుడ్డిగ ననుసరింపలేదు, సాకల్యముగ తెగనాడలేదు. స్వబుద్ధితో వివేచన మొనరించి, మంచి యెచ్చటనుండియైన గ్రాహ్యమే యనియు, నట్లే చెడుగు త్యాజ్యమే యనియు తెలిసి, తెలియజెప్పిన యాదర్శవ్యక్తి యీతడు. అంతిమ శ్వాసము దనుక రాధాకృష్ణ నామస్మరణము సేయుచు నమరుడైన పునీతుడు.

'భారత దుర్దశ'యను తన రచనలో నాటి భారత దేశపు దయనీయస్థితిని నిరూపించి, తదుద్ధరణోన్ముఖ విహ్వలతా పూర్వకమగు సంతాపము నిట్లు వ్యక్త మొనర్చినాడు

రోవహు సబ్ మిలి కై
ఆవహు భారత్ భాఈ,
హా! హా! భారత్ దుర్దశా
న దేఖీ జాఈ

ఈర్ష్యాళువులగు కొందరి ప్రేరణ ఫలితముగ దేశభక్తి పూరితములగు నీతని రచనలపై ప్రభుత్వము వారు కొంత ఆంక్ష విధించినారు. రాజభక్తి కలవాడయ్యు భారతేందు తదర్థమై దేశభక్తికి తిలాంజలులిచ్చు భీరువు, స్వార్థపరుడు కాడు. కావుననే ఆతడు వెంటనే ఆనరెరీ మెజిస్ట్రేటు పదవిని త్యజించినాడు; ప్రభుత్వ సంబంధి కార్యకలాపములలో పాల్గొనక, మాతృదేశమునకు, మాతృభాషకు సేవ యొనర్చుటకై తన జీవితము నంకితము చేసినాడు.

ఈతని మాతృభాషాభిమానము, హిందీకై యీతడొనరించిన కృషి ఇంతింతని చెప్పనలవికాదు. దేశభాషల నాదరించి వాని నభివృద్ధి పొందించినగాని ముక్తిలేదని దేశము నలుమూలల ఘోషించుచు ఈ నాడు మనము గుర్తించిన విషయమును భారతేందు నాడే ఇట్లు వచియించి యున్నాడు.

నిజ్ భాషా ఉన్నతి అహై
సబ్ ఉన్నతికో మూల్,
బిను నిజ్ భాషా జ్ఞాన్ కే
మిటత న హియకో శూల్.

హిందీభాషాసాహిత్యముల కీతడొనర్చిన సేవకు మురిసిన నాటిసమాజము 'భారతేందు' అను బిరుదు నిచ్చి హరిశ్చంద్రునియెడ తనకుగల గౌరవాభిమానములను కృతజ్ఞతా పూర్వకముగ వెల్లడి చేసికొన్నది.

సమాజమును సంస్కరించి యుద్ధరింప నీతడు నిర్విరామముగ కృషియొనర్చెను. నాటి దేశస్థితిని కనులార గాంచిన ఆ సహృదయుని సుకుమార కోమల హృదయ మెంతగా పరితపించినదో భారతదుర్దశ యను నాతని రచన యెరింగింపగలదు. హరిశ్చంద్రుడు అవిద్య, బాల్యవివాహము మున్నగు ననర్థములకు

బలిచ్చై యాక్రోశించుచున్న నాటి స్త్రీసమాజము నుద్ధరింపబూనుకొనెను; మద్యపానము, అస్పృశ్యత మొదలగు పెనుభూతముల కోరలలో చిక్కిన పేద జనులను వాని బారినుండి రక్షింప నుద్యమించెను; హోమియోపతిచికిత్సాలయమును స్థాపించి బీదల కుచిత వైద్య సౌకర్యము గల్పించెను; పాశ్చాత్య శిక్షా విధానములోని గుణవిశేషములను, మన దేశమువ తదావశ్యకతను గుర్తించి 1867 లో చౌఖాంబా పాఠశాల నెలకొల్పెను. అది నేడు పట్టపరీక్షలకు శిక్షణ నిచ్చు కళాశాలగా రూపొంది, హరిశ్చంద్ర డిగ్రీ కాలేజీ యని వ్యవహరింపబడుచున్న విజ్ఞానాభివృద్ధికై యాతడు 1873 లో పఠన మందిరమును స్థాపించినాడు. ఐహిక జీవన వికాస సంబంధియగు కృషిలో నిటు బద్ధకంకణుడయ్యు నాముష్మికచింతనకు హరిశ్చంద్రుడు దూరము కాలేదు. కావుననే 1873 లో 'తదీయ సమాజము'ను స్థాపించి, తదీయ నామాంకితుడగు ననన్య వీరవైష్ణవుడైనాడు.

'బహుదేవతా భూత ప్రేతాది పూజా ఈ,
ఈశ్వర సోఁ సబ విముఖ కిఏ హిందూ ఘబరాయే.

అని బహుదేవతారాధనను విమర్శించెనేకాని, ఏ దేవుని యందును భక్తిలేక నాస్తిక జీవనము గడుపుట అతని యాశయము కాదు.

ఇక నన్నిటిని మించిన దీతని సాహిత్యసేవ. నూనూగు మీసాల నూత్నయౌవనముననే రచయితగా నవతరించిన భారతేందు అల్పకాలములోనే అసంఖ్యాకములగు రచనలు గావించిన అసాధారణ ప్రజ్ఞాశాలి అతని కాలమునాటికి ఖడీబోలీ హిందీకి గద్యములో మాత్రము కొలదిగ స్థానము లభించి యుండెను. పద్యమున వ్రజభాషయే రాచరికము కొనసాగించుచుండెను అట్టితరుణమున నీతడు గద్యమున ఖడీబోలీ స్థానమును సుస్థిరము చేయుటయేగాక పద్యమునగూడ దానికి సముచిత స్థానము లభించుటకనువైన ప్రయత్నము గావించియున్నాడు. భారతేందు హరిశ్చంద్రునివంటి శక్తిసంపన్నుడు, ప్రతిభాశాలి యొసంగిన కేలూతయే ఆధునిక హిందీ సాహిత్యమున ఖడీబోలీకి సర్వాధిపత్యము లభించుటకు హేతువైనదని చెప్పిన సత్యదూరము కానేరదు.

వివిధములగు నీతని రచనలలో కొన్ని గద్యబద్ధములు, కొన్ని పద్యబద్ధములు. భక్తి సర్వస్వము, వైష్ణవ సర్వస్వము, శ్రీయుగళసర్వస్వము మున్నగునవి విష్ణుభక్తి ప్రధానములగు పద్యరచనలు. రాధాకృష్ణు లీతని యుపాస్య దైవములు. వారి ప్రణయ లీలల నాధారముగాగొని యాతడధ్యాత్మ పరమగు శృంగారమును అనేక రచనలలో నభివర్ణించినాడు. ప్రేమమాలిక ప్రేమసరోవరము మున్నగు నిట్టి వెన్నో గలవు. ఇతని రచనలలో హోలీ, వర్షావినోదము వంటివికూడ కలవు. ఒండు రెండు తప్ప భారతేందు కాలమునాటికి నాటకము లధికముగా రచింపబడలేదు. కావున నీతడు పెక్కు నాటకముల రచియించి ఆ శాఖ బాగుగ విస్తరించుటకు తోడ్పడెను. అందు విద్యాసుందర్, చంద్రావలి మున్నగునవి స్వతంత్రములు; రత్నావళీ ముద్రారాక్షసాదులు సంస్కృతమునుండి, దుర్లభబంధు ఆంగ్లమునుండి అనువదింపబడినవి. సంఘ సంస్కర్త యగుటచే ప్రహసన రచనముకూడ నీత డుపేక్షింపలేదు. అందు వైదిక హింసా హింసా నభవతి, అంధేర్‌నగరీ చేపట్టు రాజా మున్నగునవి ప్రసిద్ధములు.

కవివచనసుధ, హరిశ్చంద్ర మాగజీన్, హరిశ్చంద్ర చంద్రిక, బాలాబోధిని మొదలగు వానిని నడిపించి, భారతేందు హిందీలో పత్రికా రచనమున కారంభకుడు గాకపోయినను తద్వ్యాపకుడయ్యెను. ఇందు బాలాబోధిని స్త్రీ విద్యకు సంబంధించినది. ఇతడు తన మాతృభాషయగు హిందీయొక్క ఖడీబోలీ రూపము స్థైర్యవికాసములకును, సమాజ సంస్కరణ సాహిత్య విస్తరణములకును సహకరించు నెన్నో రచనలను తన పత్రికలలో ప్రచురించెను. ఇట్లు ప్రచురింపబడిన యాతని వ్యాసములు వివిధములు. సంగీతసార్, ఉత్సవావలీ వంటివి శిక్షాప్రదములు; కార్తికకర్మవిధి, మాఘస్నానవిధి మొదలగునవి ధార్మికములు; స్వర్గమేఁ విచారసభా కా అధివేశన్, జ్ఞాతి వివేకినీ సభా మున్నగునవి హాస్యవ్యంగ్య ప్రధానములు; మహారాష్ట్రదేశ్ కా ఇతిహాస్, కశ్మీర్ కుసుమ్ వంటివి ఐతిహాసికములు; ఉదయపుర్ కీ యాత్రా, వైద్యనాథ్ కీ యాత్రా వంటివి యాత్రాసంబంధి వర్ణనలు; పంచపవిత్రాత్మాదులు జీవన చరిత్రలు. విషయ

వైవిధ్యము, శైలీ వైవిధ్యము గల్గిన యసంఖ్యాకము లగు నీ వ్యాసములలో హిందీభాష, హిందూదేశము, హైందవ సమాజము మున్నగువాని తత్కాలీన స్థితి చిత్రణముతోబాటు తత్తద్వికాసౌన్నత్యముల కనువగు మార్గదర్శకత్వమును గాననగును. 'హిందీ నయీ చాల్ మేం ఢలీ' అను భారతేందుని ఉక్తిని హిందీ భాషా సాహిత్యములు రెండింటికి నన్వయించుకొన వచ్చును. 1870 లో నీతడు 'కవితా వర్ధనీ సభ' స్థాపించెను.

భారతేందు ఆత్మకథారచనమునకు గడంగెనుగాని దురదృష్టవశమున నది యసంపూర్ణముగ నాగిపోయినది. ఇతడు నవసమాజ నిర్మాణము, నూత్న సాహిత్య సృష్టియను తన యుద్యమములలో నొక దానివలన నింకొకటి కుంఠీభూతము గాకుండ రెంటిని తుల్యప్రతిభతో నిర్వహించిన ప్రజ్ఞాశాలి. భారతేందు హరిశ్చంద్రుని భాషాభిమానమును, దేశాభిమానమును ఆతని పదములలోనే ఇట్లు చెప్పవచ్చును.

చంద్ టరై సూరజ్ టరై
టరై జగత కో నేమ్,
పై దృఢ్ శ్రీ హరిచంద్ కో
టరైన అవిచల్ ప్రేమ్.

'భారతవర్ష్ కీ ఉన్నతి కైసే హో సకతీ హై,' అను విషయముపై నొసంగిన యాతని 'బలియా' ఉపన్యాసము విఖ్యాతమైనది.

జగన్నాటకరంగమున ప్రముఖపాత్ర నిర్వహింప నవతరించిన కారణజన్ములలో భారతేందు హరిశ్చంద్రు డొకడు. తన పాత్ర అభినయమును కడుసమర్థతతో నిర్వహించి క్రీ. శ. 1885 వ వత్సరము జనవరి 6 వ తేదీని తన ముప్పదియైదవయేటనే ఈ యమృతమూర్తి తనువు చాలించినాడు. అది హిందీ సాహిత్యాకాశమున మట్టమధ్యాహ్నమే సూర్యాస్తమయము వంటిది. యాతనామయమగు నీ సాంసారిక జీవనారణ్యమున నెందరో హంతకుల గాంచితిమి. కాని భారతేందువంటి దేశసేవకుని అర్ధాయువుగనే పొట్టబెట్టుకొన్న పాపిష్ఠి ముహూర్తము కరకుదనములో వారందరిని కాలదన్నినట్టిది. దినదినము క్షీణించి పోవుచున్న అతని ఆరోగ్యమునుగూర్చి యడుగ వచ్చిన పరిచారికతో ఆ దినమున నతడాడిన పల్కులివి.

'హమారే జీవన్ కే నాటక్ కా ప్రోగ్రామ్ నిత్య నయా నయా ఛప్ రహా హై. పహలే దిన్ జ్వర్ కీ, దూసరే దిన్ దర్ద్ కీ, తీసరే దిన్ ఖాంసీ కీ సీన్ హో చుకీ! దేఖే లాస్ట్ నాయిట్ కబ్ హోతీ హై.'

నాటి రాత్రియే ఆతడీ లోకమును వీడిపోయెను. తదనంతర స్థితి హరిశ్చంద్ర నాటకములో పాత్రముఖమున నాతడు మున్నే వచించియున్నాడు.

కహేంగే సబై హీ నైన్
నీర భరి భరి పాఛే,
ప్యారే హరిచంద్ కీ
కహానీ రహి జాయగీ.

యుగపురుషులగు కందుకూరి వీరేశలింగము, భారతేందు హరిశ్చంద్రుడు సమాజ సాహిత్య రంగములలో నొనర్చిన కృషి ఇంతదనుక ప్రత్యేకముగ వివరింపబడినది. వీరి రచనలు, సంఘ సంస్కరణములు పరస్పర సహకారులై ఘనిష్ఠ సంబంధము గలవగుటచే నుభయపక్షములును తుల్య ప్రాధాన్యములో నిట చర్చింపబడినవి. ఉపసంహార రూపమున నిపుడు ఈ మహానుభావుల జీవిత విశేషములను తులనాత్మకముగ నొక్కింత పరిశీలింతము.

ఇరువురును తుల్యములగు నుద్యమములకు కర్ణధారులైనను వారి నడుమ ననేక సామ్యములలో బాటు భేదములును గలవు. బ్రాహ్మ ధర్మ ప్రభావితుడై, ఏకేశ్వరోపాసకుడై, వర్ణభేదముతోబాటు యజ్ఞోపవీతమును గూడ పరిత్యజించినవాడు వీరేశలింగము. ఆతనివలెనే సర్వమతములందును సమదృష్టి గలవాడే యయ్యు 'తదీయ సమాజ' స్థాపకుడై, తదీయ నామాంకితుడగు ననన్య వీరవైష్ణవుడైనాడు హరిశ్చంద్రుడు. సమాజ సంస్కరణమునకై యిరువురును బద్ధకంకణులే; స్త్రీ జనాభ్యుదయమునకును పాటుపడిన వారే. అందు భారతేందుని కార్యకలాపములు కూడ ననల్పములయ్యు పంతులుగారి 'విధవా పునర్వివాహోద్యమము' బృహత్తర పరిమితినందుకొన్నది. తన శక్తి, కాలములో నధికభాగము ఈ యుద్యమమునకే వెచ్చించి, తత్ఫలితముగ ననంత క్లేశములపాలయ్యు వీరేశలింగము తదితర రంగములలో వెనుక

బడకుండుట విశేషము. తమ తమ యుద్యమసులలో నీ యుభయులును కృతకృత్యులే. అందు శతాయువు కాకున్నను తగినంతకాలము జీవించినవాడు వీరేశలింగము. అనుభవము గడించుటకైన చాలనంత అల్పాయుష్కుడయ్యు, వీరేశలింగము జీవించిన కాలములో నర్ధభాగతుల్యముగ ముప్పదియైదు వత్సరములే జీవించినను: ఆతనివలె వివిధోద్యమములలో బాల్గొని సఫలుడైన భాగ్యశాలి భారతేందు.

ఇక వీరి సాహిత్యరంగమును సమీక్షింతము. కొలది రచనలుతప్ప తక్కుంగల వానినన్నిటిని అధికముగ సంఘ సంస్కరణమునకు ఉపకరణముగ నుపయోగించుకొని, తదనురూపముగ వెలయించినవాడు వీరేశలింగము. అట్టివానితోబాటు కేవలానందదాయకములగు నెన్నో యితర రచనలుగూడ నొనర్చినవాడు భారతేందు. బ్రహ్మసమాజ ధర్మప్రభావితములైన రచన లొక్కరు రచియింప, వేరొకరు రాధాకృష్ణుల యెడ ననన్యభక్తితాత్పర్యములతో తత్ప్రణయ లీలావర్ణనమున నధ్యాత్మతత్వమునాపాదించి వైష్ణవధర్మప్రధానములగు రచనలు గావించిరి. నవ్యత నెంతగా వాలింగన మొనర్చుకొన్నను ప్రాచీన మార్గానుసారి రచనల నిరువురును వెలయించిరి. కాని శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమువంటి సాముగరిడీల బోలిన కవిత్వమువంక కారంభముననైన నున్ముఖుడు గానివాడు భారతేందు. ఆధునికయుగము గద్యయుగమనుట నిర్వివాదము. వీరి నాధునిక సాహిత్యయుగకర్త అన్నపుడు గద్యమును ఆదరించి విస్తరింపజేసిరనుట స్పష్టమే. అట్లయ్యును గద్యముతో తుల్యముగ తుదిదాక పద్యమునుగూడ నాదరించుట భారతేందు రచనలలో నభివ్యక్తమైనంతగా కందుకూరి వారి రచనలలో కన్పట్టదు. వీరేశలింగము 'గద్యతిక్కన' బిరుదాంకితుడు; హరిశ్చంద్రుడు 'భారతేందు' పదవిభూషితుడు. పద్యరచనలలో ఒకపాలు భారతేందు అధికుడైన గద్యరచనలలో వీరేశలింగము మిన్నయైనాడు. భారతేందు విరచిత ప్రహసనములు అల్పసంఖ్యాకములేకాగా పంతులుగారు రచించినవి ఏబదికి పైగా నున్నవి. హాస్యవ్యంగ్యప్రధానములగు రచనల సంఘ సంస్కరణకై యిరువురు నుపయోగించుకున్నారు. అట్టి రచన లెట్లున్నను కొందరికి కరకుగ గన్పింపక తప్పదు. అయినను అందలి హాస్యవ్యంగ్యములను వీరేశలింగముగారు కొంత తీక్ష్ణముగ చిత్రింప, భారతేందు వానిని అంతకంటె నొకింత సున్నితముగ చిత్రించెనని చెప్పవచ్చును. పలువురిచే తొలి తెలుగు నవలగా పేర్కొనబడుచున్న రాజశేఖర చరిత్ర రచించియు, చింతామణి పత్రికామూలమున పల్వురనీ శాఖయందు ప్రోత్సహించియు నవలా రచనమున వీరేశలింగము చేసిన కృషి భారతేందు చేతిలో జరుగలేదు. జీవిత చరిత్ర లిరువురు రచించినను, ఆత్మకథమ వ్రాసి ఆంధ్రమున ఆ శాఖకు శ్రీకారము చుట్టిన వారు శ్రీ పంతులుగారు. భారతేందుచే తద్రచన మారంభింపబడియు నసంపూర్ణముగనే ఉండిపోయినది. కథానికా రచనమునకొక నిర్దిష్టరూపమేర్పడుట వీరిద్దరిలో నేయొక్కరి ప్రయత్నముననుగాక ఇరువదియవ శతాబ్ద ఆరంభమున నన్యుల రచనలలో సిద్ధించినది.

సాహిత్యోద్యానములకు వీరి యాగమనము వసంతోదయము. మొత్తముపై నప్పటి పరిస్థితులలో వివిధ రంగములలో నీ ప్రజ్ఞాశాలు రిరువురును సాధించిన ఘన విజయములు ఆశ్చర్యకరములు, శ్లాఘాపాత్రములు, తరువాతి తరములవారి కాదర్శప్రాయములు. సాహితీ సమాజ రణరంగముల నెక్కటి జోదులగు నీ యుగపురుషులకు జోహారులు.

# నిరీహ

## శ్రీ వేగుంట మోహనప్రసాద్

అట్లాని
పెద్దబాధా ఉండదు.
వెల్లవేసిన గోడలేమో తెల్లబోతూ ఉంటాయి.
విద్యుత్కాంతికి.
మహా అయితే ఏ ఒక్కబల్లో ప్రాకుతూంటుంది
గోడమీద.
దానినీడ ఒక్కోటే ఛాయామాత్రంగా మదిలో మెదులుతుంది
విచారంగా.
ఎక్కడో దూరాన్నుంచి పట్టి లాక్కొస్తుంది ఏ సినిమా పాటనో
రికామీ గాలి.
తీరా ఆఖరి చరణాన్ని వదిలేసి వెళిపోతుంది రోషంగా జుట్టు పైకెగ
దువ్వుకుని.

ఇక నే నాచరణాన్ని మననం చేసుకుంటాను నా దిగులుతో కలిపి
తెల్లవారెను కోడిగూసెను కోడిగూసెను తెల్లవారెనని
హరే రామ లాగ

గోడకు తగిలించిన గళ్ల టెరిలిన్ చొక్కా మెల్లగా చేతులు
కదుల్చుతుంది
ఉదయం దానికి పూసిన నైట్‌క్వీన్‌ని వాసన చూచుకుంటుంది
రాత్రిలో ఒక్కతే.
నూనెలో మెరుస్తోన్న నల్లని గచ్చుమీద చీమ ఒకటి కాశీయాత్రకి
ప్రాకుతూంటుంది.
ఇది దిగులు చిత్త ప్రవృత్తి సీన్.
సెంట్ రాసిన చొక్కాకి దిగులు.
బల్లికి ప్రాకలేని కాళ్లల్లో గాలినిండిన ఎగొని.
బరువైన చివరి చరణానికి మెలంకొలి.

పాలిపోయిన గోడలకు ప్రతీక్ష.
బలాదూర్ గాలికి నైరాశ్య జనితాక్రోశం.
చీమకి పలాయనాధ్యాత్మికావేశం.

వస్తుగతం కాని కవితకి భావం బలం.
కేవలం భావంలో భవం.
అధివాస్తవిక విచారం అవ్యక్తం.
అగమ్య గోచరం.
గమ్యమేలేని జానేదేవ్ గాలి.
వ్యక్తావ్యక్త చరమ చరణం.
దిగులు గుండెల పగుళ్లకు
స్వాతి చినుకుల సాంత్వన వాక్యా
లేవి మరి?
కరుచుకుపోయిన బల్లిలా గోడకి
నిచ్చెన ఉంటుందిగానీ తీరా ఎక్కేవా
డెవ్వడు ?
వస్తువూ లేక, స్వీయాత్మా లేక నేనేననటం
పోనిస్తూ పెద్ద బాధాలేదని
వాక్యయెస్ బల్లి ప్రలాపంలో—
రక్తం స్రవిస్తోన్నా !



# భావభేదము - రసదృష్టి

శ్రీ కొండిపర్తి శేషగిరిరావు

"ఆకులతో, పూలతో, పిందెలతో, కమ్మనిపండ్లతో కళకళ్లాడుతూ మనోహరంగా ఉం దోచెట్టు."

'ఎంతో అందంగాఉన్న ఈ రమణీయత శాశ్వతమా!'

అని మనస్సు ప్రశ్నిస్తే!

'కాదు.'

అని చెబుతుంది ఆధ్యాత్మికుని హృదయం

అందుకని

''కనిపించే ఈ చెట్టు రమణీయత అంతా అశాశ్వతమే! కానీ దానిలోగల గుప్తమైన శక్తే శాశ్వతం. పైకి కనిపించే ఈ రమణీయత ఏదో ఒక నాడు నశించిపోయేదే!

అని అంటాడు ఆధ

'పళ్లు చాలా బాగున్నాయి. కమ్మగా కూడా ఉండొచ్చు'

అని అనుకొంటూ ఉరకలువేస్తుంది వస్త్వా పేక్షగలవాని మనస్సు.

అంతే కాదు.

'కఱ్ఱకూడా బాగున్నట్లే ఉంది. ఓ మంచి టేబుల్, కుర్చీ, ఇంకా అనేక వస్తువులు చేసుకో వచ్చు.'

అని అనుకుంటాడు భౌతికవాది.—

ఇలా అందంగా మందంగాఉన్న ఆ చెట్టును వీరిద్దరూ చెరో దృక్పథంతో చూచారు. కంటికి కని పించే వస్తువును దూరంచేసుకొని భావాలలో ఒకరు విహరిస్తే, మరొకరు వస్తువును దగ్గరకు తీసుకొని అది ఎలా తనకు ఉపయోగపడుతుందో చూచారు. మొదటిభావన సమాధికి దారితీస్తే, రెండవ భావన స్వార్థానికి దారితీసింది. అంతేగాక ఒకరు భావనలో అంత్యాన్నిచూస్తే, మరొకరు భౌతికంగా అంత్యాన్ని ఆలోచించారు. అందుకని ఈ ఇరువురి హృదయాల లోనూ రమణీయాస్వాదనా రసతత్వం లోపించింది.

అలా వీరిరువురిలో లోపించిన రమణీయా స్వాదన, రసహృదయునికి ఉంటుంది. రసహృదయుడు ఆధ్యాత్మికుని మాదిరిగా వస్తువును దూరం చేసు కోడు. భౌతికవాది మాదిరిగా కేవలము తన స్వార్థా నికే వస్తువును ఉపయోగించుకోడు. కాకపోతే ఈ రెంటికీ సంబంధించని సౌందర్యపథంలో తాను ప్రయా ణించి, తన హృదయాన్ని రసానందముతో నింపుకొని, మధురానుభూతిని పొందుతాడు.

ఆ తరువాత అతను పొందిన ఆ మధురాను భూతిని, తన రసభావనతో మేళవించి ఓ మాటనో, గీతికనో, ఓ కనువిందైన మూర్తినో, వర్ణచిత్రాన్నో సృజిస్తే సృజింపవచ్చు. లేకపోతే లేదు. ఒకవేళ రస సృష్టిచేస్తే అతను కళాకారుడౌతాడు. లేకపోతే రస హృదయుడౌతాడు. ఇలా ఉంటుంది రసదృష్టీ, రస సృష్టీ.

ఈ రసతత్వము కేవల ఆధ్యాత్మిక భౌతిక వాదులలో లోపిస్తుంది. అలా లోపించిన రసతత్వం మాత్రము, రసహృదయునిలో మొలకెత్తి చిగురించి వికసిస్తుంది. అది పరిపక్వస్థితికివస్తే, అనేక రసఫలా లను లోకానికి అందిస్తుంది. అప్పుడు లోకమంతా ఆ రమణీయ రసాన్ని ఆస్వాదిస్తూ, తనను తానూ, ఒకొప్పుడు తన పరిసరాలనుకూడా మర్చిపోవడం కద్దు. అలాంటి రసతత్వాన్ని ఈ ఆధ్యాత్మిక భౌతికవాదాలు ఎందుకు త్రోసివేసి రస ప్రపంచానికి దూరవౌ తున్నాయో మరి!

కానీ కొంచె మాలోచిస్తే కొన్ని కారణాలైనా దొరకకపోవు.

భౌతిక, మానసిక ప్రేరణలకు లొంగిపోకూడదనే దృక్పథమే ఆధ్యాత్మికుణ్ణి ఆవరించిన మాధుర్యాన్ని, అతనికి దూరం చేస్తోంది. దానికి తోడు అడుగడుగునా కనబడు రమణీయతే; తనని బంధితునిగా చేసి తనను అస్వతంత్రునిగా చేస్తుందనే భావనచే, ఈ రమణీయత ఇంకా ఇంకా అతనికి దూరమై పోతోంటుంది. పోతే భౌతికవాది కేవలం తన సుఖజీవనాన్నీ, తన సౌఖ్యాన్నే, ధ్యేయంగా పెట్టుకోవడంతో, అటు వస్తువులోగల రమణీయతా, ఇటు ఇతనిలోని రస గ్రహణశక్తీ, భౌతికవాదిలో సహజీవనం చేయలేక అతనికి దూరమై పోతున్నాయ్.

ఇక రసహృదయుడు ఈ రెండు మార్గాలనూ దూరంచేసుకోక వస్తువుకు దగ్గరగావెళ్ళి దానిలోగల సౌందర్యాన్ని రసభావుకుడై గ్రహిస్తాడు. కానీ భౌతికవాది మాదిరిగా అతను వస్తువును తన సుఖజీవనానికి మాత్రం ఉపయోగించుకోడు. ఓ రకంగా రసోపాసి ధ్యేయంలో ఓ ప్రయోజనమున్ననూ, అది వస్తువులోని రమణీయతను, వస్తువునుండి వేరుచేసి, దానిని తన రసభావనచే అభిషేకించి, కళాఖండముగా తయారు చేయడమే అతని ప్రయోజనమౌతోంది. ఈ రస ప్రకాశత అతని స్వార్థమే కావచ్చును. ఐనా ఇతరుల సౌందర్యాస్వాదనానికది ఆలంబనమౌతోంది. అందుచే రస హృదయుడు వస్తువుకు ఉపయోగకర్త మాత్రం కాడు. కానీ వస్తువులోగల సౌందర్యాన్ని పైకితీసి, ఓ నవీన సౌందర్యసృష్టిచేసి, దానిలోని రమణీయతను తోటి వారికి పంచిపెట్టే ఓ రసదాత ఔతున్నాడు.

పోతే ఇతను ఆధ్యాత్మికునిమాదిరిగా భావుకుడే ఐనా, ఆ భావన ఏదో నిరాలంబమూ, నిర్వికల్పమూ నిరూపకత్వముతో కూడిన అవ్యక్తభావం మాత్రము కాక రమణీయ రసస్వరూపమైన ఓ భావంగా ఉంటుంది అది. అందుచే ఈ రసభావన, ఎప్పుడూ ఆధ్యాత్మిక భావనలోని వైరాగ్యదృష్టితో వస్తువుకు దూరంగా రసోపాసిని తీసుకుపోదు. అంతేకాకుండా ఈ రసతత్వంలో మరో విశిష్టతకూడా ఉంది. అది వస్తువును అంటిపెట్టుకొన్నట్టుగా ఉన్ననూ, వస్తువుకు మాత్రము అంటకుండా ఉంటుంది. పైగా వస్తు రమణీయతతో ఆ రసభావన కలిసిమెలిసి సహజీవనం చేస్తుంది.

కనుక రసోపాసి ఆధ్యాత్మికుని మాదిరిగా వస్తువుకు దూరమై పోడు. పైగా ఆధ్యాత్మికునిచే నెట్టివేయబడిన రసగ్రహణ, రసతత్వములను తనలో కలిగి యుండి రసభావుకు డౌతున్నాడు.

అసలు రసతత్వము వస్తువులోని వస్తుత్వాన్ని దాటటానికి ఉపయోగిస్తుందే కానీ, రసతత్వంద్వారా మానవుడు వస్తువుకు కట్టుబడి ఉండటానికి అది ప్రయత్నించదు.

ఇక రసహృదయుడు భౌతికవాది మాదిరిగా వస్తువును కేవలం తన సౌఖ్యానికీ, తన సుఖజీవనానికీ ఉపయోగించాలని వాంఛించడు. కాకపోతే వస్తువులోని సౌందర్యాన్ని స్వీకరించి అది ఎలా సౌందర్యవంతమైన నిర్మాణానికి దోహదమౌతుందో ఆలోచిస్తాడు. ఆ ఆలోచన అతనికి అంత జీవితోపయుక్తమైనదిగా యుండదు. ఒకవేళ ఏ కొంచెమైనా ఆ భావన అతనికి జీవితోపయుక్తమైనదిగా ఉన్నా, అది ఏ కొంచెమో ! అందుచే రసవస్తు నిర్మాణంలో అధికభాగం అతని హృదయస్థమైన రమణీయతకూ, దాని ప్రేరణకూ, చెందినదే ఔతోంది. అందుచే రసోపాసి మధురభావన అతని సుఖజీవనానికి ఏమంతగా తోడ్పడదు. ఐతే సౌందర్యోపాసి వస్తువును ఎప్పుడూ తనకు కావాలంటాడు. అంతేకాదు. రసదృష్టితో వస్తువుచుట్టూ పరిభ్రమిస్తుంటాడు కూడా. కావున రసోపాసి కేవలం భౌతికవాది మాదిరిగా వస్తువులో తన సుఖజీవనాన్ని అంతగా చూడడు అనటం మాత్రం సత్యం.

అసలు రసతత్వము వస్తువుమీదే ఆధారపడి ఉంటుంది. రసస్రష్ట దాన్ని పైకితీసుకొచ్చి కళగా రూపొందిస్తాడు. అలారూపొందిన ఓ అందమైన గీతో, గీతికో; శిల్పమో, శబ్దమో, చిత్రమో జనంగా మాత్రం ఉండిపోక కొంత ప్రయోజనాన్ని సాధిస్తుంది. దానివల్ల మానవుడు కొంత మానసికమైన, హృదయస్థమైన ఆహ్లాదాన్ని పొందగలడు. దాన్ని భౌతికవాది ప్రయోజనాత్మక లక్షణాలతో కనక చూస్తే, అదీ ఓరకంగా మానసిక, హృదయస్థమైన ప్రయోజనమే ఔతోంది. కాకపోతే ఇది మానవుని భౌతిక ప్రయోజనాలకు కొంచెం దూరంగా ఉంటుంది.

ఏది ఏమైనా కేవల భౌతికవాది, వస్తువు ఎలా తనకు సుఖజీవనాన్ని ప్రసాదించగలదు అనే దృష్టితో వస్తువును చూడడంతో అతనిలోని ఈ రస తత్వం నశిస్తోంది. అందుకని అతను వస్తురమణీయ తకూ, తన హృదయంలోగల రసప్రేరణకూ దూరమై పోతున్నాడు.

ఇలాంటి ఆధ్యాతిక భౌతికతలతో సహజీవనం చేస్తూ ఆ రెండు వాదాలూ త్రోసివేసిన రసతత్వముతో తన రమణీయ భావాలను పెనవేసుకొని పురోగ మిస్తాడు రసస్రష్ట. అందుకనే ఈ రెండు వాద విభేదాల మధ్య ఉదయిస్తున్న కళాకారుడు దేన్నీ దూరం చేసుకోడు. ఈ రెండు వాదాల తత్వాలను కొంతవరకు తన సౌందర్య భావాలతో మిళితంచేసి వినూత్న జగత్తును సృష్టించి వారి ముందుంచుతాడు.

అప్పుడు ఆధ్యాత్మికుడు దాన్ని, భావాత్మకంగా చూస్తే, భౌతికవాది దాన్నే ప్రయోజనాత్మకంగా చూస్తాడు. ఐనా తాత్కాలికంగా మాత్రము వారు ఆకళ నుండి సౌందర్యానుభవాతులను పొందుతారు. కానీ ఈ ఇరువర్గాలవారూ అంతటితో ఊరుకోరు. ఆధ్యాత్మికుడు తిరిగి తన వ్యక్తిత్వంలోకిపోయి ఇంత సుందరమైన ఈ కళాఖండముకూడా అశాశ్వతమే అంటే, ఇంత అందంగాఉన్న ఈకావ్యమో, శిల్పమో, రాగమో, చిత్రమో, మానవ జీవితోపయుక్తమైనదై అతని సుఖజీవనానికి అంతగా తోడ్పడదు. అందుకని వీని నిర్మాణము నిష్ప్రయోజనం అని అంటూ; ఈ రస సృష్టికొరకు వినియోగించిన ఇంతశ్రమా, ఇంత బుద్ధి కుశలతా, మానవ ఉపయోగ వస్తు క్రియాత్మక శక్తిలో కనక ఉంటే, దానివలన తయారైన వస్తువులు మానవునికి ఎంతో సుఖజీవనాన్ని ప్రసాదించ గలిగేవి—అని అంటాడు భౌతికవాది.

కనుక రమణీయమైన వస్తువును గురించి ఆధ్యాత్మిక భౌతికవాదులు ఇలా నిరసిస్తారు. కానీ వారిముందున్న, ఈకళాఖండము మాత్రం వారిరువురి వ్యతిరేకతలమధ్యా ఉద్భవించిందనీ, వారు అభిమానించలేని ఓ నవీనఅంశమునుండి ఈ రమణీయత ఉద్భవించిందనీ, వారిద్దరినీ ఈ రసతత్వం సమన్వయ పరుస్తోందనీ, వారు గ్రహింపలేరు. పైగా వారిలో లోపించిన ఈ రసతత్వమును లలితకళలు పైకితీసు కొస్తున్నాయని కూడా వారు భావించలేరు.

ఆలోచిస్తే దీనికంతకూ వారివారి వాదాలలో వారికిగల ఓ ప్రగాఢమైన విశ్వాసమే కారణం—అని అనిపిస్తుంది.

ఆ ధృఢ విశ్వాసాలవలన వారి హృదయాలలో సౌకుమార్య లాలిత్యాలకు తావులేక, వారి హృదయాలు కొంతవరకు రసవిహీనాలైనట్లుగా తోస్తుంది. రస దృష్టితోచూస్తే !

ఇక సామాన్యుడు రస హృదయునికి అతి సామీప్యంలో ఉంటాడు. వానిలోని రసతత్వము కళతో సహజీవనం చేయగలదు. ఎందుకంటే సామాన్యుడు ఇటు వస్తువును భౌతికవాదంతోనూ చూస్తాడు. అటు వస్తువుకు దూరమై ఆధ్యాత్మికుని మాదిరిగా భావుకుడూ ఔతాడు. పైగా ఆ భావన రసపూరితమైనదిగాకూడా ఉంటుంది.

మొత్తంమీద రసదృష్టితోచూస్తే ఆధ్యాత్మిక భౌతిక వాదాలు రసప్రపంచానికి దూరమైపోయాయి. అవిరెండూ అలాదూరమైపోవుట శోచనీయం. వస్తువులోగల రమ్యతకు ఆ వాదాలలో స్థానంలేక రమ్యతను వానినుండి వేరుచేశాయి. అలా వేరైన రసతత్వం మాత్రము తనలో ఈ రెండువాదాలను దృష్టిలోనూ, సృష్టిలోనూ నిబిడీకృతమొనరించుకొని, ప్రకృతిలోని ముడిపదార్థాన్నీ, తన రసభావనసూ సమన్వయించి వస్తువును సుగంధ పరిమళ పూరితం చేస్తుంది.

స్థూలంగాచూస్తే మానవునికి భౌతికవాదం ఆశను కలిగిస్తే, ఆధ్యాత్మికవాదం అతనిలో నైరాశ్యాన్ని కలిగిస్తోంది. బలవత్తరమైన ఈ వాదాల మధ్య ఉదయించిన రసవాదము మాత్రం మానవునిలో ఆధ్యాత్మిక, భౌతిక సమ్మిశ్రిత రసభావాల్ని పెంచి రససృష్టిని చేయిస్తోంది ఆనందింపజేస్తోంది.

ఒకటి మానవుని దృష్టిని ఆశగా క్రిందికి లాగితే, మరొకటి శూన్యంలోకి లాగుతోంది. కానీ ఈ రెంటి మధ్యనున్న రసవాదము మానవదృష్టికి ఆహ్లాదాన్ని కలిగించి అతని పురోగమనాన్ని ఒడుదుడుకులు లేకుండాచేసి, అతనికి పూలబాటను ప్రసాదిస్తోంది.

# మాయం

## శ్రీమతి ఆర్. వసుంధర

'సిరిపాడు!' అని కేకేశాడు కండక్టరు.

'సిరిపాట్లో దిగాల్సినవాళ్ళూ!' అని యింకా పెద్దగా అరిచాడు.

సత్యం మేష్టారు ఆ కేకకు వులిక్కిపడి చేతిలోని 'భజగోవిందం' పుస్తకం గబగబా చేతిసంచీలో పెట్టుకొని బస్సు దిగాడు. 'హోల్డాల్ సార్'అంటూనే హోల్డాల్ ఎత్తి కాస్త గట్టినేలమీదకు విసిరేసి 'రైట్' అన్నాడు కండక్టరు. డబ్బారేకుల తప్పెట్లలా పెద్దశబ్దం చేసుకుంటూ బస్సు ముందుకు సాగిపోయింది.

క్రితం రోజు కురిసిన వానకు కాబోలు నేలంతా కుమ్మరివాడు కలుపుకున్న బంకమట్టి దిబ్బలాగా వున్నది. పగలు కాసిన ఎండకు కాలిబాటలోని బంకమట్టి నీళ్ళన్నిటినీ ఈడ్చుకొని కొద్దిగా గట్టిపడి పొలాన్నుండి వచ్చే పోయే మనుష్యుల అడుగుల బరువుకి నున్నగా మెరుస్తూ తేలి వూళ్ళోకి పోతున్న పెద్ద కొండచిలువలాగా వున్నది. బస్సు దిగిన చోటికి పది గజాలు అవతలినుండి ప్రారంభమై తాటాకు కప్పిన పూరిళ్ళు కాస్త దూరదూరంగా ఆవలికి వ్యాపించి వున్నాయి. మధ్యమధ్యలో గడ్డివాములు బంగారు రంగులో ఎత్తుగా ఠీవిగా ఏనుగల్లాగా నిలిచివున్నాయి. దూరాన వూరి మధ్యలోగా చలికి ముడుచుకు గుంపుగా కూర్చున్న ముసలివాళ్ళలాగా పాత పెంకుటిళ్ళు ఓ డజను ఒకేచోటులో కూర్చుని వూరిని పర్యవేక్షిస్తున్నాయి.

'ఛీ, ఛీ, ఏం పల్లెటూళ్ళు!' అనుకున్నాడు సత్యం మేష్టారు చీకాకుగా. ఆయనకు పల్లెటూరితోటి తొలిపరిచయం యిదే. 'అంతా ఏమిటోగా క్రొత్తగా వున్నది. ఆ పెంకుటిళ్ళవేపుగా వెళ్ళాలనుకున్న మేష్టారు హోల్డాలు తీసుకరావటానికి ఎవరైనా దొరుకుతారేమోనని చుట్టూ చూశాడు.

దూరాన పొలాల మధ్యనుండి నల్లగా మెరుస్తున్న మెలికలబాటవీూదుగా మెల్లగా భద్రంగా నడుస్తూ వస్తున్నా డొమనిషి. వూళ్ళోకి వెళ్ళి తలదాచుకొను చోటు వెతుక్కోవటానికి త్వరపడుతున్నాడు సత్యం మేష్టారు. అవతలి మనిషికి తొందరనేది లేనట్లుంది. అతిమెల్లగా నడుస్తున్నాడు. క్రిక్కిరిసిపోయి ఒకదాన్లో ఒకటి దూరినట్లు అలుక్కుపోయివుండే యిళ్ళతో, కాలంతో, పందెంవేసుకొని పరుగులిడే జనంతో కిటకిటలాడుతుండే పట్టణానికి చెదురు మదురుగావుండే యిళ్ళతో మన్నుదిన్న పెంజేరుల్లా మెల్లిగా కదిలే మనుషులతో కాలం లేనట్లుగా తాపీగా నడిచే పల్లెటూరికీ ఏవిూ సంబంధం కనబడలేదు. 'అంతా కొత్తగా వున్నది' అనుకున్నాడు కొండచిలువలాంటి దోవనుచూస్తూ. ఎందుకో భయంవేసింది. అంతలోనే 'అక్కడా ఆ మనుష్యులే, యిక్కడా ఆ మనుష్యులే...భేదం ఏముంది!' అనుకున్నాడు, తలపైకెత్తిన భయాన్ని మనసు లోతుల్లోకి నెట్టివేస్తూ.

'వూళ్ళోకి వెళ్ళాలి. పరుపుచుట్ట తెస్తావా?' అనడిగాడు దగ్గరగావచ్చిన మనిషిని.

మనిషి చేతిలోని దుడ్డుకర్రను నేల కానించి నిలబడి చేతిసంచీనీ, హోల్డాలునీ, మేష్టారినీ పరిశీలనగా చూశాడు. నోట్లో నములుతున్న పొగాకు ఎంగిలిని తుపుక్కున వుమ్మేశాడు బాటప్రక్కగా. కుతూహలంగా చూస్తూ 'కొత్త ఎడ్మాస్టరా?' అనడిగాడు.

'అవును...పరుపు తెస్తావా?'అన్నాడు మేష్టారు.

'వూళ్ళో అనుకుంటుండారులెండి...కొత్త ఎడ్మాస్టరు రావాలని. సూడగానే అనుకున్నా, కొత్తాయన ఎవరుండాలబ్బా అని...మా పిలగాడుకూడా ఆ బళ్ళోనే సదూతుండాడు. ఎంకడని...మూడో కళాసు. మంచి సురుకుగలోడు లెండి. సూత్తారుగా...నాపేరు సాయెబు, బాబూ, పోదాం పదండి' అన్నాడు సాయెబు చేతిసంచీ,

హోల్డాలు నెత్తికెత్తుకుని ముందు దారితీస్తూ. వాడి వెనకాలే వెళ్లాడు సత్యం మేష్టారు వూళ్లోకి.

వేపచెట్టు చుట్టూ విశాలంగా కట్టిన నల్ల రాతి అరుగులమీద నలుగురు రైతులు కూర్చొని వున్నారు—ఎర్రటి ముతక ఖద్దరులో మోకాటి పొడుగులో కంటిమెడ చొక్కాలూ, అదేరకం పంచెలూ ధరించి. సాయెబు వాళ్ల ఎదురుగా ఆగాడు. 'కొత్త ఎడ్మాస్టరు' అన్నాడు, తోటపిల్లలికి గుప్పెట్లోని తాయిలం చూపిస్తున్న పిల్లాడిలా. నలుగురు రైతులూ మేష్టార్ని పరకాయించి చూశారు. అందులో ఒకాయన లేచి నిల్చున్నాడు. నోట్లోంచి చుట్టతీసి 'రండి, యింటికి వెళ్దాం...నేను యీ వూరి బోర్డు ప్రెసిడెంటుని. నా పేరు శ్రీమన్నారాయణ...' అన్నాడు. మిగతా ముగ్గురు రైతులుకూడా లేచారు, చొక్కాలు సరిచేసుకుంటూ. 'పదండి, మేం కూడా అటే వస్తున్నాం' అన్నారు.

నాలుగు రోజులు ప్రెసిడెంటు యింట్లోనే వుండిపోయాడు సత్యం మేష్టారు. అప్పటికి తన కోసరం నాలుగురూపాయిల అద్దెతో ఏర్పాటయిన చిన్న పూరిల్లు అలికి ముగ్గులు పెట్టించటం పూర్తయింది. పైన తాటాకు తిరగ కప్పించారు. అయిదో రోజున అందులో చేరాడు. చేరాక తెలుగు కాలెండరు సున్నంకొట్టినమట్టిగోడకు తగిలిస్తూ తిథీ నక్షత్రం చూసి గతుక్కుమన్నాడు. ఆ వేళ అష్టమీ మంగళవారం కృత్తికా నక్షత్రం. కాని అంతలోనే మనస్సు చిక్కబట్టుకొని 'ఆ, ఏమిటో, అంతా మాయ! తిథి నక్షత్రాల్లో ఏముంది' అని ఆ విషయాన్ని మనసులోంచి కొట్టిపారేశాడు.

పెంకుటిళ్లకు కాస్త దూరంగా పూరిళ్ల మధ్యలో దర్జాగా తలెత్తుకు నిల్చొనివుంది ఎలిమెంటరీ స్కూలుకి కొత్తగా కట్టిన భవనం. పల్లెటూరి సినిమాహాలులాగా అదీ ఒక రేకులషెడ్డే అయినా ముందరిభాగంమాత్రం ఘనంగా వున్నది—ఓ కంట్రాక్టరుకు చదువుగురించివున్న అభిప్రాయానికి రూపు కల్పిస్తూ. రోడ్డులో నిలబడిచూస్తే సినిమాహాలో, రైస్‌మిల్లో అనిపించినా దానిమీద నికరమైన నాలుగు రంగుల్లో 'ఎలిమెంటరీస్కూలు, సిరిపాడు' అని వ్రాసి వున్నది, ఏవిధమైన అపోహలకూ తావివ్వకుండా.

'ఇదివరలో ఓ పాతపెంకుటింట్లో వుండేది బడి. నేను ప్రెసిడెంటయ్యాకనే యీ బిల్డింగును కట్టించాను' అని శ్రీమన్నారాయణ ఉత్సాహంగా చెప్పాక బిల్డింగును గమనించి 'బాగుంది! బాగుంది!' అన్నాడు మేష్టారు.

*　　*　　*

వూరి పరిస్థితి మేష్టారికి ఏమాత్రం నచ్చ లేదు. వూళ్లో పార్టీ రాజకీయాలు వుధృతంగా వున్నాయి. సిరిపాడు పంచాయతీలోనే దానికి అనుబంధంగావున్న వుత్తరపువేపుమాలపల్లి దక్షిణాన వుప్పుకాలువదగ్గరున్నమాదిగవాడ తూర్పువేపునచాకలి పేట అన్నీ కలిసేవున్నై. రైతులు కొద్దిమంది. ఎలక్షన్లలో వయోజనఓటు అంటూవున్నది గనుక అధికారం నిలుపుకోవటానికి రైతులకు భూసంపద గొప్పదనం అనేవి పనికిరాకుండావున్నై. మాలమాదిగ వాడల్లోని మెంబర్లూ, రైతులూ వాళ్లఆశ్రితులూ అయినవారిమెంబర్లూ అందరూ కలిసే ప్రెసిడెంటును ఎన్నుకోవాలి. ఇద్దరూ దాదాపు సమాన సంఖ్యలోనే వున్నారు. తను జీతగాళ్లుగా కూలివాళ్లుగా వుంటూన్నవాళ్లది పైచెయ్యి అయి, ప్రెసిడెంటు గిరీ వాళ్లపరవౌతుందేమోనని రైతులు నానాగుంజాటనా పడిపోతున్నారు. యింత బ్రతుకూ బ్రతికి యింటి వెనుక చచ్చినట్లు!...క్రిందటితూరి ఎలక్షన్లలో మాలవాళ్లు మంచిపట్టుమీదే వున్నారు, ఎట్లైనా ప్రెసిడెంటనిపించుకోవాలనీ, రైతుల పొగరు అణగ కొట్టెయ్యాలనీను. కాని చివర్న ఎన్నో లంచాలు, ఏవో ప్రలోభాలూ చూపించి రైతులు కోటిగాణ్ణి వాళ్ల ప్రక్కకు తిప్పేసుకుని యీసారికి ప్రెసిడెంటు గిరీ వాళ్లదే ననిపించుకునేసరికి మూడు చెరువుల నీళ్లు త్రాగినంత పనైంది. ఏవూరినుండో పొట్ట చేతబట్టు కొని వచ్చి జీతగాడుగా స్థిరపడిన గవన్నబాసడు కూలి వాళ్ల ప్రక్కన తీవ్రంగా పనిచేస్తున్నాడు...ఈ విషయాలన్నీ శ్రీమన్నారాయణే మేష్టారితో చెప్పాడు.

మేష్టారికి రాజకీయాలంటే ఏవగింపు. ఆయన తమ మనిషని అనిపించుకోవాలని రెండు పార్టీల వాళ్లూ ప్రయత్నిస్తున్నట్లు తెలిసింది. ఆయన ఎటూ మొగ్గు చూపలేదు. అసలా విషయమే పట్టించుకో

లేదు. పల్లెటూరి ప్రజలమీద అసహ్యం పుట్టు కొచ్చింది. తిండీ, నిద్రా, సంసారం యిందులో పశ్శులు కొట్టుతుండే చిన్నబతుకుల మనుష్యులు వాళ్ళు. వూసు పోక తగూలు ముందేసుక కూర్చుంటారు. ఓచదువూ, జ్ఞానం, సత్యం ఏవీ ఎరుగని మూర్ఖులు...'భజ గోవిందం, భజగోవిందం మూఢమతే!...'అనుకున్నాడు మేష్టారు విసుగ్గా.

మేష్టారికి కావలసిన పది మానికల బియ్యం నెల నెలా ప్రెసిడెంటుగారే పంపిస్తున్నారు. పాలూ, పెరుగూ యితర రైతులు పంపిస్తున్నారు. అప్పు డప్పుడు కూరగాయలుకూడా వస్తున్నాయి. మిగతా యిద్దరు పంతుళ్ళకు కూడా బియ్యం తప్పించి మిగతా సప్లైలు జరుగుతూనే వున్నాయని తెలిసింది బళ్ళో రైతుల పిల్లల్ని ముందువరుసలో కూర్చోబెట్టి మిగిలినవాళ్లను కాస్తంత దూరంగా కూర్చోబెట్టాలి. వాళ్లని ఏ సందర్భంలోనూ కోప్పడకూడదు. వాళ్లను 'అమ్మా' 'బాబూ' అనే పిలుస్తున్నారు ఆ పంతు ళ్లిద్దరూ.

సాయెబు కూడా రెండుసార్లు సొరకాయలు తెచ్చియిచ్చి బళ్లో రైతులపిల్లల్ని వేరుగా కూర్చో బెట్టటం గొప్పగా మాటడం బాగాలేదని చెప్పివెళ్లాడు. చదువుకునే పిల్లల్లో యిలా భేదభావం చూపించటం న్యాయంకాదని సత్యంమేష్టారు అనుకున్నాడు. కాని యీ వూరితో తనకు సంబంధమూలేదు; యీ పరిస్థితి తానేర్పరచిందీకాదు. అదీగాకుండా తనొక్కడూ పూనుకున్నా ఏవీ మార్చలేడు. 'ఈ దేశంలో ఎక్కడ చూసినా రాజకీయాలేగాని న్యాయం ఎక్క డేడ్చింది!' అనుకున్నాడు మేష్టారు. అందువలన యివన్నీ పట్టించుకోకుండా వుండే పద్ధతిని సాగనివ్వటమే సులువైన పద్ధతిగా తోచింది. అందువలన రైతు లిచ్చిన వస్తువులన్నీ పుచ్చుకొంటూ వేవున్నాడు. వాళ్ల పిల్లలు వేరుగా కూర్చున్న విషయం మరచిపోతున్నాడు. అన్నీ మామూలుగా సులువుగా జరిగిపోతున్నై...

ఈ పల్లెటూరి వాళ్లకుండే మరో అలవాటు అవతలివాళ్ల అజలన్నీ కనుక్కోవటం. ముదురు వయ సులోవుండే మేష్టారు ఒంటరిగా సంసారం పెట్టటం వాళ్ల కుతూహలాన్ని రేకెత్తించింది. 'ఒకరే చెయ్యి కాల్చుకుంటున్నారు. సంసారం ఏం లేదా?' అన్న ప్రశ్నకు సమాధానంగా 'మొన్నటివరకూ అమ్మవుండేది. పోయింది. యిప్పుడు ఒకణ్ణే వుంటున్నాను' అన్నాడు. పెళ్లయిందా? పెళ్లాం వుందా? అన్న ప్రశ్నలకు సమా ధానం చెప్పాలనిపించలేదు. చెప్పలేదు.

ఉదయం తొమ్మిది గంటలకంతా వంట పూర్తి చేసుకుంటాడు మేష్టారు. వూడ్చటం, గిన్నెలు కడ గటం, స్నానం చేశాక పంచే బనీనూ పిండి ఆరవేయటం యీ పనులన్నీ నాలుగు రోజులు కోటయ్యగారి పాలేరు పిల్లాడు చేసి పెట్టాడు. తరువాత పనిచేస్తానని రత్తి వచ్చింది. కూలిపని లేనప్పుడు వూళ్లో కూరగాయ లమ్ముతుంది రత్తి. దాని మొగుడు బాసడు ఎవ రింట్లోనో జీతగాడుగా వున్నాడు; తాగుబోతు ముండా కొడుకు; సంపాదించిందంతా తాగేస్తాడు; పిల్లా జెల్లా లేరు—అన్నీ చెప్పింది రత్తి. సరే, చెయ్యమన్నాడు మేష్టారు.

మర్నాడు వుదయం కోటయ్యా యింకో యిద్దరు రైతులూ వచ్చారు. 'రత్తి పని మురిగ్గా చేస్తుంది దాన్ని ఎవరూ పనికి పెట్టుకోలేదు వూళ్లో; దాని మొగుడు తాగుబోతు; అది లేవదీసుకొచ్చిన రకంగా కన్పిస్తోంది; దాన్ని పనికి పెట్టుకోవటం మంచిది కాదు' అని చెప్పారు. రత్తి మొగుడు గవన్నబాసడు అవతలి పార్టీవాడన్న విషయం గుర్తొచ్చింది మేష్టారికి. రత్తి పని చెయ్యటం అప్పటికే ఒక రోజు చూచివున్న మేష్టారికి అది పని మురిగ్గా చేస్తుందన్న విషయం బాగానే తెలిసింది. అయినా 'ఏదో జరిగినన్నాళ్ళూ జరగనివ్వండి. దాని గుణంతో నాకేం పని' అన్నాడు. చెప్పవచ్చిన వాళ్లు మరేంమాట్లాడలేక అప్పటికి వూరుకున్నారు. నేనెప్పుడూ యీ వూళ్లోనే వుండ బోతానా!' యింకో మంచి వూరికి బదిలీ రాకపోతుందా! అనుకున్నాడు మేష్టారు మనసులో.

పది రోజులు జరిగేసరికి పందికొక్కు కన్నాలు పూడ్చటం, యిల్లలకటం యింటిపనిచెయ్యటంతో పాటుగా పొయ్యిముట్టించటం బియ్యంకడిగివ్వటం లాంటి చిన్నపనులు చేయటం ప్రారంభించింది రత్తి. దాని మడ్డితనానికి అసహ్యం వేస్తున్నా, అది చేస్తున్న సహాయంమాత్రం బాగానే వుంది మేష్టారికి. ఆయనకు భగవద్ధ్యానం తప్పించి మిగతావన్నీ అల్పవిషయాలు. 'భజగోవిందం' శ్లోకాలన్నీ రోజుకోసారైనా చదువు

కొని వాటిలోని స్వారస్యం అనుభవించనిదే ఆయనకు మనసు బాగుండదు. అవన్నీ ఎప్పుడో కంఠతా వచ్చేసినై. అయినా అందులోని సారాసారం వివేచన చెయ్యాలంటే పుస్తకం ముందుంటేనే బాగుంటుందని అనుకుంటాడు. ఆ పుస్తకమే ఆయనకు వేదవేదాంగాల సారం.

వూళ్లో రైతులకు మేష్టారి వాలకం సరిగా అంతుబట్టటం లేదు. యిచ్చినవన్నీ పుచ్చుకుంటాడు గాని యిచ్చారుగదా అన్నభావం కన్పించదు. బయట దోవలో కనిపించి నవ్వినా చూసీచూడన ట్లుంటాడు. పలకరించినా సరిగా తిరుగూ ఒరుగూ చెప్పడు. ఈ ముభావం వాళ్లకు కొరుకుడు పడలేదు. 'మన చేతి కిందే వుంటాడంటారా?' అనుకున్నారు రచ్చబండమీద సందేహంగా. ప్రెసిడెంటు వాళ్ల సందేహాన్ని కొట్టి పారేశాడు. 'మనింట్లో వున్న నాలుగు రోజులూ నేను బాగా చూశానుగా...ఆయనది ఒక రకంలే. ఎప్పుడూ ఏదో వేదాంతధోరణిలో వుంటాడు. శ్లోకాలు పాడుకుంటాడు. మన లోకం లేదు.. వేదాంతం కదిలించారంటే బాగానే మాట్లాడతాడు' అన్నాడు.

కాస్త వేదాంత ధోరణి తమలో వుప్పదనుకునే రైతులు నలుగురూ 'పుణ్యంకోసం' మేష్టారింటికివెళ్లి రెండు శ్లోకాలకు అర్థం విని రావటం ప్రారంభించారు. సంవత్సరానికోసారి నూటపదార్లిచ్చి శాస్త్రుర్లవారిని పిలుచుకొచ్చి హరికథ చెప్పించుకున్నట్లుగా మేష్టారి చేత శ్లోకాలు చెప్పిస్తే అందరూ నాలుగు మంచి మాటలు విన్నట్లా వుంటుంది; మేష్టారు మన మనిషని మిగతా వాళ్లకూ తెలిసొస్తుంది—అనుకున్నారు.

వూళ్లో వాళ్ల చెవిలో నాలుగు. మంచి మాటలు వెయ్యటానికి సత్యంమేష్టారికీ యిష్టమే అయింది. ఇదివరలో ఆయన ప్రతిభను గుర్తించి యిలాంటి కోరిక ఎవరూ కోరలేదు. 'పల్లెటూళ్లే నయం ఒక్కోసారి' అనుకున్నాడు మేష్టారు.

రచ్చబండ పెంకుటిళ్ల మధ్యన మూడు దోవల చేరికలో వున్నది. భోజనాలయ్యాక తీరుబాటుగా రైతులు ఓ ఇరవైమంది వరకూ చేరారు అక్కడ. పెద్దవారు బండమీదా సన్నవారు క్రింద చాపలమీదా కూర్చున్నారు. పాలేళ్లూ అలగా వాళ్లూ కొందరు గోడలవారగా క్రింద మట్టిలోనే కూర్చున్నారు. మగవారి కంటబడరు గనుక ఆడవారు రచ్చబండకు ఆ ప్రక్కా యీ ప్రక్కావుండే నాలుగిళ్ల లోనూ అరికిన దొడ్లలో చాపలూ దుప్పట్లూ వేసుకుని కూర్చున్నారు. యింటి చుట్టూ కట్టిన తాటాకు దడివిూదుగా రచ్చబండ కన్పిస్తుంది వారికి.

మేష్టారికి గొంతుపెద్దదీ కాదు; రాగయుక్తంగా పాడటమూ బాగా రాదు. ఇంట్లో చదువుకునే స్థాయిలోనే జంకుతో ప్రారంభించినా అలవాటూ వుత్సాహం వుండటాన సులువుగా శ్లోకాల్లోకి దూకేశాడు. అర్థం చక్కగా వివరించి చెబుతున్నాడు. 'చచ్చాక బంధువులేమిటి, పెళ్లాం బిడ్డలూకూడా నీ కట్టెను అవతల పారేస్తారు. ప్రాణం వున్నంతసేపే యీ బంధాలన్నీను. బ్రతికినన్నాళ్లూ ఏవేవో ఆసక్తులతో తారట్లాడుతావు, తరువాత మట్టిలో కలిసి పోతావు. ఆడదంటే ఎముకలతోటీ రక్తమాంసాలతోటీ ఏర్పడిన ఆకారమే. ఆ ఎత్తు పల్లాలనుచూసి భ్రమసి పోవటం మూర్ఖత్వం. ఈ మాయలోంచి బయటపడు. జీవితం ఒక కొండ చిలువ. అది నిన్ను మింగేస్తుంది! దేవుణ్ణి ధ్యానించు' అని చెప్తూంటే మేష్టారి గొంతులోంచీ మాయ అంతా వుమ్మిగానూ వమనంగానూ బయటకొచ్చేస్తున్న ట్లనిపిస్తోంది. వింటున్న వాళ్లకు సంసారం మీద విరక్తిగాని ఆడవాళ్లమీద అసహ్యంగాని కలుగక పోయినా 'ఆయన చెప్పేదంతా నిజమే కదా. మంచి సత్యం చెబుతున్నాడు' అనుకుంటున్నారు.

ఉపన్యాసం మంచిపట్టులో వుండగా ఒకాయన లేచాడు. దడదడా బండదగ్గరకు నడిచి వచ్చాడు. 'నాదొక సందేహం...' గట్టిగా అందరికీ వినిపించేట్లు అని గర్వంగా అందరివైపూ ఓ మారు చూశాడు. 'మనుష్యులకి యీ భ్రమంతా ఎందుకిచ్చాడు దేవుడు?' అన్నాడు సవాలు చేస్తున్నట్లు. సత్యం మేష్టారికి నవ్వొచ్చింది. చిన్నపిల్లలడిగే తెలివి తక్కువ ప్రశ్నలాగా తోచిందది. 'అంతా కర్మనుంచీ వస్తుంది...ఎవరు చేసిన కర్మ వారనుభవింపకా ఏరి కైనను తప్పదన్నా...' అన్నాడు మేష్టారు రాగయుక్తంగా. అందరూ నవ్వారు. 'కర్మమాత్రం ఎక్కణ్ణుంచీ వచ్చిందయ్యా మొదట? ఈ మాయ అంతా దేవుడు ఎందుకు ఏర్పరిచాడు?' అన్నాడు లేచినాయన కోపంగా. సత్యం మేష్టారికి యీసారి సమాధానం గభాల్న తోచలేదు. ఒక నిముషం బిత్తర

పోయి తరువాత గుంభనగా అన్నాడు నవ్వుతూ 'అంతా ఆ పరమేశ్వరుని లీల అంటారు...అదీగాకుండా నిజమైన దానికి కారణం వుంటుందిగాని, లేనిదానికి, మాయకు, కారణం ఏముంటుంది లీలకాకుంటే!' అన్నాడు. ఈ సమాధానం అందరికి నచ్చినట్లుంది. 'కూర్చోవయ్యా, శేషయ్యా...ఏమిటో నాలుగు మంచి ముక్కలు చెవినేసుకుపోక యీ ప్రశ్నలేమిటి! నీ వెప్పుడూ యింతేగా!...' అని విసుక్కున్నారు. మేష్టారి సమాధానానికి తిరుగు తోచలేదు శేషయ్యకు వెంటనే. 'ఆలోచనుండే వాడికైతే ప్రశ్నలొస్తాయి. మీకేం తెలుస్తుందిలే!...బూటకపు వేదాంతం... దేవుడూ లేడు, దయ్యమూ లేదు!' అని దూకుడుగా అని విసురుగా కూర్చున్నాడు.

మరునాడు వుదయం వుల్లాసంగా వుంది మేష్టారికి. గాలిలో తేలిపోతున్నట్లుగా చకాచకా పని చేసుకున్నాడు. రత్తి గిన్నెలు మురికిగా కడిగినా ముభావంగా వుండేవాడు కాస్తా యీ రోజు 'ఏమే, నిన్న ఏ గిన్నెలో ఏ పదార్థం వండేనో మరచిపోతానని కొంచెం కొంచెం మిగిల్చి పెడతావా కడిగేటప్పుడు?' అని పరిహాసం కూడా ఆడేడు. మాటి మాటికి క్రితం రాత్రి సభలో జరిగిన సంభాషణే జ్ఞప్తికి వస్తోంది. శేషయ్య ప్రశ్నవేయటం దానికి అతికినట్లుగా మంచి సమాధానం తానివ్వటం ఎందుకో మనసులో నిలిచిపోయింది. 'నిజమైన దానికి కారణం వుంటుందిగాని మాయకు కారణమేమిటి!' అన్నాడు తాను. మాయకు కారణాలు మాయలోని కారణాలు ఏమిటి వెర్రిగాకుంటే!

ఇంటికి వచ్చిన కోటయ్యను 'నిన్న రాత్రి ప్రశ్నలడిగిన శేషయ్య ఎవరు?' అనడిగాడు మేష్టారు. కోటయ్య నవ్వి 'వాడా...వాడో తలతిక్క ఘటంలెండి... ప్రతిదానికీ అడ్డుప్రశ్నలువేసి తన తెలివి చూపించుకోవాలనుకుంటాడు ఎప్పుడూ. అందరూ తెలివి తక్కువ వాళ్లనీ తనేమో మహాతెలివిమంతుణ్ణనీ గర్వపడిపోతుంటాడు...అందరూ వాణ్ణి వుత్తరాల పిచ్చాడంటారు. దేశంలో గొప్పోళ్లందరికి వుత్తరాలు రాస్తాడు. సమాధానాలువస్తే వాటిని పదిలంగా దాచి వాళ్లతో సమానంగా తనూ ఓ గొప్పోణ్ణని పొంగిపోతుంటాడు. వాడి దగ్గర మంత్రులు, పుస్తకాలు రాసేవాళ్లు, నెహ్రూ దగ్గరినుండీకూడా వుత్తరాలున్నాయి...' అని పెద్దగా నవ్వేశాడు కోటయ్య.

శేషయ్య తీసిపారెయ్యాల్సిన మనిషిగా కన్పించలేదు, మేష్టారికి. మిగతా వాళ్లందరూ అన్నింటికీ గొర్రెపోతుల్లా తలలూగిస్తూంటే, ఆలోచించగల సామర్థ్యం శేషయ్యకే వున్నట్లు తోచింది. అంతే గాకుండా అతను లేవదీసిన ప్రశ్నగాని దానికి తానిచ్చిన సమాధానంగాని చాల వున్నత స్థాయిలో వున్నట్లు తోచింది. ఈ వెధవ పల్లెటూళ్లో యింత మేధావి వుండటం ఆశ్చర్యంగానే వున్నది...శేషయ్యతో పరిచయం పెంచుకోవాలని వుత్సాహంగా వున్నది మేష్టారికి

వూళ్లో వాళ్లు చూపించిన గౌరవ మర్యాదలు చూపించలేదు శేషయ్య. 'నువ్వు, నువ్వు' అనే సంబోధించాడు. 'అంతా మాయ అంటున్నావు. కడుపునిండా తిని నెలనెలా జీతం తెచ్చుకుంటూ, ఏ బాదరబందీ లేకుండా వుండే వాడివి, జీవితం గురించి నీవేం ఎరుగుదువయ్యా? ఈ కడుపు నిండిన వేదాంతం ఎవరైనా చెప్పగలరులే' అన్నాడు హేళనగా. 'నా బ్రతుకంతా నేను కష్టపడి నిర్మించుకున్నానయ్యా. నా కెవడూ కించిత్తు సహాయంకూడా చెయ్యలేదు — చెయ్యని వాడెవడో వున్నాడని నేను ఎలా నమ్మేది? ఆ దేవు డెవడో నాకు తెలియదు...నా చిన్నతనంలోనే అమ్మా నాన్నా పోయారు. మేనత్త దగ్గర చేరాను. అప్పుడు నా పేర్లేమిటో తెలుసా—'చచ్చు పీనుగా' 'మొద్దుసన్నాసీ'ను. చాకిరీ చేయించుకొని తిండి పెట్టేది. సినిమాకి డబ్బులు కావాలంటే పేకాటలో సంపాదించేవాణ్ణి. ముంజెలు, తోటలో కొబ్బరికాయలు, పచ్చిమామిడికాయలు—ఏవి వీలయితే, అవి యిచ్చి కొట్లో బీడీలూ అగ్గిపెట్టెలూ తెచ్చుకునేవాణ్ని. నా కథ వింటే నీలాంటి వెర్రివేదాంతులు దొంగ అనీ, చెడిపోయినవాడనీ అనుకోవచ్చు. అలాంటి దేమీలేదు! నేను అప్పుడు దొంగనైతే యిప్పుడు దొంగగా ఎందుకులేను! మర్యాదస్తుణ్ణి ఎట్లా అయ్యాను?...నేనప్పుడూ దొంగని కాదు. నేను చేసిన చాకిరీకి న్యాయమైన ధరనే పుచ్చుకున్నాను. ముసల్ది చేజేతులా యివ్వలేనిది తెలియకుండా పుచ్చుకున్నాను... యింతపనీ చేయించుకొని నన్ను కమతగాడిగా వుంచేసేదే. ఆవిడ కూతురు సుబ్బులుచేత ప్రేమింపజేసు

కొని, దాన్ని పెళ్ళాడేను. ఆస్తి స్వంతదారు నయ్యేను. వుండే అయిదెకరాలూ మగతా కిచ్చాను...యిదిగో శుభ్రంగా బట్టలువేసుకొని బుజంమీద పేటంచు వుత్తరీయం వేసుకొని పెద్దమనిషిగా వున్నాను...' అంటూ పెద్దగా విపరీతంగా నవ్వేడు శేషయ్య.

శేషయ్య మాటలు మేష్టారిలో సంచలనం కల్గించాయి. తనది కడుపునిండిన వేదాంతం కాదనీ, అది తన జీవితాన్ని నడిపే సత్యమనీ, తను నమ్మిన నిజమనీ శేషయ్యకు ఎలా నచ్చచెప్పాలో తెలియలేదు. 'శేషయ్యా, నన్ను నమ్ము! నేను చిన్నప్పటినుండీ ఏకాకిగా బ్రతికాను...' అనాలనిపించింది. ఎందుకో శేషయ్య తనను నమ్మటం అవసరమనిపించిందికాని శేషయ్య నమ్మడు; ఎగతాళి చేస్తాడు; నీకు తల్లి, ఆస్తి వున్నదంటాడు. నిజానికి తనకు అందరూ అనుకునేవిధంలో తల్లిలేదు. చిన్నప్పుడుకూడా ఆమె మీద తాను ఆధారపడలేదు. ఆమెను ఒక మనిషిగా, వేరుగా చూశాడేగాని తన తల్లిగా తనలోని భాగంగా చూడలేదు. తనకు గుర్తున్నంతవరకూ ఆమె ఎప్పుడూ స్నేహితులతో పచ్చీసూ గవ్వలూ వామనగుంటలూ ఆడుతూ తా ననుభవిస్తున్న బాధలగురించీ తన అసహాయజీవితాన్నిగురించీ మాట్లాడుతూ ఏడుస్తూ వుండేది. ఆమె మాటలన్నీ అబద్దాలుగా, 'ఆ ఏడుపు మొసలి కన్నీటిలా, ఆమె బ్రతుకు అసత్యంగా అనిపించేది...ఎదుటివాళ్ళను నిశితంగా పరీక్షించే గుణం చిన్నప్పటినుండీ వున్నది తనకు.. తాను అందరిలాంటివాడుకాదు—అప్పుడూ, యిప్పుడూ కూడా! వేదాంతిలా జీవితానికి దూరంగా కూర్చొని కాలం గడిపాడు! పదేళ్ళక్రితం ఆవిడే తనకు పెళ్ళంటూ ఒకటి చేసింది. పెళ్ళిలోనే కానుకలదగ్గర పేచీ వచ్చింది. పెళ్ళాం ముఖంకూడా సరిగా చూడలేదు. పుట్టినప్పటినుండీ ఏకాకిగా బ్రతికిన తనను 'బాదరబందీ లేని జీవితం, కడుపునిండిన వేదాంతం' అంటున్నాడు శేషయ్య 'ఏవిటో, అంతా మాయ!' అని నిట్టూర్చాడు మేష్టారు.

* * *

రాబోయే ఎలక్షన్లకోసం అప్పుడే ప్రచారం ప్రారంభమైంది. శేషయ్య రైతులకి వ్యతిరేకంగా కూలివాళ్ల పక్షానికి తిరిగిపోయాడు. శేషయ్యతో మాట్లాడటం మంచిదికాదని రైతులు మేష్టార్ని హెచ్చరించారు. 'ఈ పట్టింపు లన్నీ నాకు లేవు' అన్నాడు మేష్టారు. పాలు పెరుగుల సప్లై తగ్గిపోయింది. 'ఆళ్లు దొంగముండాకొడుకులు. పని జరుపుకోడని కిత్తారుగాని పూరికేనే యిత్తారా?...... యిన్నాళ్ళూ యీ కొంపని కొక్కులు తవ్వేత్తున్నాయని ఎవరన్నా యింట్లో దీపం పెడ్తారని సూత్తుండారే. ఆళ్లోళ్లదనిగెందా మీకు నాలుగు రూపాయిలకి అంటగెట్టారు' అన్నది రత్తి.

శ్రీమన్నారాయణగారి కళ్లంలో గింజలు దొంగలు ఎత్తుకపోయారు, కావలిపడుకున్న జీతగాణ్ణి కొట్టి. రైతుల అనుమానం బొసడిమీద పడ్డది వాడు అడపాదడపా చిన్నదొంగతనాలు చేస్తున్నట్లు వాళ్లకి అనుమానంగానే వున్నది ముందునుంచీ. దొడ్లలోని కొబ్బరికాయలూ, వీలు చిక్కినప్పుడగా పురుల్లోని ఒడ్లూ పోతూనేవున్నై. రాజకీయపు పట్టుదలమీద వున్న రైతులు యీసారి దొంగని పట్టితీరా లనుకున్నారు. అంతా కలిసి దౌర్జన్యంగా వాళ్ల యిళ్లలో దూరి సోదా చేశారు. అన్నీ కూలికి తెచ్చుకున్న రకరకాలు కలిసిన ఒడ్లేగాని ప్రెసిడెంటుగారి ఒడ్లు ఎవరింట్లోనూ దొరుకలేదు.

ఇంత దౌర్జన్యం చేసినందుకు మీ పనుల్లోకి రామని కూలివాళ్లు తిరుగబడ్డారు. రైతులు రెండు బస్తాల ఒడ్లు బొసడి యింట్లోనూ రెండు బస్తాలు సాయెబు యింట్లోనూ వేయించి అందరిమీదా కలిపి కేసు పెట్టించారు. 'వాళ్లెలాగూ దొంగలే, తప్పులేదు. కోర్టులచుట్టూ తిరిగి చావనీ. రోగం కుదురుతుంది. ప్రెసిడెంటుగిరీ కావాలట!' అనుకున్నారు.

రెండుమూడు రోజుల కోసారి కేసు వాయిదా వచ్చేసరికి పదిహేనుమంది కూలివాళ్లూ ప్రొద్దున్నే చద్దికూడుతిని కొంచెం మూటగట్టుకొని రేపల్లెకు నడిచివెళ్లటం, కేసు మరో వాయిదాపడటం, రాత్రి కాళ్లీడ్చుకుంటూ తిరిగి రావటం మామూలైపోయింది. ఓప్రక్క డబ్బుఖర్చు అవుతోంది, వాయిదా రోజుల్లో కూలిపనీ లేకుండాపోతోంది. రెండునెల్లు తిరిగేసరికి వాళ్ల ప్రాణం కడబట్టినట్లయింది. కాని బాధ ఎక్కువైనకొద్దీ పట్టుదలా ఉక్రోషం జాస్తిఅయాయేగాని వాళ్లు లొంగిరాలేదు. రెండు పార్టీల మధ్యా పచ్చగడ్డివేస్తే భగ్గుమనేట్లు తయారైంది పరిస్థితి.

భగ్గుమనిపించిన పచ్చగడ్డి బళ్ళోనే పడ్డది. ప్రెసిడెంటుగారి కొడుకు సుందరం క్లాసుకు కాస్త ఆలస్యంగావచ్చి ముందువరుసల్లోకి వెళ్తుండగా దోవలో సాయెబు కొడుకు ఎంకడు కాలు అడ్డం వెయ్యటం, సుందరం బోల్తాపడటం, వెనుక వరుసలవాళ్లంతా పెద్దగా నవ్వటం జరిగింది. సుందరం మొహం కంద గడ్డలా చేసుకొని క్లాసంతా తేరిపారజూశాడు. సత్యం మేష్టారు ఏమీ గమనించకుండా పుస్తకంకేసి చూసు కుంటున్నాడు. క్రిందపడిన పలకను ఎత్తుకొని గురి చూసి ఎంకడిమీదకు విసిరాడు సుందరం. పలక నేరుగాపోయి ఎంకడి కంటిపైన తగిలింది. నెత్తురు ధార కట్టింది.

మేష్టారు లేచివచ్చి సుందరాన్ని ఒక్కటేసి యింటికి పంపించేశారు. ఎంకణ్ణి బావిదగ్గరకువెళ్ళి కన్ను కడుక్కొని యింటికి వెళ్లమన్నాడు. కాస్సేపటో సుందరాన్ని వెంటబెట్టుకొని కోటయ్య వచ్చాడు. 'పెద్దా చిన్నా అంతరం ఎరక్కుండా ప్రెసిడెంటుగారి పిల్లాణ్ణి కొట్టి యింటికి తరిమేస్తావా? తిన్నయింటి వాసాలు లెక్కబెడతావా? యిదంతా వూరికినే పోతుం దనుకోకు!' అని యిష్టంవచ్చినట్లు తిట్టేశాడు. సత్యంమేష్టారికి నోరుపెగిలి ఒక్కమాట రాలేదు. వీళ్ల వెధవ సప్లైలు తీసుకోకుంటే బాగుండేది' అనుకున్నాడు. కోటయ్య అటు వెళ్లగానే సాయెబు బాసడూ యింకో యిద్దరూ ఎంకణ్ణి ఎత్తు కొని వచ్చారు. ఎంకడికి కుడికంటి ప్రక్కగా నల్లగా వాచిపోయి వున్నది. దానిమీద పసుపు నిండుగా పట్టిం చారు. 'పెద్దోళ్ల అండవుంటేమాత్రం మంచీ చెడ్డా అక్కర్లేదా? కాస్తలో తప్పోయిందిగాని కన్నుపోయిన పన్తైపోతే పిలగాణ్ణి ఒక్కణ్ణే యింటికెల్లమంటారా? ఆ కొట్టిన దొరబాబుని ఏం చేశారు?' అని నిల దీశాడు సాయెబు. 'అళ్లకో నాయం యిళ్లకో నాయం ఏందయ్యా? అసలు రోగం నీ దగ్గిరే వుంది. అళ్లనీ యిళ్లనీ ఏరేరుగా కూకోబెట్టటం దేనికి?' అన్నాడు బాసడు పొగరుమోత్తనంగా మీదికివస్తూ. వాడి నోట్లోంచి కల్లువాసన గుప్పున కొట్టింది. 'పై వోళ్ళకి పిటేసన్ రాసిపడెయ్యాల' అన్నాడు యింకోడు. అందరూ వెళ్లిపోయాక 'బళ్ళోకివచ్చి యిలా గలాటా చెయ్యటానికి వీళ్లకేం హక్కుంది? బయటికి పొమ్మని చెప్పివుంటే?...ఈ వూళ్లో వాళ్ళు మహాదౌర్జన్యకారి మనుషులు!' అనుకున్నాడు సత్యం మేష్టారు. అంతా తలాతోకాలేని విషయంగా కనిపించింది. 'ఈ వూరినుంచి బదిలీ త్వరగా ఒస్తే బాగుండును' అనుకున్నాడు. మనశ్శాంతికోసం 'భజ గోవిందం' తెరిచాడు. నాలుగు శ్లోకాలు చదివేసరికి మనసుకాస్త కుదుటబడ్డది. 'కామక్రోధాది అరిషడ్వర్గం ఆడిస్తుంటే శ్లేష్మంలోపడ్డ యీగల్లాగా మాయలో పడి తన్నుకుంటున్నారు' అనుకొని ఆ విషయం మనసు లోంచీ కొట్టిపారేశాడు.

సాయంత్రం శేషయ్య కనబడి ఎగతాళిగా నవ్వుతూ 'ఏమయ్యా, మేష్టారూ, నీ కృష్ణలీలల్ని గురించి ఏమిటో వినబడుతోందే. పెద్దనీతులు చెపు తావు పైకి...రత్తి మాయలోపడి ప్రెసిడెంటు కొడు కునే కొట్టావటగా. వాళ్లు వుడికిపోతున్నారులే' అన్నాడు. మేష్టారికి చాల కోపం వచ్చింది. 'ఏమిటి శేషయ్యా నీ వనేది?...ఛీ, ఛీ...' అన్నాడు

ఇంటికివచ్చి కూర్చున్నాడు. మనసు చీకాగ్గా వున్నది. 'శేషయ్య ఎందుకలా అన్నాడో! అసలీ పుకారు ఎలా ఒచ్చిందో కనుక్కుంటే బాగుండేది...ఆఁఏమిటో ఈ వెధవ పల్లెటూళ్ళలో యిలాంటి వాటికి కొదువే ముంటుంది! అల్పపు మనుషులు,!' అనుకున్నాడు. కారణంలేని భయంలాంటి ఆవేశంతో చెదిరిపోయి మన సంతా అల్లకల్లోలంగా వున్నది. 'ఇదంతా వాళ్ల మౌఢ్యమేగాని నాకేం సంబంధం లేదు' అనుకున్నాడు భజగోవిందం పుస్తకం చేతిలో పట్టుకొని...

రత్తి పనికి ఆలస్యంగా వచ్చింది. నెలరోజు ల్నుంచీ కూలికిపోయి, అక్కణ్నుంచీ చీకటిపడ్డాకనే పనిలోకి వస్తోంది. మేష్టారు దీపంకూడా ముట్టించు కోకుండా చాపమీద పడుకొనివున్నాడు. కళ్ళు మూసు కొని రత్తివచ్చి దీపం ముట్టించింది. గబాగబా గిన్నెలు బయటవేసి యిల్లూడ్చింది. 'బళ్లో ఎంకణ్ణి ప్రెసి డెంటు కొడుకు చితకతంతే చూసి వూరుకున్నా వంటగా......ఏందయ్యా మరీ అంత అన్యాయం?' అన్నది, పొయ్యి ముట్టిస్తూ. ఇంట్లో కూడా అదే మాట వినపడటంతో మేష్టారికి కోపం వచ్చింది. అయినా ఏమీ అనకుండా దానివేపు చూశాడు. ఇన్నాళ్ల నుంచీ పనిచేస్తున్నా ఎప్పుడూ దాన్ని సరిగా గమ

నించలేదు. అది సన్నగా రివటలాగా ఛలాకీగా వున్నది. ఒళ్ళు నల్లగా నున్నగా వున్నది. ఏదో ఆకలి నిత్య స్థావరం ఏర్పరచుకున్నట్లుగా మొహం ఎండుకుపోయి కళ్ళు మెరుస్తున్నాయి. మాట్లాడినప్పుడు పళ్ళు పెద్దగా తెల్లగా వరుసగా కన్పిస్తున్నాయి. మేష్టారి దృష్టి తొడలపైకి ఎగగట్టిన చీర క్రిందనుంచి కన్పిస్తున్న కాళ్లమీద నిలిచింది. పైన మనిషి **ఎంత** సన్నగా వున్నదో కాళ్ళు అంత బలంగా స్తంభాల్లాగా వున్నై. మోటుగా అసహ్యంగా లావుగా వున్నై.

మేష్టారి చూపు గమనించి రత్తి కాస్త తొట్రుపడ్డది. 'ఏందయ్యా అట్లా పడుకున్నావ్? జెరంగానీ ఒచ్చిందా?' అంటూ దగ్గరికొచ్చింది. వేడి చూస్తున్నట్లు ఆయన చెయ్యిపట్టుకున్నది. మేష్టారికి అసహ్యంతో ఒళ్ళు గగుర్పొడిచింది. 'ఏమీలేదు... ఏమీ లేదు' అన్నాడు కంగారుగా చెయ్యి విదిలించుకుంటూ.

ఎప్పుడు ఎల్లా ఒచ్చాడో బాసడు 'ఒసే, రంకుముండా...యిదంటే నువ్వు చేసేపని! పద యింటికి...' అన్నాడు. మేష్టారికి ముచ్చెమటలు పోశాయి. లేచి ఒణుకుతూ నిలబడ్డాడు. బాసడు రత్తి వీపుమీద దబదబా నాలుగు గుద్దులు వేశాడు. కొట్టబోతూన్నట్లుగా మేష్టారి దగ్గరకువచ్చి 'నీ సంగతి మళ్లీ చూస్తాలే' అనేసి రత్తిని యీడ్చుకెళ్లిపోయాడు.

తలుపు గట్టిగా గడియ వేసుకొని చాపమీద కూలబడ్డాడు మేష్టారు. ఒంట్లో ఒణుకు తగ్గలేదు. బాసడి రౌద్రరూపం ఎదురుగా వున్నట్లే, వాడు కొట్టబోతున్నట్లే వున్నది. ఎక్కడికన్నా పారిపోదామా అనిపించింది. ఒంటరిగా బయటి చీకట్లోకి పోవటానికి భయంవేసి నిస్సత్తువగా కూర్చుండిపోయాడు. 'కోపతాపాలంటే అసహ్యం నాకు. దెబ్బంటే చీదర' అనుకున్నాడు.

...చిన్నప్పటి తెలుగు మేష్టారు గుర్తొచ్చాడు. పుస్తకాలు క్లాసుకు తీసుకురాకపోయినా, ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయినా బెంచిమీద నిలబెట్టి పొట్టలో పిండేవాడు, పిడికిట్లోంచి బొటనవ్రేలు బయటికిపెట్టి డొక్కలో యీ ప్రక్కా ఆ ప్రక్కా పొడిచేవాడు. ఆయనంటే తనకూ సింహ స్వప్నంగా వుండేది. తనెప్పుడూ పొరపాటు చెయ్యలేదు—ఒక్కసారి తప్పించి. ఆ సారి మేష్టారు కొట్టడానికి వస్తుంటే ముచ్చెమటలూ పోశాయి. బెంచి ఎక్కబోతూ క్రిందపడిపోయాడు. ముందున్న డెస్కు నుదుటికి కొట్టుకొని రక్తం ధార కట్టింది. కాని దెబ్బలు తప్పిపోయినై.

ఇంకా చిన్నతనంలో ఓసారి అమ్మ డబ్బుల్లోంచి చెప్పకుండా అర్ధరూపాయి తీసుకొని పక్కింటి వాళ్లతో సినిమా కెళ్లాడు. తిరిగి రాగానే 'దొంగవెధవా, చెప్పకుండా డబ్బులెత్తుకు పోతావ్' అంటూ చేతిలో వున్న ఇనుప వూదుగొట్టం పైకెత్తింది కొట్టడానికి. తాను భయపడి బయటకు పరుగెత్తాడు. ఆమె తలుపు లోపల గడియ వేసుకుంది. బయటంతా చిమ్మ చీకటి. ఆ చీకట్లోవుండే నల్లటి భూతాలన్నీ వచ్చి తనచుట్టూ ఆడటం మొదలెట్టాయి. ఎంత పిలిచినా ఆమె తలుపు తీయలేదు. భయంతో కొయ్యబారిపోయి నల్లటిచీకట్లో నిలబడిపోయాడు. లోపలి దీపపు వెలుగుతో ముందుగది కిటికీ మెరుస్తోంది. 'నేను ఆ వెలుతురునే చూస్తుంటే చీకటి దయ్యాలు నన్నేమీ చెయ్యలేవు. కొంచెం ఏమరినా అవి నన్ను మింగేస్తాయి' అని తనకు తానే చెప్పుకున్నాడు. మనసును గట్టిగా బిగబట్టుకొని ప్రాణాలు కళ్లలో పెట్టుకొని కిటికీవేపు చూస్తూ వుండిపోయాడు. రెండో ఆట సినిమాకు వెళ్తున్న కొట్టుసీతయ్య చూసి తలుపు తీయించి లోపలికి పంపించాడు...

తలనొప్పితో కలత నిద్రపోయాడు మేష్టారు. అర్ధరాత్రి తలుపు బాదిన చప్పుడుకు మెలకువ వచ్చింది. ఒణుకుతూనే తలుపు తీశాడు. బయట చీకట్లో పెద్దదుడ్డుకర్రలు పట్టుకొని సాయెబు, బాసడు, వాళ్లవెనుక యింకో పదిమందీ యమకింకరుల్లా నిల్చుని వున్నారు. హరికేన్ దీపం వెలుగు సన్నగా మసగ్గా వాళ్లమీద పడుతోంది. అందరూ బాగా తాగి మంచి నిషామీద వున్నట్లున్నారు. 'దొంగ సన్యాసిముండాకొడుకుని ఎయ్యండ్రా'

అంటూ కర్రపైకెత్తాడు సాయెబు. వెనుక నున్నవాళ్ళు ప్రక్కలకువచ్చి కర్రలు పైకెత్తారు. చీకటిలాంటి కొండచిలువ మింగటానికి వస్తున్నట్లని పించింది. చేతులూ రెండూ నెత్తిమీద పెట్టుకొని 'ఒద్దు, ఒద్దు' అంటూనే క్రిందపడిపోయాడు మేష్టారు.

బాసడి కర్ర మీదపడ్డది. సాయెబు పడిపోయిన మేష్టార్ని కాలితో ఒక్కతోపు తోశాడు. 'దెబ్బపడకుండానే కూలిపోయాడ్రా పిరికి ఎదవ' అన్నాడు. క్రిందికివంగి తాకిచూచాడు. 'సచ్చినట్టున్నాడు...రెండు వుతికి పోదామంటే వూరికె సచ్చాడ్రా నా కొడుకు' అన్నాడు లేచి నిల్చొని ఎంగిలి వుమ్మేస్తూ. 'పదండి...పదండి...' అనుకొంటూ పరుగెత్తుతూ చీకట్లో కలిసిపోయారు అందరూ.

బోర్లా పడిపోయివున్న సత్యం మేష్టారికి కాస్త దూరంలో చాపమీద వున్నది, 'భజగోవిందం' పుస్తకం—భద్రంగా...



# సంస్కృత సారస్వతమున జంటకవులు

## శ్రీ ఈ. వేంకట వీరరాఘవాచార్యులు

తిరుపతి వేంకటకవుల సాహిత్య సమీక్షను (యస్. లక్ష్మీకాంతశాస్త్రి రచితము) విమర్శించుచు, 'భారతి'లో (సెప్టెంబరు, 1966— పు. 45—58) శ్రీ ప్రొఫెసర్ నిడుదవోలు వేంకటరావుగారు లోకప్రశస్తవ్యాసమును ప్రచురించిరి. వీరు సారస్వత గవేషణరంగమున దిగ్గజము. ఈ వ్యాసమున అపూర్వములగు అమూల్యసాహిత్యవిశేషము లెన్నియో కలవు.

['జంటకవి సంప్రదాయం ఒక్క తెలుగులోనే తప్ప సంస్కృతంలోగాని, ఇతరదేశభాషలలోగాని లేదు. తెలుగులో పదుమూడవశతాబ్దిలో —

1. కాచవిభుడు, విఠలరాజు కాలంనుండి ఈనాటి వఱకు జంటకవుల సంప్రదాయం వాఙ్మయ చరిత్రలో అవిచ్ఛిన్నంగా అగపడుచున్నదే.
2. నందిమల్లయ, ఘంటసింగయ్య.
3. తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి.
4. కేసన, మల్లనకవులు.
5. అయ్యలరాజు, అయ్యల భాస్కరకవులు మనకు పరిచితులే' (భారతి, 46 పు)

"శతావధానము :

జంటకవి సంప్రదాయంవలె శతావధాన సంప్రదాయం తెలుగువారి ఉపజ్ఞ. భారతీయ దేశభాషలలో ఒక్క తెలుగులో తప్ప, సంస్కృతంలోను శతావధానం లేదు. దానిని సంస్కృతంలో ప్రవర్తిల్లజేసినవారు తెలుగువారే. నాకు తెలిసినంతవఱకు కొందఱు సంస్కృతభాషాశతావధానుల నామధేయాలను పొందుపఱుస్తున్నాను."]

శ్రీ వేంకటరావుగారు సూచించిన ఆర్గురు సంస్కృతశతావధానులనామములను జ్యేష్ఠానుక్రమముగా పేర్కొనుచున్నాను.

[1. మహామహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులు (క్రీ. 1822 - 1900) — శతావధానము 1855 లో బ

2. వక్కం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి (1826—1890). అవధానము 1848 లో—బందరు.

3. మండయం కృష్ణయాచార్యులు 1860 ప్రాంతము. అవధానము మద్రాసు— 1864.

   'తత్త్వబోధిని' పత్రికలో నీ అవధాన విశేషములు గలవు. దీనిని గూర్చిన వేంకటరావుగారి వ్యాసము 'త్రిలిఙ్గ' పత్రికలో (10–12–1948) చూడదగును.

4. మ. మ. — మానవల్లి గంగాధరశాస్త్రి (క్రీ. 1849—1913). అవధానము కాశీక్షేత్రమున—1879 లో.

5. వేమూరి శ్రీరామశాస్త్రి—క్రీ. 1870—. 1898 బరోడాలో, 1903 లో కాశ్మీరములో, 1909 లో పూనాలో అవధానములు.

6. కీ. శే. పిసుపాటి చిదంబరశాస్త్రి—అవధానములు మైసూరు, తిరువాన్కూరు నగరములయందు.

'ఈ రెండింటిని గూర్చి (జంటకవులు, శతావధానము) ఆంగ్లేయభాషలో ఉన్న భారతీయభాషా చరిత్రలు చదివాను. కాని, వానిలో నిది కానరాలేదు.

పరిశోధకులైన విద్వాంసు లింకను వీనివిగూర్చి పరిశ్రమ చేయుదురని భావిస్తాను '|[1] —అని అధోజ్ఞాపికలో వెంకటరావుగారు వ్రాసియున్నారు. వారి సూచన ననుసరించి కొన్ని యంశములు విద్వల్లోకమునకు విన్నవింపబడును.

**ఆంగ్ల వాఙ్మయము :** ఇందు నాలుగు జంటల కవులు (రచయితలు) కలరు.

1. బోమంట్ (Francis Beaumont) A. D. 1584–1616.

ఫ్లెచ్చర్ (Fletcher,Giles) 1579–1623.

పై యిరువురును ఆంగ్లదేశమును పాలించిన ఎలిజబెత్ రాణి (1533–1603) యుగమునకు చెందిన ప్రఖ్యాత నాటకకర్తలు. విశ్వవిఖ్యాతి నందిన విలియం–షేక్స్పియర్–మహాకవికి (1564–1616) సమకాలికులు. బోమంట్ కవియు, షేక్స్పియర్ కవియు ఒక వత్సరమునవే (1616 లో) నిర్యాణము నందిరి. పై జంటకవులు కేంబ్రిడ్జి యూనివర్సిటీలో నున్నతవిద్య నభ్యసించి, ఆ కాలమున ప్రఖ్యాతుడగు బెన్–జాన్సన్ ప్రోత్సాహమువలన గాఢమిత్రులైరి.

'The two dramatists met at Mermaid Tavern under Ben Jonson's leadership and soon became inseparable friends, living and working together. Tradition has it that Beaumont supplied the judgment and the solid work of the play, while Fletcher furnished the high-coloured sentiment and the lyric poetry without which an Elizabethan play would have been incomplete. Of their joint plays, the two best known are 'Philaster' and the 'Maid's Tragedy' — (Dr. W. J. Long's History of English Literature — p. 163—1909 A. D.)

'Fletcher was the famous collaborator of Beaumont in numerous plays which were popular in their day and take high position in the dramatic literature of the Country, containing sterling poetic beauties allied with much vulgarity'—Pears' Cyclopaedia, p. 326 (1914 A.D.)

2. థామస్–కాంపియన్ (Thomas Campion) 1567?–1619

నికలస్—బ్రేటన్ (Nicholas Breton) 1545?–1626, గేయకర్తలు.

'Like all the lyric poets of the age, they are a curious mixture of the Elizabethan and the Puritan standards. They sing of sacred and profane love with the same zest, and a careless lovesong is often found on the same page with a plea for divine grace'-(Long's History of English Literature, p. 192.)

3. ఎడిసన్ (Joseph Addison) 1672 1718.

స్టీల్ (Richard steele) 1672–1729.

శ్రీ పానుగంటివారి 'సాక్షి' ఉపన్యాస రచనల కుద్బోధకమైన 'స్పెక్టేటర్' (The Spectator) పత్రికను స్థాపించి, ఎన్నో లోకోత్తరములైన వ్యాసములను ఉపన్యాసాదులను ప్రకటించి కీర్తినందిన ఎడిసన్ మృదువు తప్పని ఇతరులను నొప్పింపని హాస్యధలోక్తి చమత్కార రచనలచే కీర్తినందిన మహానీయుఁడు; ఎడిసన్. సంఘమునందలి లోపములను రచనల ద్వారమున సంస్కరించుటకు 'స్టీలు' (Steele)తో కలిసి వాచాలుడు (Tatler) అను ఇంకొక పత్రికను ఎన్నెండ్లో నిర్వహించెను.

4. ఆటో — బోట్లింగ్ (Prof. Otto von Bohtlingk—1815—1904)

ఆర్. రోత్ (Prof. R Roth-1821-1895)

జర్మనీదేశమునందలి సంస్కృత విద్వచ్ఛేఖరులలో అగ్రగణ్యులు. వీరిరువురును చిరకాలము సంస్కృత సారస్వతమున కఠోర వ్యాసంగ మొనర్చి సంస్కృతమున అగాధ వైదుష్యమును బడసి, అమరవాణికి 7 సంపుటములలో (1855–75) సర్వంకష నిఘంటువును నిర్మించిరి. 'Sanskrit—worterbuch'

---

1. కుండలీకృతభాగములు శ్రీ వేంకటరావుగారి వ్యాసమునుండి ఉదాహృతములు.

అను నీ కోశమున సంస్కృతపదములకు భాషలో వివరణము కలదు. దీని మహత్త్వమును గుర్తించి రష్యా ప్రభుత్వమువారు దీనిని ముద్రించి, ప్రకటించి అమరభాషకెంతో సేవచేసిరి.

## ఆంధ్ర సారస్వతము :

ఆంధ్ర వాఙ్మయమున మొదటి జంటకవులు కాచవిభుడు—విఠలరాజు, అని వేంకటరావుగారు వ్రాసి యున్నారు. కావి ఇది సరికాదు. ఆంధ్రమున ఆదికవి యగు నన్నయభట్టునకు మహాభారత పరివర్తనమున కుడిభుజముగానుండిన "వాఙ్మయధురంధరుడు, ఆంధ్ర గీర్వాణ కర్ణాటక భాషలయందు మహావిద్వాంసుడు, కవి కుంజరుడు" అయిన నారాయణభట్టును, నన్నయ భట్టును (క్రీ. 11 వ శతాబ్దము) తెనుగున మొట్ట మొదటి జంటకవులని చెప్పదగును.

## సంస్కృత సారస్వతము :

1. రామిల—సో (సౌ) మిలులు కవిపుత్త్రులు: మనకు తెలిసినంతవఱకు వీ రిరువురు మొట్ట మొదటి జంటకవులు. కాళిదాసుకంటెను ప్రాచీనులు. కవికులగురువు మాళవికాగ్నిమిత్రమున—

'ప్రథితయశసాం భాస— సౌమిల్లకకవిపుత్త్రాదీనాం ప్రబన్ధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం బహుమానః'—I అం. 1 పు. (Sri Balamanorama Series—No 13, 3 rd. ed. 1944).

ఈ క్రిందిశ్లోకము శార్ఙ్గధరపద్ధతియందు 188 శ్లో. జల్హణుని సూక్తిముక్తావళియందు నుల్లేఖించుకొనబడెను. (49 పు. 111 శ్లో.)

'భాసో, రామిల—సోమిలౌ, వరరుచిః
శ్రీసాహసాంకః కవిః'.

రామిల—సోమిలులు బహుశః సోదరులగు కవి కుమారులని ఊహింపబడుచున్నారు. వీరు రచించిన కృతులు లభించలేదు, కాని రాజశేఖరుని యీ క్రింది శ్లోకమునుబట్టి వీ రిరువురును శూద్రక కథా[2]నిర్మాత లని తెలియుచున్నది—

'తౌ శూద్రకకథాకారౌ
వన్ద్యౌ రామిల - సోమిలౌ,
యయోర్ ద్వయోః కావ్య మాసీ
దర్ధనారీశ్వరోపమమ్.'

సదాశివబ్రహ్మేంద్ర సరస్వతి రచించిన గురు రత్నమాలికపై (క్రీ. 1720) ఆత్మబోధేంద్ర సరస్వతి రచించిన వ్యాఖ్యయందు రామిలకవి రచించిన మణిప్రభనుండి కొన్ని పద్యగద్యము లుదాహృతములు; కామకోటిపీఠము నలంకరించిన ఆదిశంకరులకు 20 వ తరమునకు చెందిన మూకార్భకశంకరులును పై జంట కవులును సమకాలికులని అట పేర్కొనబడెను :

విద్యాధిపః—'రామిలాఖ్యః స్వస్యైవ అస్మీయ శాలావిచారకః తాదాత్వికవిబుధజన— మాననీయ— తద్గిరుద వాహీ మణిప్రభాకారో మైథిల ఇతి ఉక్

అత్రానుసన్ధేయం యత్కిల మణిప్రభాయామ్
సూత్రధారః—'ఆర్యే, అవధీయతామ్.

శా. భఙ్గం చన్దన మర్దినః ప్రణతయోః
స్ఫూర్జద్రసాం సాహితీం
హర్షక్షోణిపతేశ్చ హర్షమతులం
దృష్ట్వైవ యే తావిమౌ,
ధీరాంస్తాన్ గురుశఙ్కరేన్ద్రయమిన
శ్చిత్తే స్మరన్ రామిలః
ప్రాగ్జైషీత్ స మణిప్రభాం ప్రథయితుం
భక్తే ర్గురో ర్గౌరవమ్'

నటీ—'అజ్జ ఉత్త, కోసోం చ దణమదీ కే పణదాకో

2. హేమచంద్రుని కావ్యానుశాసనమున (పు.) శూద్రకకథ పై జంటకవుల రచనగా పేర్కొనబడెను. హర్షచక్రవర్తియొద్ద రామిలుడు అశ్వాధ్యక్షుడనియు, మేంఠుడు గజాధ్యక్షుడనియు చెప్పబడెను. మేణ్ఠుని గూర్చి యీ క్రింది శ్లోకము రాజశేఖరుని రచనగా జల్హణుని సూక్తిముక్తావళిలో నుదాహృతము.

'వక్రోక్త్యా మేణ్ఠరాజస్య
వహన్త్యా సృణిరూపతామ్,
ఆవిద్ధా ఇవ ధున్వన్తి
మూర్ధానం కవికుంజరాః'—(పు. శ్లో.)

అహరిసమహీవాలోకే వా సుగహీతణామహే అసంరిందా ఇతి సంకిక్తిజ్జ ఇగురుపదేణ సమంచే అక ఇణా.

సూత్రధారః—న జానాసి?

శా. మూకార్యోఽపి జగద్గురోః కరుణయా
విద్యాఘన స్యాప్తవా
గాచార్యోఽస్తి హి శఙ్కరేన్ద్ర బిరుదః
సర్వజ్ఞ పీఠాధిపః,
అర్చాకిఙ్కర మాతృగుప్త కవితా గర్వస్య
నిర్వాసనా—
యా ధాద్యోఽశ్వప—నాగపా వపి కవీ
రామిల్లమేదూ క్షణాత్—
(గురురత్నమాలికా, 53 పు.)

కించ—

'ఆచార్యైశద్విజన్మార్థ్యతిథిషు వినతో
వైనతేయః శకాహేః
కశ్మీరానేవ కావ్యం కిమపి కవయితుర్
దత్త్వా న్రపమత్తమ్,
రక్షాదత్త ప్రహర్ష ప్రకృతి
కృతిశతాధ్మాత హర్షః సహర్షః
కర్ణాభ్యర్ణావతీర్ణః కథమథతదనో
వ్రికమా వ్రికమార్కః?
ఇత్యాదినా

యచ్చ హయగ్రీవవధేఽపి

'ఖ్యాత శ్రీ శఙ్కరేన్ద్ర ప్రచురతర
కృపాలబ్ధ సాహిత్య విద్యః
పద్యః సాధూక్తి సంమోద్యపి
పరకవితామర్షిణో మాతృగుప్తాత్,
ప్రౌఢాః ప్రౌఢోక్తి రూఢైర్ నిబిడరసభరైర్
గుమ్ఫనై ర్యత్ర మేదుర్
మేథుర్మోదాదినాదీ ద్ధయవదనవధం
వాగ్మ్యకుణ్ఠా స్స మేణ్ఠః'
—ఇతి చ ప్రవళ్ళితమ్.3

కామకోటి పీఠము నలంకరించిన 20 వ శంకరు లిదివఅకు పేర్కొనబడిరి. ఈయనయే మూకకవి (మూకార్భకశంకరులు)(క్రీ.396–436). రామిలుడు మణిప్రభయందును, మేంఠుడు హయగ్రీవవధయందును తమ గురువగు మూకకవిని ప్రస్తుతించినట్లు తెలియుచున్నది. మాతృగుప్తుడును ఈయనయు సమకాలికులు. పుట్టుకలోనే మూగవాడగు నీయన విద్యాఘనుడను ఒకానొక యోగీశ్వరుని యనుగ్రహమున మంత్రపూర్వకస్నాతుడై వాక్కును పడసి, కంచికామాక్షీదేవిని 5 శతకములచే స్తుతించెను. దివ్యకవితాసురభిళమగునీస్తుతి భక్తిరస గర్భనిర్భరమగు కవి హృదయమున పొంగి పొరలి వచ్చినట్లుండును. ఈ గ్రంథము 'మూకపంచశతి' యని ప్రఖ్యాతి నందినది.[4]

2. భట్టబాణుడు, తత్తనయుడు భూషణభట్టు: (క్రీ. 7 వ శతాబ్ది.)

మహావిద్వాంసుడు కవిశేఖరుడు, విద్వత్కవి మండలికి పట్టుగొమ్మయునగు హర్షవర్ధన చక్రవర్తి

---

3. Dr. M Krishnamachariar: History of Classical Sanskrit Literature—pages : 551—52, para 566 (1937.)

**4. ఉపజీవ్య గ్రంథమంజరి :**

1. కావ్యానుశాసనము (హేమచంద్రుడు; Ed. R. C. Parikh, 1938.)

2. గురురత్నమాలిక (సదాశివ బ్రహ్మేంద్ర సరస్వతి)

3. మాళవికాగ్నిమిత్రమ్ (బాలమనోరమా ప్రచురణ 1944.)

4. మూకపంచశతి (మూకకవి), బాలమనోరమా ప్రచురణ, 1937.

5. శార్‌ఙ్గధర పద్ధతి (శార్‌ఙ్గధరుడు, 1888)

6. సూక్తిముక్తావళి (జల్హణుడు; G. O. S.- Baroda) 1938.

7. History of Classical Sanskrit Literature — Dr. M. Krishnamachariar (1937.)

(క్రీ. 6 వ శతాబ్ది అంతము, 7 వ శతాబ్ది పూర్వార్ధము) ఆ స్థానము దిగ్దంతులవంటి కవికోవిదుల కాశ్రయము. బాణుడు, మయూరుడు, మాతంగ దివాకరుడు మొదలగు కవిశిరోమణు లాయన సభ నలంకరించిరి. అందు గద్యకవి చక్రవర్తియగు భట్టబాణుడు కాదంబరి అను కథను, హర్షచరితమను ఆఖ్యాయికను చండీశతకాదులను రచించెను. కాదంబరిలో పూర్వభాగమును మాత్ర మాయన రచించి కాలధర్మము నందెను. ఇట్టి గ్రంథరాజ మసమగ్రమగుటకు విచారించి, ఆయన కుమారుడు భూషణ భట్టు తన వైదుష్యరచనాప్రావీణ్యముల ననుసరించి గ్రంధము పూర్తిచేసెను.

'కాదంబరీ రసాస్వాదా దాహారో౽పి న రోచతే' (కాదంబరి అన బాణుని గ్రంథము, మద్యమును) అని విద్వన్మండలిలో లోకోక్తి. ఒక్కకాదంబరిని కూలంకషముగ వ్యాసంగము చేసిన అమరవాణియందు వ్యుత్పత్తి కలుగును. మూలగ్రంథమును తండ్రి కొడుకు లిద్దరు రచింపగా తద్వ్యాఖ్యను గురుశిష్యులిరువురు— భానుచంద్రుడు సిద్ధచంద్రుడును (వరుసగా పూర్వోత్తర భాగములకు) నిర్మించిరి. ఇంకొక సాహిత్య చమత్కారమును తెలిపి ఈ ప్రకరణమును ముగింతును. మూల గ్రంథము గద్యమైనను ఛందోబద్ధమైనను వ్యాఖ్యమాత్రము వచన రూపముననే ఉండును. కాని, దక్షిణ భారత వర్షమున కొన్ని సంస్కృత గ్రంథములకు భూమికయే కాక ముఖవృత్తముకూడ ఛందోబద్ధముగా నుండుట విచిత్రము. అట్లే దాక్షిణాత్య వ్యాఖ్యాత యొకడు కాదంబరికి ఛందోబద్ధ వ్యాఖ్య రచించెను. దీనివ్రాతప్రతి కేరళ ప్రాచ్యగ్రంథ నిలయమున కలదు.

### 3. జినసేనుఁడు (క్రీ. 783), తదంతేవాసి గుణభద్రుడు :

జైన సంస్కృత రచయితలు అమరవాణికి చేసిన సేవ అపారము. జినసేనుడు, తచ్ఛిష్యుడు గుణభద్రుడును రాష్ట్రకూట ప్రభువుల కాశ్రితులేకాక, మతాచార్యులుగా ఆశ్రయులుకూడ. మహావిద్వాంసుడు, కవిశేఖరుడు అగు జినసేనునిగూర్చి ఒక ఐతిహ్యము కలదు. క్రీ. 793 న హరివంశమును రచించి, మేఘదూత సమస్యా రూపమగు పార్శ్వాభ్యుదయమును 814 లో ముగించి, ఆదిపురాణ రచన కుపక్రమించి 42 సర్గలు మాత్రము వ్రాసిన తర్వాత తన కవసాన కాల మాసన్నమగుట గుర్తించి,గ్రంథపూరణమును తన శిష్యులలో నొకని కప్పగింప నెంచెనట.శిష్యమండలినుండి ఇరువురను పిలిచి వారిలో కావ్యనిర్మాణకౌశల మెవ కున్నదో కనిపెట్టుటకై,తమయెదుటనున్న ఎండిపోయి చెట్టును (మోడును) వర్ణించుమనెను. అపుడు కవితారంగమున జాత్యంధుడగు ప్రథమ శిష్యుడు— 'శుష్కం కాష్ఠం తిష్ఠత్యగ్రే'—అని నుడువగా నీతనికి కవితావాసన లేశమైనను లేదని, గురువు లోలోన నవ్వుకొని రెండవవాడగు గుణభద్రుని అడుగగా నాతడు—

'నీరసతరు రిహ విలసతి పురతః'—అని వర్ణించెనట. మొదటివాడు రసస్ఫూర్తి లేని మాటలను కూర్పగా, ఆ విషయమునే గుణభద్రుడు రసస్ఫోరక శబ్దములతో మనోహరముగా నుడివెను. ఆచార్యు లానందించి, గ్రంథమును పూర్తిచేయుమనెను. శిష్యుడు పరిశిష్టభాగమును ఉత్తరపురాణమను పేరున 5 సర్గలలో ముగించెను. గుణభద్రుని మరొక గ్రంధము జినదత్తచరితము.

రెండువలె శుష్కములై కవితాసామగ్రిగా నుపయోగింపని పదములు కొన్ని, రసస్ఫూర్తి కలిగి కవిత కుపయోగించు శబ్దములు కొన్ని. పై రెండింటి భేదమును భోజుడు సరస్వతీ కంఠాభరణమున ఇట్లు వివరించియున్నాడు :

> 'పశ్యతి స్త్రీతి వాక్యే హి న రసః ప్రతిభాసతే,
> విలోకయతి కాంతేతి వ్యక్తమేవ ప్రతీయతే.'

స్త్రీ పశ్యతి; కాంతా విలోకయతి—అను పదములకుగల భేదమును గుర్తింపదగును.

### 4. ధనంజయుఁడు, తత్సోదరుడు ధనికుడు (క్రీ. శ. 950—995.)

వీ రిరువురును మాళవదేశాధీశ్వరుడగు ముంజమహీపాలుని (=రెండవ వాక్పతిరాజు) విద్వత్సభ నలంకరించిరి. ముంజుడు కవియు, పండితుడే కాక కవికోకిల కల్పద్రుమము. పద్మగుప్తుడు

(=పరిమళ కాళిదాసు) నవసాహసాంక చరితకర్త, సరస్వతీ పుత్త్రుడని ప్రఖ్యాతినందిన ధనపాలకవి (=తిలక మంజరీ రచయిత), కవి రహస్యకర్త యగు హలాయుధుడును సమకాలికులు. ఈ ధనంజయుడు ద్విసంధాన—నామమాలాదులను నిర్మించిన జైనకవి కంటె భిన్నుడు. మన ధనంజయుడు నిర్మించిన దశ రూపకము పాఠప్రవచనములవల్ల విఖ్యాతినందినది. దీనిపై 'అవలోకము' అనువ్యాఖ్యను రచించిన విద్వత్కవి ధనికుడు ధనంజయుని సోదరుడే. ధనికుడు ఉత్పల రాజనామాంతరముగల ముంజభూపాలుని విద్వత్సభ నలంకరించి, ఆ ప్రభువు సన్నిధినే మహాసాధ్యపాలకు డను ఉన్నతోద్యోగిగా నుండెను. ఈతని కృత్యంతరము కావ్య నిర్ణయము అవలోకమున పలుసారు లుల్లేఖింపబడెను.

5. క్షేమేంద్రుడు, ఆయన కుమారుడు సోమేంద్రుడు (క్రీ. 11 వ శతాబ్ది).

కాశ్మీర దేశవాసి, అభినవ గుప్తపాదుని శిష్యుడు, శకట గ్రంథస్రష్ట, అనంతవర్మ మహారాజు (1029—64) న క్రాశితుడు, వైష్ణవ భాగవత శిరోమణియు అగు ఆచార్య క్షేమేంద్రుడు పరమత సహనముగల ఉదారుడు. ఈయన రచించిన గ్రంథములలో బౌద్ధావదానకల్పలత ఒకటి. అది యసంపూర్ణముగానుండ ఆయన తనయుడు తుది ప్రకరణమును రచించి గ్రంథమును పూర్తిచేసెను. బాణుడు, తత్తనయుడును కాదంబరిని పూర్తిచేసి నట్లు క్షేమేంద్ర—తత్తనయులు కలసి అవదాన కల్పలతను నిర్మించిరి. ఈ గ్రంథమును ఇటీవల డాక్టర్ పి. యల్. వైద్యపండితుడు, దర్భాంగ సంస్కృత విద్యాపీఠపక్షమున చక్కగా సంస్కరించి ప్రచురింపం జేసెను.

6. ఆచార్య—మమ్మటుడు—అల్లటుడు (అలకుడు)—క్రీ. 1050—1100.

బహుశాస్త్రములకు, మహాకవులకు, విద్వచ్చూడామణులకును జన్మస్థానమగు కాశ్మీరదేశమునవే మమ్మటు డవతరించెను. రాజానక—జయ్యటు డీయన జనకుడు. వైయాకరణ శిరోమణియగు కయ్యటుడును, వేదభాష్యకారుడగు ఉవ్వటుడును ఈయన సోదరులని యందురు. విద్వత్కవికల్పద్రుమము, విద్వన్మూర్ధన్యుడు, కవిశేఖరుడునగు భోజుడు, నన్నయ—నారాయణభట్టులు, తత్పోషకుడగు రాజరాజనరేంద్రుడు, వైజయంతీకోశనిర్మాత యాదవప్రకాశులు, ఈయనకు మొదట శిష్యుడును, పిమ్మట గురువును అగు భగవద్రామానుజులును (క్రీ. 1017—1137), ఈయనకు పరమ గురువగు యామునాచార్య చరణులు మొదలగు నెందఱో దివ్యవిజ్ఞాన దీపికలు వెలిగిన కాలమది.

సంస్కృత సాహిత్యశాస్త్ర ప్రపంచమున అభ్రంకషములగు మహాశిఖరములు మూడు: ధ్వన్యాలోకకర్త ఆనందవర్ధనుడు (క్రీ. 850), కావ్యప్రకాశనిర్మాత మమ్మటుడు, రసగంగాధరస్రష్ట జగన్నాథ పండిత—రాయలును. ఆనందవర్ధనునకు, అభినవగుప్తునకు (క్రీ. 1000) పిమ్మట నవతరించిన ఆలంకారిక శేఖరులలో అగ్రగణ్యుడు మమ్మటుడు. వాఙ్మయ ప్రపంచమున, విద్వన్మండలియందును పాఠప్రవచనములచే విశేషాదరము నందిన గ్రంథము కావ్యప్రకాశము. రచింపబడిన స్వల్పకాలమునుండియే పఠనపాఠనములచే ఆసేతుశీతాచలమును దీనికి వ్యాప్తి కల్గెను. ఈ గ్రంథముపై నాటినుండి ప్రతిశతాబ్దమునను వ్యాఖ్యలెన్నియో నిర్మింపబడెను. 19, 20 శతాబ్దములలో ఆంగ్లము, ఆంధ్రము, కన్నడము, హిందీ మొదలగు నెన్నియో భాషలలోని కిది అనువదింపబడెను. సమగ్రత, సంగ్రహత్వము, వైశద్యము గల ఈ గ్రంథమున తత్కర్తయొక్క విశాలము, అగాధము నగు వైదుష్యము, సునిశితమగు విమర్శశక్తి, చక్కని కవితా రసాస్వాదన పాటవమును కన్పట్టును.

కారికా—వృత్తిరూపముననున్న ఈ గ్రంథమున 10 ఉల్లాసములు, 602 ఉదాహరణములును కలవు. కావ్య ప్రకాశము మమ్మటుడు పూర్తిగా రచింపలేదనియు, పరికరాలంకార చర్చవఱకు మాత్రము తద్రచన అనియు, మిగిలిన స్వల్పభాగమును రాజానక—అల్లటుడు రచించెనని కొన్ని శతాబ్దములనుండియు పండితుల విశ్వాసము. ఈ గ్రంథముపై కాశ్మీర వాసియే యగు రాజానక—ఆనందుడు 'నిదర్శ' అను

వ్యాఖను రచించి (క్రీ. 1765) అం దిట్లు వ్రాసి యున్నాడు :

'కృత శ్రీమమ్మటాచార్యవర్యైః పరికరావధిః
ప్రబంధః పూరితః శేషో విధా యాల్లటసూరిణా'

కావ్య ప్రకాశ వ్యాఖ్యాతలలో కాలక్రమ మునుబట్టి రెండవవాడగు మాణిక్యచంద్రుడు (క్రీ. 1190–1210) మమ్మటునికంటె ఒక శతాబ్దము తరువాతి వాడు. ఈయన 'సంకేత' వ్యాఖ్యయందు (పు. 304) పై విషయమునే యిట్లు తెల్పియున్నాడు. 'అథ చ అయం గ్రంథం అన్యే నారబ్ధః అపరేణ సమాపితః ఇతి ద్విఖండోఽపి సంఘటనావశాత్ అఖండాయతే.'

7, 8 శతాబ్దులక్రిందనున్న మాణిక్య చంద్రుని అభిప్రాయమును మనము అంగీకరింపవలసినదే. ప్రబల ప్రమాణాంతరము లభించినకాని దీనిని నిర సింప జాలము. కావున కావ్యప్రకాశ రచనమున అల్లటుడు మమ్మటునకు సహగ్రంథ కర్తయని సిద్ధాం తీకరింపవలెను.

7. రామచంద్రకవి, ఆతని సహాధ్యాయి, గుణ చంద్రుడు: (క్రీ. 12 వ శతాబ్ది.)

హేమచంద్రుని కంతేవాసులు పలువు రుండెడి వారు—రామచంద్రుడు, గుణచంద్రుడు, దేవచంద్రుడు, ఉదయచంద్రుడు, బాలచంద్రుడు, యశశ్చంద్రుడు, మహేంద్రసూరి, వర్ధమానగణి—మొదలగువారు. వీరిలో రామచంద్ర గుణచంద్రులు, వైదుషీ వైభవమువల నను, కవితాకౌశలమువల్లను అగ్రగణ్యులు. వీరిలో రామచంద్రుడు దైవయోగమున కాణుడయ్యు (ఏకాక్షి యయినను) గ్రంథశతనిర్మాత. వీనిలో కొన్ని మాత్ర ముపలబ్ధము లైనవి. ఆ కాలమున ఘూర్జరదేశమున రచింపబడిన గీర్వాణరూపకము లిరువదియైదింటిలో 11 నాటకములు రామచంద్రకవి నిర్మితములే. ఈ కవి నాటకము, నాటిక, ప్రకరణము, వ్యాయోగము అను వివిధరూపకముల రచించెను. రామచంద్రుడు, తత్సతీర్థుడగు గుణచంద్రుడును కలసి ప్రశస్తమైన నాట్యశాస్త్ర గ్రంథమును – నాట్యదర్పణ మను పేర రచించిరి. ధనంజయుని దశరూపకమును పై జంట కవులు ఎఱిగియే యుండియు, నాట్యదర్పణమున తమ ఉపజ్ఞను అనుభవములను పురస్కరించుకొని ఎన్నియో విశేషములను విశదీకరించిరి. మనము కని విని యెఱుగ నివి ఉత్సన్నప్రాయములు, నామమాత్రజ్ఞాతములు అగు ప్రశస్తరూపకములనుండి యిందెన్నో ఉదాహరణ ములు క్రోడీకరింపబడెను. విస్మృతకల్పులగు కవి శేఖరుల నామము లెన్నో ఈ యాకరములవల్ల తెలియుచున్నవి. సంస్కృత సారస్వత చరిత్ర నిర్మాణ మున ఈ పరికరము లమూల్యములు.

1. అనంగవతి (నాటిక)
2. అనంగసేనా హరినందిని (ప్రకరణము)
3. అభినవ రాఘవము (క్షీరస్వామి)
4. ఇందులేఖ
5. ఉదాత్త రాఘవము
6. కృత్యారావణము
7. కోసలికా—నాటిక
8. కౌముదీ మిత్రానందము (రామచంద్రకవి)
9. చిత్రోత్పలావలంబికి (అమాత్యశంకుకుడు)
10. ఛలితరామము
11. తరంగదత్తము
12. తాపసవత్సరాజము
13. దరిద్ర చారుదత్తము
14. దేవీ చంద్రగుప్తము
15. ధర్మపాలము
16. పాండవానందము
17. పార్థవిజయము
18 పుష్పదూషితకము
19. ప్రతిమానిరుద్ధము
20. ప్రయోగాభ్యుదయము
21. బాలికావంచితకము
22. భీమపరాక్రమము
23. మనోరమావత్సరాజము (భీమటకవి)
24. మల్లికా మకరందము (రామచంద్రకవి)
25. మాయా పుష్పకము
26. రాధా విప్రలంభము
27. రోహిణీ మృగాంకము

28. వనమాల (రామచంద్రకవి వనమాలిక?)

29. విలక్ష దుర్యోధనము

30. సత్యహరిశ్చంద్ర నాటకము (రామచంద్ర కవి)

31. స్వప్నదశాననము (భీమదేవకవి)

32. స్వప్నవాసవదత్త (భాసకవి; కాని ఇందలి యీ ఉదాహరణము తిరువాన్కూరు ప్రతిలో లేదు.)

రామచంద్రకవి కృతులలో మనకు తెలియ వచ్చిన రూపకములు :

1. కౌముదీ మిత్రానందము,
(భావనగరమున ముద్రితము.)

2. నలవిలాసము

3. నిర్భయభీమము (వ్యాయోగము)

4. మల్లికా మకరందము

5. యాదవాభ్యుదయము (ఈ పేరుతోనే వేదాంత దేశికులు రచించిన మహాకావ్య మొకటి కలదు.)

6. రఘువిలాసము

7. రాఘవాభ్యుదయము

8. వనమాలిక

9. సత్యహరిశ్చంద్రము [నిర్ణయసాగరప్రెస్సున ముద్రితము. ఫ్లోరెన్సు నగరమున (Florence) ఇటాలియన్ భాషానువాదము ప్రకటితమట.]

ఒక్క భాస మహాకవితప్ప ప్రాచీన సంస్కృత కవులలో 10 నాటకములు వ్రాసినవారే లేరు. పైని పేర్కొనిన 9 గ్రంథములను రామచంద్ర—గుణ చంద్రులు రచించిన 'నాట్యదర్పణము'నన్ ఉదాహరించుకొనబడెను.

8. కృష్ణలీలాశుకుడు, తదంతేవాసి దుర్గాప్రసాదయతి (క్రీ. 13 వ శతాబ్ది.)

మహాకవి భక్తచూడామణియునగు లీలాశుకుడు కవితాక్షేత్రముననేకాక వ్యాకరణ—వేదాంతములయందు కూలంకష వైదుషీభాషితుడు. కేరళ దేశీయుడగు ఈయన జననీజనకులు నీలీదేవి దామోదరులు, గురువు ఈశానదేవుడు. లీలాశుకుడు సన్యసించి బిల్వమంగళుడని వ్యవహరింపబడుచుండెను. అమృతతుల్యమగు కవితామాధురితో 3 శతకములుకల ఈయన కృష్ణస్తుతి కావ్యము ప్రఖ్యాతము. 'త్రిభువనసుభగము' పురుషకారము 'బృందావనస్తుతి' మొదలైన వెన్నో ఈయన రచనలు కలవు. 'గోవిందాభిషేక'మను 8సర్గల కావ్యమున నీయన ప్రాకృత వ్యాకరణ సూత్రములకు లక్ష్యయుల నెన్నిటినో ఉదాహరించెను. అసమగ్రమగు నీ కృతిని ఈయన శిష్యుడగు[6] దుర్గాప్రసాదయతి[6] 4 సర్గలలో పూర్తిచేయుటేకాక, పూర్తిగా గ్రంథముపై వ్యాఖ్యను రచించెను. ఈ కావ్యమునకు శ్రీ చిహ్నకావ్యమని నామాంతరము. మహాకావ్యలక్షణములలో ఎక్కడనో కాని కావ్యాంకములు (చిహ్నములు) పేర్కొనబడలేదు. కాని సంస్కృత కావ్యములందు ఈ యంకము లనేక స్థలములందు కన్పట్టుచున్నవి. ప్రఖ్యాతములగు కిరాతార్జునీయమున, శిశుపాలవధయందు కల కావ్య చిహ్నములు విద్వన్మండలికి తెలిసినవే. అట్టివిట కొన్ని సూచింపబడును.

---

5. Vol. I. G. O. S—Baroda—1 st ed. 1929; 2nd ed. 196—

6. దుర్గాప్రసాదయతి—వ్యాఖ్యానము నందలి ఈ శ్లోకములను చూడదగును.

'శ్రీ కృష్ణలీలాశుకబద్ధకావ్యం
వివృత్య లోకస్య హితాయ పూర్వమ్
తచ్ఛేషపూర్తిం చ పునర్విధాయ
వివృణ్మహే ఉత్తరభాగ మేతమ్.

ముక్తిస్థలాలయ భక్తిలేశాత్
దుర్గాప్రసాదయతి రిత్యభిధాం దధానః

గోవిందాభిషేకము (=శ్రీ చిహ్నకావ్యము)న శ్రీకృష్ణచరిత్ర అభివర్ణింపబడెను. లీలాశుకుడు రచించిన మొదటి 8 సర్గములందు వరరుచి ప్రాకృత ప్రకాశమున కుదాహరణము లీయబడెను. మిగిలిన 4 సర్గములందు దుర్గాప్రసాదయతి త్రివిక్రముని ప్రాకృత వ్యాకరణమునకు లక్ష్యముల నొసగెను.

Dr. M. K.'s H. C. S. L. paras 4 and 292.

1. అనురాగ (సేతుబంధమున)
2. అభ్యుదయ (కృష్ణచరితము)
3. ఆనంద (శూద్రక కథ)
4. ఉత్సాహ (హరివిజయ)
5. జయ (ఉషాహరణ)
6. జిన (నిర్వాణ లీలావతి)
7. ధైర్య (తాపసవత్సరాజ)
8. రత్న (హరవిజయ)
9. వీర (బాలభారత; పద్మానందమహాకావ్య)

ఇట్టి కావ్యాంకములను మొదట సూచించి వర్గీకరించి, ఉదాహరించిన సాహిత్యవేత్త ఆచార్య హేమచంద్రుడు (క్రీ. 1088–1174). ఈయన కావ్యానుశాసనమున 8 వ ప్రకరణమున (పు. 335 R. C. Parikh's ed. 1938 Bombay) ఈ విషయములను విశదీకరించెను.

9. కవిరాజు అరిసింహుడు, తత్సహపాఠి, శిష్యుడునగు అమరచంద్రుడు. (క్రీ. 13 వ శతాబ్ది).

'సారస్వతామృత మహార్ణవపూర్ణిమేన్దుః,
సే వ్యారిసింహసుకవేః కవితా రహస్యమ్.'
(—అమరచంద్రుని కావ్యకల్పలత 1–2)

అరిసింహఠక్కురకవి లావణ్యసింహుని తనయుడు; జినదత్తసూరి శిష్యుడు; వస్తుపాల మహామాత్యునికి అత్యంతాప్తుడై క్షేత్రాది బహుమానముల ఆయన వల్ల పొందెను. గృహస్థుడైనను అరిసింహుడు సన్యాసియగు అమరచంద్రసూరికి లలితకళా గురువు. సాహిత్యవేత్తయు, కవిశేఖరుడునగు అమరచంద్రుడు అరిసింహుని అతని కవిత్వమును ఎంతయో ఆదరించెడివాడు. తనకు కవితాగురువగు అరిసింహునితో కలిసి అమరచంద్రుడు 'కావ్యకల్పలత' అను కవిశిక్షా గ్రంథమును రచించెను. అమరచంద్రునికి కవితారంగ ప్రవేశము అరిసింహుని ప్రోత్సాహ శిక్షణములవల్లనే కలిగెను. ప్రభువగు విశాలదేవుని యాస్థానమున అరిసింహునకు ప్రవేశము అమరచంద్రునివల్ల కలిగెను. విశాలదేవుడు వీరధవళమహీపతి యనంతరము (క్రీ. 1238) సింహాసనము నధిరోహించిన తత్తనయుడు. ఈయన ఒకనాడు 'మీ కవితా గురువెవరు' అని అమరచంద్రు నడుగ కవిరాజగు అరిసింహుడని అతడు ప్రత్యుత్తరముచెప్పి, రాజాజ్ఞకాగా మరునాడు అరిసింహుని అమరచంద్రుడు రాజసభకు తీసికొనిపోయెను. ప్రభువు కత్తిపై అనుకొని కూర్చుండి, సమయోచితముగ తన కవితాకౌశలమును ప్రదర్శింపదగునని అరిసింహునితో ననెను. వెంటనే కవి ఆశువుగా మహీపతి హస్తమునందలి ఖడ్గమును 4 శ్లోకములలో మనోహరముగా వర్ణించెను. భూపతి తద్వర్ణనమున కెంతయో సంతసించి కవికి భూరివేతనము గల స్థిరోద్యోగము నొసగెను. మహీపతి ఒకనాడు ఒక గడ్డిపోచను పట్టుకొనియుండ కవి తత్సన్నివేశమును మనోజ్ఞముగా ఛందోబద్ధముగా వర్ణింప[7] ప్రభువెంతయో యలరి కవివేతనమును ద్విగుణీకరించెను.

అరిసింహుని కవితాసౌరభము, గుజరాత్‌దేశమునకు వెలుపలగూడ ప్రసరించెను. సహృదయమండలి కీయన కవిత్వముపై ఆదరము కలిగినది. జల్హణుని సూక్తిముక్తావళియందీతని పేరున ఈ క్రింది 7 శ్లోకము లుదాహృతములు:

1. అతివిపులం (శార్ఙ్గధరపద్ధతియందును కలదు.)
2. కాంతారేద్వైవ.
3. తడిద్వా.
4. పంకోవా.
5. (దధిమథన — ఇది అరిసింహునిదికాదు.) అమరచంద్రుని 'బాలభారతము'లోనిది, ఆదిపర్వము. 11 వ సర్గ.)
6. నక్తం నిరంకుశ.
7. మధ్యేన తస్యా

రత్నమందిరగణి (క్రీ. 1461) 'ఉపదేశతరంగిణి'యందు వస్తుపాలుని ప్రశంసించు అరిసింహుని శ్లోక మొకదాని నుల్లేఖించి, దానికి కవికి 2000 బహుమతి లభించెనని తెల్పియున్నాడు. అరిసింహుని సాహిత్యక్షేత్ర కృషికి, కవితారంగవ్యవసాయమునకు లభించిన ఉత్తమఫలము 'సుకృత సంకీర్తనము'—అను నైతిహాసిక మహాకావ్యము. వస్తుపాలమహామాత్యుని

7. Prabandhakosa of Rajasekhara-suri (p. 61, Ahmedabad & Calcutta (1935)

జీవితచరిత్రను, ఆ మహాపురుషుని ఘనకార్యములను ఇది వివరించును. ఇందు 11 సర్గలు, 553 శ్లోకములును కలవు. సోమేశ్వరకవి 'కీర్తికౌముది'యందు వస్తుపాలుని రాజకీయజీవితమును చిత్రింపగా, 'సుకృతసంకీర్తనము'న లోకోపకారకములు, మతోద్ధారకములు నగు నాయన ఘనకార్యములు కీర్తింపబడెను. అందువలన ఈ రెండును పరస్పరానుబంధము లనదగును.

అమరచంద్రకవి (=వేణీకృపాణామరచంద్రుడు)

1. అలంకార ప్రబోధము.
2. కలాకలాపము.
3. కవిశిక్ష (వ్యాఖ్య).
4. కావ్యకల్పలత (కాశీప్రతి 1931)
5. కా. క. పరిమళము
6. ,, మంజరి
7. చతుర్వింశతి—జినేంద్ర - సంక్షిప్తచరితము—(బరోడాప్రతి 1932)
8. ఛందోరత్నావళి.
9. (జినేంద్రచరిత = పద్మానందమహాకావ్య బరోడాలో ముద్రితము, 1932.
9. పద్మానందమహాకావ్య=జి. చ.
10. బాలభారత — (నిర్ణయసాగర ప్రెస్, బొంబాయి, 1894)
11. సూక్తావళి.
12. స్యాదిశబ్ద సముచ్చయ (కాశీప్రతి—వీరశక—2441.)

సబ్రహ్మచారి కవితా గురువు అగుకవిరాజ అరిసింహుని యనుగ్రహమున సిద్ధసారస్వత మంత్రము నుపదేశమంది సారస్వత సిద్ధిని పడసి, ఆశుకవితాకళయందు నిష్ణాతయ్యె. అష్టోత్తర శత సమస్యలను ఒక్కపట్టున పూరింపగల్గి ద్వాదశ గ్రంథరాజముల నిర్మించిన అమరచంద్రసూరి ప్రాతఃస్మరణీయుడు; 'బ్రహ్మందు—బ్రహ్మజ్ఞ' బిరుదములను పడసిన సాధుపుంగవుడు యతిశేఖరుడు.

'బ్రహ్మజ్ఞ ప్రవరో, మహావ్రతధరో, వేణీకృపాణామరః'—అని నయచంద్రసూరిచే హమ్మీరమహాకావ్యమున (14. స. 31 ప) ప్రస్తుతింపబడిన అమరచంద్రసూరి మధ్యయుగ సంస్కృత సారస్వత చరిత్రయందు ప్రఖ్యాత కవి కోవిదులలో నొకడు. పైనుల్లేఖింపబడిన పండ్రెండు గ్రంథ రత్నములలో కావ్యకల్పలత బాలభారతములనుబట్టి యీయనపేరు విద్వన్మండలిలో వ్యాపించినది. ఈయన మొదట వాయడగచ్ఛమునకు చెందిన బ్రాహ్మణుడు. పిమ్మట జినదత్తసూరి శిష్యుడై జైనసన్యాసి అయ్యెను. తాను జైనమతము నవలంబించినను పూర్వాశ్రమ వాసనా ప్రభావమున, బాలభారతమునందు ప్రతిసర్గాదియందును వ్యాసమహర్షిని ప్రస్తుతించెను. మఱియు నీగ్రంథాంతిమ సర్గమునందలి ప్రశస్తిలో వాయడగచ్ఛమున కధిష్ఠానదైవమగు వాయుదేవునిట్లు నుతించెను.

శా. 'కించిత్ సంచలితేఽపి వస్తుని భృశం
యత్స్తంభవా న్మనమ్మహే
విశ్వం యన్మయ
మీశ్వరాదిమయతాస్పష్టప్రమాణోప్సితమ్,
సంసారప్రసరః పర స్తనుమతాం
యస్యానురోధేషు యత్
సంరోధేషు శివం స యచ్ఛతు సతాం
శ్రీ చారుతాం మారుతః' (1 ప.)

మఱియు వాయడగచ్ఛమునందలి విప్రవరుల ప్రార్థనమువల్లనే ఈయన బాలభారతమును రచించినట్లు తెలియుచున్నది. జైనుడయ్యు ఈ మహనీయుడు వైదికవిజ్ఞానమున కూలంకషవ్యాసంగ మొనర్చినట్లు కావ్యకల్పలతనుబట్టి తెలియుచున్నది; ఈయన తనకు పితృపితామహులనుండి లభించిన బ్రాహ్మణత్వమును మూలముట్టుగా విసర్జింపలేదు. కవిరాజ అరిసింహుడు తన కుపదేశించిన సిద్ధసారస్వతమంత్రమును అమరచంద్రుడు తదేకదీక్షతో 21 దినములు, విశాలదేవ మహీపతియొద్ద అమాత్యుడగు పద్మకవి భవనమున నొక వివిక్తప్రదేశమున జపించెను; 21 వ నాటి అర్ధరాత్రి సరస్వతీదేవి చంద్రమండలమునుండి అవతరించి ఆయనకు ప్రత్యక్షమై, 'సకలరాజన్యులును సమ్మానించు సర్వోత్కృష్టకవి వగుదువు' అని వరమును ప్రసాదించెనట. తన్మహిమచే ఆయన అనేక

గ్రంథరాజముల రచించి, తన ఖ్యాతిని నలుదెసలను వ్యాపింపజేసెను. ఈయన కవితావైభవమును గూర్చి విని విశాలదేవప్రభు వీయనను తన దర్బారున కాహ్వానింప అమాత్యుడగు వైజలుని పంపెను. దర్బారునకు వచ్చుటయే తడవుగ అమరచంద్రుడు విశాలదేవుని కీర్తించుచు రెండు శ్లోకముల ఆశువుగా పఠింప, శీఘ్రకవితయం దీతని ప్రజ్ఞాపాటవమును పరీక్షించుటకై, ఆ దర్బారు నలంకరించిన సోమేశ్వరకవి, సోమాదిత్యుడు (వామనస్థలీవాసి) కమలాదిత్యుడు (కృష్ణనగర్), నానాకకవి మొదలగు కవిశేఖరులు 108 సమస్యల నీయగా, వెనువెంటనే అమరచంద్రుడు వాని నన్నింటిని పూరింప నచ్చటి కవులు ఆనందచమత్కృతులై సాయంకాలమువఱకు ఆకవితాగోష్ఠిలోనే యుండిపోయిరి. ప్రభువగు విశాలదేవుడు అమరచంద్రుని తన విద్వత్సభలో కవిశేఖరునిగాచేసి గౌరవించెను. ఆ కాలమున ఆశువుగా 108 శ్లోకముల రచింపజాలినవాడే మహాకవిగా గణింపబడెడివాడు. బహుశః ఇదియే నాటి అష్టోత్తర శతావధానము కావచ్చును.

అగ్బర్చక్రవర్తికి (క్రీ పాలన 1556–1605, సూర్యసహస్రనామోపదేష్ట యగు భానుచంద్రుని శిష్యుడు సిద్ధిచంద్రుడును అట్లే అష్టోత్తర శతావధానముచేసి, చక్రవర్తినుండి బిరుదములు సన్మానములను పొందెనట.

సాహిత్యరంగమున తానెంతటి మహోన్నత స్థానము నలంకరించినను అమరచంద్రుడు తనకవితా గురువగు అరిసింహ కవియం దమేయభక్తి గౌరవములను గల్గియుండెడివాడు. ఈ విషయము అరిసింహుని సుకృత సంకీర్తనమునకు ప్రతిసర్గాంతమున అమరచంద్రుడు చేర్చిన 4, 5 శ్లోకములవల్ల విశదమగును.

అమరచంద్రుడు బహుముఖవైదుష్యీభూషితుడు బహుగ్రంథ నిర్మాత. ఈయన గ్రంథములలో 5 మాత్రము ముద్రితములు. కొన్ని ఉత్పన్నములు, నామమాత్ర జ్ఞాతములు: తద్గ్రంథ సూచిక—

1. అలంకార ప్రబోధము.
2. కలాకలాపము.
3. కవిశిక్షా—వ్యాఖ్య,
4. కావ్యకల్పలత (కాశీముద్రణము.1931)
5. కావ్యకల్పలతా –పరిమళ వ్యాఖ్య
6. ,, మంజరి (ఉత్పన్నము)
7. చతుర్వింశతి—జినేంద్ర–సంక్షిప్త చరితము (బరోడాలో. 1932)
8. ఛందోరత్నావళి
9. (జినేంద్ర చరితము) పద్మానంద మహాకావ్యము (బరోడా. 1932)
10. బాలభారత ,, (నిర్ణయసాగర్ ప్రెస్ బొంబాయి—1894)
11. సూక్తావళి
12. స్యాదిశబ్దసముచ్చయము (కాశీ వీర శకము: 2441).

పై వానిలో 3, 4, 7, 9, 10, 12, సంఖ్యలు గలవి ముద్రితములు.

1. అలంకార ప్రబోధము లుప్తప్రాయము; కావ్యకల్పలతావృత్తి (=కవిశిక్ష)యం దుదాహృతము.

2. కలాకలాపము శాస్త్రగ్రంథమని రాజశేఖర సూరి ప్రబంధకోశమున సూచించెను. బహుశః, క్షేమేంద్రుని కళావిలాసమువలె నిదియు వివిధకళావిచారకము కావచ్చును.

3–4. కవిశిక్ష కావ్యకల్పలత (కాశీలో ముద్రితము) క్షేమేంద్రుని కవికంఠాభరణము దేవేశ్వరుని కవికల్పలతలవలె కవి కాదలచినవానికి శిక్షాగ్రంథము. రాజశేఖరుని కావ్యమీమాంసయు కొంతవఱ కిట్టిదే.

5. కావ్యకల్పలతా పరిమళము (అముద్రితము). కావ్యకల్పలతపై శుభవిజయ పండితుడు రచించిన 'మకరంద'మను వ్యాఖ్య (క్రీ. శ. 1609) యొకటి కలదు.

6. ,, మంజరి (ఉత్పన్నము.)

7. చతుర్వింశతి — జినేంద్ర — సంక్షిప్త — చరితము. (పద్మానంద మహాకావ్య పరిశిష్టముగా ముద్రితము. 24 గురు తీర్థంకరుల జీవితము; బరోడాలో ముద్రితము.)

8. ఛందోరత్నావళి (లుప్త ప్రాయము.)

9. జినేంద్ర చరితము=పద్మానంద మహా కావ్యము. (బరోడాలో ముద్రితము.)

జినేంద్రుడు, ఆదినాథుడు అనబడు ప్రథమ జినేంద్రుని జీవిత చరిత్ర 19 సర్గలు కల యీ మహా కావ్యముయొక్క గ్రంథాగ్రము 6281 శ్లోకములు. ఇందు వివిధవృత్తము లుపయోగింపబడెను. ఈ కావ్యము వీరాంకము.

10. బాలభారతము—ఇదియు పై దానివలెనే 'వీరాంకము'—ప్రతిసర్గము చివర 'వీర' శబ్దాంకితము. ఇందు 18 పర్వములు, సర్గలు 44 కలవు. దీని గ్రంథాగ్రము 6950 శ్లోకములు. వ్యాసదాస నామాంతరముగల క్షేమేంద్రునివలె అమరచంద్రునికిని వ్యాసమహర్షియెడ నఖండభక్తి గలదు. ప్రతిసర్గాదిని ఈ కవి వ్యాసుని స్తుతించెను. మొత్తము 43 సారు లీతడు వ్యాసుని ప్రశంసించెను.

క్షేమేంద్రుడు భారతమంజరిలో మహాభారతమును సంగ్రహించెను. బాలభారత నామముతో మఱి 2 గ్రంథములు గలవు;2అంకములు మాత్రమే లభించిన బాలభారత మను రాజశేఖరుని రూపక మొకటి. రెండవది అగస్త్యుడను విద్యానాధుడు రచించిన బాలభారతమను 20 సర్గల మహాకావ్యము.

11. సూక్తావళి: ప్రబంధకోశమున ఉదాహృతము. ఇది జల్హణుని సూక్తిముక్తావళివలె సంకలన గ్రంథము కావచ్చును.

12. స్యాది శబ్ద సముచ్చయము: (ఇదియు ప్రబంధకోశమున ఉద్ధృతము). హేమచంద్రుని వ్యాకరణమునందలి సంస్కృత భాగమునకు సహాయ గ్రంథము. ఇందు 4 ప్రకరణములు, వానిలో క్రమముగా 26; 23; 2; 3 కారికలు కలవు. వల్లెవేసి ధారణ యందుంచుకొనుటకు విద్యార్థుల కీకారికా గ్రంథమెంతయో అనుకూలించుటచే విద్యార్థిమండలి దీనిని బాగుగా పాఠప్రవచన రూపమున ఆదరించుచుండును. జయానందుని వ్యాఖ్యతో నీ గ్రంథమున కెన్నియో లిఖిత ప్రతులు ప్రాచీన జైన భాండారముల యందు లభించుచున్నవి.

**అమరచంద్రుని బిరుదు: (వేణీకృపాణుడు):**

మహాకవుల గ్రంథములలోని మనోహర వర్ణనములను కొన్నిటినిబట్టి విద్వల్లోకము వారివారికాయా బిరుదముల నొసగుట సంస్కృత సారస్వత సంప్రదాయముగా నున్నది. క్రింది విట్టి బిరుదములే.

1. దీపశిఖా—కాళిదాసు. 2. ఛత్ర ’రవి. 3. ఘంటా—మాఘుడు. 4. తురంగ—బాణుడు. 5. తాళరత్నాకరుడు. 6. అనంగ—హర్షుడు. అమరచంద్రునికిని ఇట్టి బిరుద మొకటి లభించినది. దీనికి నిదానము బాలభారతమునందలి యీ క్రింది పద్యము. (I. 1. 6. ప)

'దధిమథనవిలోలల్లోల దృగ్వేణిదంభా—
దయ మదయ మనంగో విశ్వవిశ్వైకజేతా,
భవపరిభవకోప—త్యక్తబాణః కృపాణ—
శ్రమ మివ దివసాదౌ వ్యక్తశక్తిర్ వ్యనక్తి.'

ఒకానొక చంచలాక్షి ఉదయముననే పెరుగు చిలుకుచుండగా నిటునటు చలించు నామె వేణి భవపరాభవమువల్ల మదనుడు త్యజించిన కత్తివలె నున్నదట. ఇట్టి భావ మీ గ్రంథముననే ఆదిపర్వమున (III. 63; XI. 6) రెండుసార్లు కన్పట్టుచున్నది. దీనినిబట్టి యీ కవికి 'వేణీకృపాణుడు' అను బిరుదు లభించె నందురు.

అమరచంద్రుని ముక్తకశ్లోకములు జైన ప్రబంధములందు, ఉపదేశతరంగిణి మొదలగువానిలోను ఉదాహరించుకొనబడినవి. ఒకసారి వస్తుపాలుని సంఘయాత్రలో అమరచంద్రుడు నిద్రాముద్రితుడై జోగుచుండగా వస్తుపాలుడు ఛలోక్తితో నాతని పరిహసించెనట. దానికి కవి లక్ష్మీనారాయణ శ్రీ యాత్రిక సార్థవాహమును చూచి తద్వైభవమును గూర్చియే చెప్పుకొనుచుండ, దానిని వినుటచే గల్గిన ఆనందము వల్ల తనకు నేత్రనిమీలనము కల్గినదని వక్కాణించెనట. దాని కలరి వస్తుపాలుడు అమరచంద్ర భూషితమగు సింహపీఠికను దర్బారునందలి కవులందఱి స్థానములకంటె నగ్రస్థానమున వేయించి గౌరవించెనట.

ఉపదేశతరంగిణినిబట్టి యీ క్రింది విషయము తెలియుచున్నది — ఒకసారి మహామాత్యుడు అమరచంద్రుని మతోపన్యాసగోష్ఠి కరుగుచుండ ద్వారమువద్ద నుండగా కవి యీ క్రింది పద్యమును పఠించుట

వినెనట—'అస్మిన్నసారే సంసారే సారం సారంగలోచనా.' విని వస్తుపాలుడు 'ఈ కవి స్త్రీలోలుడు; కనుకనే సన్యాసియైనను ఈయన యిట్టి భావమును కల్గియుండె'నని ఆయునకు నమస్కరింపనేలేదు. అప్పుడు దీనిని కనిపెట్టి కవి ఉత్తరార్ధము నిట్లు పఠించెను: 'యత్కుక్షిప్రభవా ఏతే వస్తుపాల భవాదృశాః'. దీనిని విని ఆశ్చర్యచకితుడై వస్తుపాలుడు కవికి నమస్కరించెనట. అట్టి సమయస్ఫూర్తి కలవాడమర చంద్రకవి.

ఈ వ్యాసమున ప్రథమ ప్రకరణమున క్రీ. శ. 4 వ శతాబ్దము మొదలు 13 వ శతాబ్దివఱకు (5 శతాబ్దములలో) విలసిల్లిన 18 గురు కవులను (అనగా 9 జంటలను) గూర్చి తెలుపబడెను.

| | | |
|---|---|---|
| 4 వ శతాబ్దమున | ఇద్దరు | |
| 7 | ,, | ,, |
| 8 | ,, | ,, |
| 11 | ,, | ఆర్గురు (3 × 2) |
| 12 | ,, | ఇరువురు |
| 13 | ,, | నలుగురు (=2 × 2) |

### ఉపసంహారము

### సింహావలోకనము

1. పాఠక సౌకర్యమునకై ఈ వ్యాసమునందలి ప్రధానాంశములు సూక్ష్మముగా నిట చూచింపబడును. జంటకవుల సంప్రదాయము మొట్టమొదట ఆంధ్ర వాఙ్మయములోనే తలయెత్తెననుట సరికాదు. సంస్కృత సారస్వతముననే ఈయాచారము ప్రప్రథమున బయలు దేరెను. అంతేకాక, ఆంగ్లవాఙ్మయమునకూడ ఈ పద్ధతి కలదు.

2. ఆంధ్రసారస్వతమున మొదటి జంటకవులు శ్రీ వేంకటరావుగారు కాచవిభుడు—విఠలరాజు అనుట సరికాదు. నన్నయభట్టు—నారాయణభట్టులే ఆంధ్ర వాఙ్మయమున తొలి జంటకవులనుట సమంజసము.

3. పాశ్చాత్య వాఙ్మయములలో ఆంగ్లమున జంటకవులు (రచయితలు) కలరని నాలుగు జంటల రచయితలు పేర్కొనబడిరి.

4. సంస్కృత సారస్వతమున 9 జంటల రచయితలు (కవులు) 9 × 2=18 మంది ప్రాచీనుల వృత్తాంతములు ఇట తెలుపబడెను. ఆంధ్ర వాఙ్మయమున మొదటి జంటకవులు నన్నయ—నారాయణభట్టులు క్రీ. శ, 11 వ శతాబ్దికి చెందిన వారు. సంస్కృతమున మొట్టమొదటి జంటకవులు రామిల—సోమిల కవులంతకు 9, 10 శతాబ్దములకు పూర్వులు. ఈ సంస్కృతకవుల జంటలలో కొందఱు సోదరులు, కొందఱు తండ్రికొడుకులు, కొందఱు సహపాఠులు, మఱికొందఱు గురుశిష్యులు, ఇక కొందఱు దంపతులు.



# తప్పించుకుపోయావు

## శ్రీ సి. నాగేశ్వరరావు

భగవాన్ !

మనస్సులో దాచుకున్నాను
నిన్ను ఎంతో జాగ్రత్తగా
నైవేద్య మిచ్చేటపుడు వేసే
అజ్ఞానపు తెర నిన్ను చూడనీకుండా
అడ్డగిస్తోంది.

హారతి ఇవ్వాలని
తెర తొలగించగానే
నీవు మాయమయ్యావు;
నా హృదయాలయంలోనుండి.

కనురెప్పల నడుమ నిండిన
కడవలోనుండి బహుశా తొణుకుతూ
ంచుకున్నావేమొ ?
అడ్డుతెర తొలగిందని
ఆనందంగా కవాటాలు తెరుచుకుని
రేబవళ్లు పనిచేసే శ్రామికుల గుండెల్లో
పవళించాలని కాబోలు పరుగెత్తావుకదూ ?

ఓహో !

ఎప్పుడూ వీడు పొగిడే భట్రాజు
పొగడ్తలు వింటూ ఎవరు కూర్చోవాలి
అనుకుని విసిగి—వేసారి—చెవులు మూసుకుని
ప్రపంచ పరిస్థితులను పరికించడానికి
పుష్పక విమానంలాటి ఖగరాజుపై ప్రయాణించావనుకుంటాను

తప్పించుకుపోయినా—ఏడేడు పర్వతాల్లో—
తమిలో—పర్యాప్తముకాని అనంతంలో
దిక్కుల్లో—చుక్కల్లో, చంద్రునిలో—పూలగుండెల్లో,
నీకొరకు కళ్లల్లో భక్తిజ్యోతి వెలిగించుకుని
వెదికాను. ఎక్కడా లేవు.
మరెక్కడికి తప్పించుకుపోయావు?

# ప్రథమ ప్రాసంగిక వ్యాకరణము

## డా. బొడ్డుపల్లి పురుషోత్తం

సంస్కృతమునందు వ్యాకరణము, అలంకారము, ఛందస్సు అనునవి మూడును పృథగ్ఖ్యాతము లగు శాస్త్రములుగా విలసిల్లినవి. కాని తమిళ కర్ణాటాంధ్రభాషలలో ఛందోఽలంకార వ్యాకరణాదులతో గూడిన లాక్షణిక గ్రంథములు వెలువడుట ఈ భాషల లోని యొక విలక్షణతగా నెంచదగును.

తమిళమునం దత్యంత ప్రాచీనమయిన 'తొల్‌కాప్పియము'నందు (i) ఎళుత్తు (అక్షర సమామ్నాయము) (ii) సొల్ (శబ్దము) (iii) పొరుళ్ (కావ్యవస్తువు) అను మూడధికారములు గలవు. ఇందలి తొలి రెండధికారములు వ్యాకరణమునకుఁ జెందినవియే. 'నొల్లదిగారమం'దు మాటల పుట్టుకయు; వాని యర్థములును వివరింపబడినవి. ఇది కేవలము వ్యాకరణమునకుఁ జెందిన విషయమే యనఁజాలము. అర్థశాస్త్రమునకు(Semanties)జెందినది. ఇది యిట్లుండ, 'పొరుళ్ అదిగారవ్ఁ' బొత్తిగా వ్యాకరణముతో సంబంధము లేనిది. 'కామము, తత్సంబంధమగు విషయములు; యుద్ధవిధానము, రహస్యప్రేమ, సాంసారికప్రణయము, సాత్త్వికభావములు, ఛందస్సు, లోకోక్తులు — మొదలగు తొమ్మిది భాగము లీ పరిచ్ఛేదమునఁ గలవు. వీనిలో తమిళుల సామాజిక జీవన విధానము మనోజ్ఞముగా వివరింపఁబడినది. వారి యభిరుచులు, ఛందస్సంప్రదాయములు, ఆచారవ్యవహారములు, జాతి వార్తాచమత్కృతులు, మొదలగువానిని తెలిసికొనుటకు ఈ పరిచ్ఛేదము తోడ్పడుచున్నది.' (దక్షిణ భారత సాహిత్యములు — పుట 5).

కన్నడమునం దత్యంత ప్రాచీనమగు 'కవిరాజమార్గ'యను లక్షణగ్రంథమందు 'దోషాదోను వర్ణన నిర్ణయ'; 'శబ్దాలంకార' 'అర్థాలంకార' అను మూఁడు పరిచ్ఛేదము లున్నవి. ఇందు లాక్షణిక విషయములతోపాటు చారిత్రక, వ్యావహారిక విషయములు కూడ తెలుపబడినవి.' (అందే—పుట 58)

ఇట్టి ద్రావిడభాషా సంప్రదాయము ననుసరించి కానోపు, తెనుఁగున విన్నకోట పెద్దన తన ప్రభువు కోర్కెను బురస్కరించుకొని, (i) భావరస ప్రపంచమునఁ బర్వు నలంకృతి లక్షణంబు (ii) ఛందోవిచిత్రప్రచారము (iii) కుతూహలదస్ఫురదంధ్రదేశభాషా వివిధ ప్రసంగముల ఛందమును 'కావ్యాలంకార చూడామణి'యను పేర అందముగా నొనర్చి తన చతురత్వమును బ్రకటించెను. (కా. చూ. I—11 ప.)

ఆంధ్రశబ్దచింతామణియందును ఛందోలంకార విషయములు సూచితములు. 'ఇన్ద్వాద్యాపిచ గణా, వళిరాద్యమనన్త్యాక్షరం ప్రాసః' అనునది ఛందోవిషయము. ఈ విషయమునందు, తనకు లభించిన ప్రతిలోనివిగా మఱికొన్ని కారికల నుద్ఘాటించి అప్పకవి ఆంధ్రశబ్ద చింతామణి ననువదించుచు, ఛందః ప్రధానవిషయవివరణమును మాత్రము పూర్తిగావింప గల్గెను. 'విశ్వశ్రేయఃకావ్యం, తదదోషే పరికృతేచ వాగర్థే । సా వాక్యా రసవృత్తి స్సాధ్యోహి రసో యథాతథం కవిభిః' అను చింతామణి కారిక లాధారముగా అహోబలపతి, కావ్యప్రకాశ, కావ్యాదర్శాద్యలంకార గ్రంథముల నుండి అనేకవిషయములను తొలి పరిచ్ఛేద వ్యాఖ్యలో నుద్ధరించుచు ప్రపంచించెను. ఇట్టి సంప్రదాయ విధేయతతోడనే కానోపు, చిన్నయసూరికూడ తన బాలవ్యాకరణాంతమునందు 'పాదంబునం బ్రథమ ద్వితీయాక్షరములు వళిప్రాసంబులు నాఁబడు.' (బా. వ్యా. ప్రక. 23 సూ) 'యువలలు లఘ్వలఘువులు మైత్రింబొరయు, రేఫంబులు పొరయవు' (అందే. 24 సూ.) అని సూత్రించెను.

తెనుఁగునందలి యతి, సజాతీయవర్ణావృత్తి. తన్నిర్ణయమునందు వ్యాకరణ ప్రభావము కలదు. తెనుఁగు వ్యాకరణము తెనుఁగు కావ్యభాషకు. అందుచే

అనేక వ్యాకరణ సూత్రములకు ఛందోనిర్బంధాలు (Prosodical exigencies, etc.,) కారణములుగా నున్నవి. కావ్యభాష సుపరిష్కృతము, దోషరహితమునై యుండవలయును విసంధిక్రమము, భిన్నవచనము, భిన్న లింగము, (కా. చూ. VI—98, 100, 101) మున్నగు వ్యాకరణదోషములు కావ్యదోషములుగా పరిగణింపఁబడును. ఈరీతిగా ఛందోఽలంకార వ్యాకరణములు పరస్పరాధారములు కలిగియున్నవి. కవి కాదలచినను, కావ్యార్థములను గ్రహింపఁగల సహృదయుఁడు కానెంచినను, ఈ మూఁడింటిని గూర్చిన ప్రాథమిక పరిజ్ఞాన మవసరము. ఇట్టి కొఱంతను తెనుఁగునఁ దీర్చుటకు తొలుత నుద్యమించినవాఁడు విన్నకోట పెద్దన. ఈతని కాలము క్రీ. శ. 1407. కేతన తరువాత కనీసము ఒకటిన్నర శతాబ్దముల పిమ్మటివాఁడు. ఇందలి తొలి యాఱు ఉల్లాసములు అలంకార శాస్త్రసంబంధములు, సప్తమాష్టమోల్లాసములు ఛందస్సునకుఁ జెందినవి. నవమోల్లాసము వ్యాకరణ సంబంధి. ఇందు వ్యాకరణము ప్రధానముగాఁ గాక అనుషంగికము. అందుచే నీ నవమోల్లాసము ప్రథమ ప్రాసంగిక వ్యాకరణముగా పరిగణింపఁబడెను.

ఆంధ్రభాషాభూషణము స్వతంత్రమగు ప్రథమ పద్యాంధ్ర వ్యాకరణము. అయినను అందు 192 పద్యగద్యములేయుండగా నిందు 171 పద్యగద్యము లున్నవి. అందు స్పష్టముగా ప్రకరణవిభాగము లేదు. కాని యిందు తత్సమ తద్భవాదుల లక్షణము; అజంత ప్రకరణము, హలంత ప్రకరణము, సంధిపరిచ్ఛేదము, విభక్తిప్రకరణము, సమాసప్రకరణము, తద్ధితప్రకరణము, క్రియాప్రకరణమను విభాగము లేర్పఱుపఁబడినవి.

## సంస్కృత ప్రాకృతాది ప్రశంస

నన్నయభట్టారకుని కాలమందు మాత్రమేకాక, తిక్కనాది మహాకవు లవతరించినపిమ్మట తెనుఁగు కావ్యరచన మఖండముగా సాగిపోవుచున్నను, తెలుగు కావ్యనిరసనము పెద్దనకాలమునఁ గూడ పెద్దగా నున్నట్లు, పెద్దన ఈ క్రింది పద్యమునుబట్టి తెలియుచున్నది.

'విలసద్భావ రసాద్యలంకృతులచే
విప్పారి, గీర్వాణ భా
షల కబ్బంబుల కెన్ని మంచితనముల్
సంధిల్లు నాచందమై
వళియుం బ్రాసము నంత కగ్గలముగా
వర్తిల్లు సత్కావ్యముం
దెలుగంచుం జెవిఁ బెట్టలేమి
యుడుపం దేఁ గల్గునేమందిలన్.'

(9—4 ప)

ఈతఁడు త్రిలింగ శబ్దభవమే తెలుఁగని పేర్కొనెను (6). అప్పకవి యీతని యభిప్రాయమునే యామ్రేడించెను. అందుచే ఆంధ్రభాషా వికాస కర్తలు అప్పకవీయమునందలి పద్యము లుద్ధరించి, 'అప్పకవి కాలమునకు అనఁగా క్రీ. శ. 1650 సం॥ నకుఁ దెలుఁగు శబ్దము త్రిలింగ శబ్దభవమనియు, నా త్రిలింగములు ద్రాక్షారామాదులనియు నిశ్చితమ' నుట చారిత్రకముగా సరికాదు. (పుటలు 17, 18.)

పెద్దన 'ధర శ్రీ పర్వత, కాళేశ్వర దాక్షారామ సంజ్ఞవఱలు' అని వచింపగా, అప్పకవి 'శ్రీక్షితి ధర కాళేశ ద్రాక్షారామంబు' అనెను. శ్రీక్షితి ధర మనుటకన్న 'శ్రీపర్వత' మనుటయే సంజ్ఞను చక్కగా నిరూపించుటగును. 'దాక్షారామము'ను 'ద్రాక్షారామము'ని అప్పకవి వచించెను. రేఫ తొలగించిన గణభంగమగును. 'కాళేశ్వర ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు' అను విద్యానాథుని శ్లోకపాద మాధారము కావచ్చును. ఇట్టి పాఠమును పెద్దన అనుకరింపక పోవుట సమంజసము. అహోబలపతి యీ విషయమై యిట్లు ప్రస్తావించెను. 'ద్రాక్షారామాణాం భూయిష్ఠత్వాత్ ద్రాక్షారామ సంజ్ఞేతి ప్రౌఢోక్తిః। వస్తుతస్తు దక్షస్య సంబంధాత్ దాక్షారామ ఇతి తన్నామ। తదుక్తం స్కాన్దే భీమేశ్వరఖండే దక్షస్య ఆరామ భూమిత్యాద్దాక్షారామ ఇతీర్యతే' ఇతి ఏత త్సర్వం రత్నాపణే కుమారస్వామియజ్వనా ప్రతిపాదితమ్. (అహో. పుటలు 169—170 హైదరాబాద్ ఆంధ్ర రచయితల సంఘ ప్రచురణ). దకుని

ఆరామము దాక్షారామము. ఇట ద్రాక్షతోటలున్నట్లు శ్రీనాథుడును వర్ణింపలేదు. ఇప్పుడును లేవు. అయి నను ఆరామమనుటనుబట్టి ద్రాక్షతో ముడివెట్టిన బాగుండునని యీ పద కల్పన మేర్పడియుండును. సింహాచలమున కుత్తరముగా నార్తు సింహాచలమను స్టేషనేర్పడగా, నారదుడు తొలుత అచట దిగి, పాద చారిగా సింహాచలమున కేతెంచెననియెంచి కానోపు దానిని ప్రజలు నారద సింహాచలమనిరి. మదరాసులో 'హామింగ్‌టన్' అను దొరపేర నొకవంతెన గలదు. దాని క్రింద ప్రజలు క్షురకర్మ గావించుకొందురు. అందుచే అది 'అంబట్టన్' ప్రబిడ్జి యైనది. Inland కవరును వేదపండితుడగు మా మామగారు ఇంగ్లాండు కవరని వ్యవహరింతురు. కారణ మాయన తలంపున ఇవియన్నియు అచటనే ముద్రయై వచ్చునని. ఇట్టి వ్యుత్పత్తులనే 'Folk Etymologies'—లోకనిరుక్తి అందురు. ఇట్టివి పరిశీలించుటకు చాలా కుతూహల ముగా నుండును.

అప్పకవి 'ఆంధ్ర' శబ్దము నుపయోగింపగా (I—100, 101, 105, మున్నగునవి) పెద్దన అన్నిచోట్లను అంధ్ర శబ్దమునే ప్రయోగించెను. (I—4, 11; IX—5, 8; 'ఆంధ్రభాషా విశేష'— IX—గద్యము). ఇందువలన గణభంగ ముండకపోయి నను, 'ఆంధ్రము'కన్న 'అంధ్రము' ప్రాచీనమని చరిత్రకారు లంగీకరించిన విషయము. (చూ.-తెలుగు సంస్కృతి 1—పుట—1.)

దేశభాషయగు తెలుగుపట్ల పండితులకు గల నిరసనభావమును బాగుగా గుర్తించిన పెద్దన తిరిగి యీ రీతిగా హెచ్చరించెను.

గీ. తెలుఁగు దేశభాష తెలియుఁబొమ్మనఁబోక
తెలియవలయు మించు తేటపడఁగఁ
దొడవుగాక పసిఁడిఁ దొడగిన నొప్పునే
కనక మింటనెంత కలిగెనేని?

దేశభాష దైనందిన ప్రయోజనము నెఱిగినంత మాత్ర అందులోని 'మించు' తేటపడదనియు; 'మించు' లేక ప్రకాశమనదగు అందలి సాహిత్యము కేవల సంస్కారితభాషా పాండిత్యముచేతనే తేటపడదని పెద్దన భావించెను. దైనందినభాష పసిఁడియైనచో కావ్య భాష తొడవువంటిది. దాని స్వరూపము వ్యాకరణ మూలమునఁగాని తెలియదు. అందుచేతనే 'సూరిసుఖ ప్రవణంబయినట్టి యంధ్ర బంధుర రుచిమ త్కవితా స్పదమగు పలుకుల వివరింతుం దెలియఁ బెక్కువిధ ములు జగతిన్' (IX—2) అని పెద్దన వచించెను.

పెద్దన 'అంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయము' యనెను. 'విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాదు లొనరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ' అనియు; అంధ్రముకూడ ప్రాకృతముకాన, వారు చూపిన మార్గమునందు తానును 'తల్లక్షణమును దెలియఁ' జెప్పవలయునని అతని ఆశయము. సంస్కృతమువలెకాక, ప్రకృతుల వ్యవహార భాషలు ప్రాకృతములు. వ్యవహారభాష ఆంధ్ర ప్రాకృతము. ఇట్లు వ్యుత్పత్తి ననుసరించి దేశభాషలన్నియు ప్రాకృతములే యనవగును. కాని 'రూఢి ర్యోగాత్ బలీయసి' అని పరిభాష. ప్రాకృత భాషలనగా 1. మహారాష్ట్రి 2. శౌరసేని 3. మాగధి 4. పైశాచి 5. చూళికా పైశాచి 6. అపభ్రంశ మని యీఆఱు విధములు. వీనికే ప్రాకృతమని రూఢి. తక్కిన వానిని ప్రాకృతములని వ్యవహరించుట పంక మునఁ బుట్టిన వాని నన్నింటిని పంకజములని వ్యవహరించుటను బోలును.

'తనరు వాల్మీకి మూల సూత్రముల వలన
ప్రాకృతాది షడ్భాష లుద్భవముఁ జెందె'నని యంగీకరించుచునే అప్పకవి, వానిని వివరించుచు, 'ఆంధ్రభాభిమభవం బాంధ్రమయ్యె' (I-81 ప) అని ప్రాకృతములతోపాటు ఆంధ్రమును బరిగణించెను. 'ప్రాకృతాది' యనుటలో 'ప్రాకృతమ'నఁగా 'మహా రాష్ట్రీ' అని యర్థము కావలయును. ఏలన 'When one refers to the Prakrit language in general terms, it is the Maharastri that derives its name from Maharastra, the land of the Maharastras' అని పిషల్ పండితుని వాక్యము. (Comp. Grammar of Prakrit Languages by Pischel. Introduction p. 9). 'మహారాష్ట్రోద్భవా భాషా ప్రాకృతీ పరికీర్త్యతే' ఇత్యాది భాషా ప్రదీపవాక్యము లాతనికి ప్రామాణికములై యుండును.

కావున నిట్లుగా ఆంధ్రము నొక ప్రాకృత భేదముగా పరిగణించు పద్ధతి పెద్దన తోడనే యేర్పడి నట్లు గుర్తింపనగును. ఆంధ్రమును ప్రాకృతముగా నెంచుటకు కారణము నీ రీతిగా అప్పకవి వచించెను.

'ప్రాకృతాదులు చెడి తజ్జ పదములగుచుఁ
బలు తెఱంగులఁ దనలోన గలసియుండు
కతన నీయాంధ్ర భాషయుఁ గవిమతంబు
నందుఁ బ్రాకృత భేదంబె యనఁగ నొప్పు'
(అప్ప. I. 77.)

కాని పలువురు లాక్షణికులు వివిధ ప్రాకృతముల నుండి తద్భవము లెట్లేర్పడెనో నిరూపించుటకు శ్రద్ధ వహింపని కారణముగా ఆయా ప్రాకృతములందలి వారి పరిజ్ఞాన మనుమానాస్పదమనక తప్పదు.

కేతన తద్భవముల నిరూపణమునందు ప్రాకృతముల విషయమే స్మరింపలేదు. కాని పెద్దన 'ప్రాకృత నిభమగునది తద్భవమగున'ని వచించెను. (14 ప). 'ప్రాకృత లక్షణయుతమై, శ్రీకరముగతద్భవంబు క్షితి రూఢంబౌ' అని కవిలోక చింతామణి కర్తయు; 'వికృతి తద్భవమనఁగఁ గావింపవలయు, నదియు ప్రాకృతరీతియై యతిశయిల్లు' అని కవిసంశయ విచ్ఛేదకర్త (III—1 ప) మున్నగువారు ప్రాకృత భాషలలో తద్భవము లేర్పడిన రీతిగా తెనుఁగున తద్భవము లేర్పడినట్లు భావించినట్లు విదితము. ఆ కారణముగా ఆంధ్రమును ప్రాకృత సమముగా భావించుట 'ఆశ్చర్యము. అయినచో సంస్కృత సములు గూడ విశేషముగా నుండుటచుబట్టి దేశభాషలను సంస్కృతము అననగునా?

హేమచంద్రాది ప్రాకృత వ్యాకర్తలు ప్రాకృత భాషాపదజాతమును (i) తత్సమములు (ii) తద్భవములు (iii) దేశ్యములు—(Prakrit Grammar of Hemachandra—Edited by Dr P. L. Vaidya—under Rule. 1. Para 1.) అను రీతిని వింగడించిరి. ఆంధ్రవ్యాకర్తలుకూడ ఆ విధానము ననుసరించుటనుబట్టి, ఆంధ్రభాషనుగూడ ప్రాకృతమందమన్న తద్భాషలో అంతకన్న అచ్చతెనుఁగు, గ్రామ్యము మున్నగు విభాగములుకూడ నున్నవి.

అయినచో ఆంధ్రము ప్రాకృత మెట్లగును? ఈ విషయము నిట్లు పరామర్శింపనగును సంప్రదాయజ్ఞుఁడగు ఆంధ్రశబ్ద చింతామణికర్త తెనుఁగు భాషను 'వికృతి'గా పరిగణించుచు నిట్లుద్ఘాటించెను:

ఆద్యఃప్రకృతిః ప్రకృతిశ్చాద్యే
ఏషాతయోర్భవే ద్వికృతిః
కేవలతయానుసర్పత్యుభేచ
యేయం యథాతథం భాషా
(సంజ్ఞా. 4 కా)

'సంస్కృత ప్రాకృతభాషలు ఆద్యప్రకృతియుఁను ప్రకృతియును నగును. ఈ యాంధ్రభాష యా రెంటికి వికృతి. ఇది యథేచ్ఛగాను, ప్రత్యేకముగను అనుసరించును.' ఈ రీతిగా ఆంధ్రము రెండాపుల దూడగా నెంచఁబడెను. ఇట్లేల పరిగణింపఁబడవలయును? దానివలని ప్రయోజన మెంతవఱకు?

పూర్వ మీమాంసలో ప్రకృతి యజ్ఞములు, వికృతి యజ్ఞములని కలవు. ప్రకృతి యజ్ఞములకుఁ జెప్పిన నియమములే వికృతులకును జెల్లును. 'ప్రకృతివత్ వికృతిః' అను న్యాయమిందుల కేర్పడినదే. తెనుఁగునగల 'సిద్ధసమాసములకు 'సంస్కృత ప్రాకృత సమముల'కుగల మూలరూపాదులనుగాని, రూపనిష్పాదనములుగాని తెలుగున వివరింప నవసరములేదు. ప్రాకృత వ్యాకర్తలుకూడ తమ భాషలలోఁగల తత్సమ శబ్దముల గూర్చి యిట్లే భావించి, 'అనుక్త మన్యశబ్దానుశాసనవత్' అనియు; 'అనుక్త మన్యతో గ్రాహ్యమ్' అనియు; 'సంస్కృత సమంతు సంస్కృత లక్షణే నైవగతార్థ'మనియు వివిధ రీతుల శాసించిరి. ఇట్టి నియమములనే సంప్రదాయజ్ఞులైన తెనుఁగు వ్యాకర్తలును నుద్ఘాటించిరి. 'అన్యేఽన్య వ్యాకరణ స్పష్టాః' అని ఆంధ్రశబ్ద చింతామణి. 'తదనుక్తస్య కార్యస్య వక్తా భవతి పాణినిః' అని వికృతి వివేకము. ఈ రీతిగా సంప్రదాయజ్ఞులైన వ్యాకర్తలు ప్రకృతిద్వయవాదులుకాగా, స్వతంత్రులైన పెద్దనాదులు ఏకప్రకృతివాదులై, వ్యాకరణ రచనా విధానమునందు సౌకర్యార్థము ఆంధ్రమునుగూడనొక ప్రాకృత భేదముగా నెంచియుందురు. సంప్రదాయజ్ఞులు 'వికృతి' యని వ్యవహరించిన యర్థమువంటి యర్థమునందే,

పెద్దనాదులు 'ప్రాకృతమ'ని వ్యవహరించిరారని తలంపనగును. సంక్షిప్త వ్యాకరణ రచనమే దీని లక్ష్యము.

తెలుగు భాషనిట్లు 'వికృతి'గా పరిగణించుట లోని ఉద్దేశ్యమును గుర్తింపజాలక, శ్రీ నిడదవోలు వేంకటరావుగారు భ్రాంతిపడుచు 'Vikrit in the Sanskrit Grammars for Telugu is neither used by any poet, nor mentioned in any Telugu Grammar or work before 1656' అని విద్వద్గోష్ఠిలో తమ వ్యాసమునందుద్ఘాటించిరి. (p. 10—A broad survey and classification of Grammatical literature in Telugu Paper presented to the seminar on Grammatical theories in Telugu on 18th October 1965; Conducted by the joint aupices of departments of Telugu & Linguistics and Department of Dravidian Linguistics, Annamalai University).

ఈ విషయమునే శ్రీ నిడదవోలు వేంకటరావుగారు 'నన్నయ వాగనుశాసనుఁడా?' అను వ్యాసమున (భారతి—ఆగస్టు 1963) నిట్లు వ్రాసిరి.' వికృతి పదము—ఇది తెలుఁగు శబ్దమునకు బదులుగా చింతామణియందుపయుక్తము. 'వికృతి' పదము తెలుగుభాషాపర్యాయపదముగానే తెలుగు వ్యాకరణ లక్షణ గ్రంథకర్తలు వాడలేదు. ఇక చిన్నయసూరి బాలవ్యాకరణ రచనకు ముందు పుట్టిన ఈ క్రింది తెలుగు వ్యాకరణములలో 'వికృతి' పదమే లేదు. చిన్నయసూరియు, 'వికృతిపదము, తెలుగుకావ్యములలో, కవి వ్యవహారములలో కానరాకపోవుటచేతనే దానిని ప్రత్యేకముగా వివరింపవలసివచ్చినద'ని వింతగా వ్రాసిరి. ఆమ్రేడితము, సంశ్లేషము మున్నగునవి కావ్యములలోను, ఇతరత్ర ఉన్నవేకదా! మఱి వాని నేల నిర్వచింపవలసివచ్చినది?

దీనినిబట్టి తెలుఁగు, తెనుఁగు, ఆంధ్రము అను వానికి పర్యాయపదముగా 'వికృతి' పదమును భావించుట భ్రాంతిమూలకము 'వికృతి' యనునది ఒక వర్ణనాత్మక సంజ్ఞ, (A descriptive technical term) తెనుగు వ్యాకరణ రచనమునందు లాఘవమును సంపాదించుట దీని ప్రయోజనము. ఇట్లే 'ప్రాకృతము'ను పెద్దనాదులు పరిగణించిరనుట పరిశీలింపఁదగిన ప్రతిపాదనము. ఇట్లుపోద్ఘాతపూర్వకముగా తన రచన నొక స్వతంత్రవ్యాకృతిగనే యారంభించె ననవగును.



# శ్రీ మధురాంతకం రాజారాం సాహితీ వ్యాసంగం

శ్రీ కొలకలూరి ఇనాక్

శ్రీ మధురాంతకం రాజారాం కథానికా ప్రక్రియా రచనలలో కృషి చేసిన రచయిత. రెండవతరం వారిలో ప్రముఖులైన కొద్దిమంది అగ్రగణ్యులలో చెప్పదగిన రచయిత. శ్రీ రాజారాం రచించిన 'తాను వెలిగించిన దీపాలు' కథల సంపుటికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ బహుమతిని ఇచ్చింది. అర్హతను గుర్తించిన ఎకాడమీ వారూ, ఆ బహుమతి నందు కొనే అర్హత నార్జించుకొన్న రచయితా ప్రశంసా పాత్రులు !

కథానికా ప్రక్రియ ఆంగ్లంలోనుంచి ఆంధ్రం లోకి వచ్చిందనీ, ఆంధ్ర కథానికా రచయితల సంఖ్యకు లోపంలేదనీ, తెనుగు కథా సాహితీస్థాయి స్వల్పంకాదనీ, ఇప్పుడు ప్రత్యేకంగా చెప్పవలసిన అవ సరం లేదు.

ఆంగ్లంలో అనేక కథ లున్నాయి. అనేక దేశ భాషల కథలు ఆంగ్లంలో పరివర్తింపబడ్డాయి. అవి తెలుగువాళ్లు చదివారు. ప్రభావితులయ్యారు. తెలు గులో కథలు వ్రాశారు. అంతేకాక, ఆంగ్లభాష అక్షరంముక్కరాని ఆంధ్రులలో కొందరు, రచించిన కథలలో ఆంగ్ల కథానికా ప్రభావం గోచరించటంలో అంతరార్థం ఆంధ్ర సంస్కృతి, నాగరికత, జాతి జీవితంమీద, ఇతర జాతి జీవితం ప్రతిఫలించటమే ! శ్రీ రాజారాం కథలపై అటువంటి ప్రభావంలేదు.

బెంగాలీ హిందీ భాషలలో వెలువడిన కథలు వంటివి తెలుగులో రాకపోలేదు. అందుకు శాంతి నికేతన్‌లో చదువుకొన్న ఆంధ్రులు, ఉత్తరహిందూ దేశంలో విద్యాభ్యాసం ముగించుకొనివచ్చిన ఆంధ్రులు ముఖ్యంగా పేర్కొనదగినవాళ్లు. తెలుగుదేశపు పొల్లలు దాటి మరో ప్రాంతం చూడని ఆంధ్రులు విరచించిన కథలలో ఇతర రాష్ట్రాల జీవిత విధానం ప్రతి బింబించటంలో కారణం, ఆయాభాషలలోని కథలు నవలలు ఆంధ్రంలోనికి అనువదింపబడటమే ! శ్రీ రాజారాం కథలపై భారతదేశంలోని ఇతర భాషల కథానికా ప్రభావం మృగ్యం !

తెలుగుదేశంలో ఏ నాగరికతల ప్రభావాలకు లోనుకాకుండా పరిపూర్ణమైన ఆంధ్రత్వాన్ని స్వచ్ఛంగా నిలుపుకొన్న తావులు పల్లెలు. ఆధునిక పరిణామాలకు దూరంగా, పట్టణాలకు ఎడంగా ప్రాచీనసంప్రదాయబద్ధంగా, కలుషితంకాని జీవి తంతో మెలుగుతున్న పల్లెపట్టులు ఈ రచయిత కథలకు ఆటపట్టులు.

పట్టణ పరిసరాలలో జరిగే వింతలు వినోదాలు గానీ, నగరాలు నాజూకుగా నడిచే ఒంపుసొంపుల సొగసు సోయగాలుగానీ, రోజుకొక క్రొత్తరూపంతో విలసిల్లే పరిణామశీలమైన నగర వాతావరణంలో ప్రతిఫలించే సమాజంవైపు ఈ కథలు రాలేదు. ఒక వేళ అత్యవసరమై పట్టణాలవైపు ఈ కథలు ప్రాకి వచ్చినా, పని ముగించుకోగానే పల్లెలకువెళ్లిపోయాయి.

శ్రీ రాజారాం కథల్లో పల్లెలు సజీవంగా గోచ రిస్తాయి. పాత్రలు కళ్లఎదుట ప్రత్యక్షమవుతాయి. సమాజం గ్రామగతమై సాక్షాత్కరిస్తుంది. ఇటు వంటి జీవితం చిత్రించే విషయంలో రచయిత కలం సిరాతో నిండుగా తొణికిసలాడుతుంది.

పల్లె జీవితంలో సామాన్యంగా గోచరమయ్యే కష్టసుఖాలు, ఆచారవ్యవహారాలు, సంప్రదాయాలు, నమ్మకాలు, అపనమ్మకాలు, ఆశలు, ఆకాంక్షలు పొలా లలో పంటలు, అందుకు ఎదురయ్యే బాధలు, బాధ్య

తలు, కష్టనష్టాలు ఈ రచయిత కథలలో కని పిస్తాయి.

పల్లె వాతావరణం, ప్రజల జీవిత విధానం, వారి అనుభూతులు, పల్లెపట్టుల ప్రకృతిరామ ణీయకం, పర్వతం ప్రక్కగా ప్రవహించే సెలయేరులు, దుమ్ము నిండివున్న వీధులు, పూజలు జరిగే దేవా లయాలు, సంతోష దుఃఖాల సమ్మిశ్రితరూపంగా నిలిచిన గుడిసెలు, మిద్దెలు, విద్యార్థుల కలకలంతో విలసిల్లే పాఠశాలలు, కనులపండువగా ఈ కథలలో కనిపిస్తాయి.

జీవితం గూర్చి రచయిత కలిగివున్న అభిప్రాయం గానీ, వ్యక్తీకరించిన అభిమతంగాని ప్రపంచించేందుకు ఇది అదనుకాదు. ఎందుచేతనంటే రచయిత భావం ఎప్పటికి ఏ తీరుగా మారుతుందో, ఇప్పుడే నిర్ణ యించటం కష్టం. అయితే జీవితం గూర్చి ఏ విధ మైన దృక్పథంలేని రచనలు ఈ రచయిత చేయటం లేదు.

లభ్యమయిన కథలు పరిశీలించింతర్వాత, రసజ్ఞులైన పాఠకులు, ఆయా కథలలో రచయిత వ్యక్తంచేసిన జీవితం దృక్పథం వింగడించుకొంటే, ఇది ఏర్పడే అభిప్రాయం. నైతికమైన విలువలకు ప్రాధాన్యం ఇచ్చి, ఇతర నాగరికత ప్రభావంలో పడి పోకుండా, మనిషి స్వాత్మస్థాయి పెంచుకొంటే సంఘ జీవితం సుఖప్రదమవుతుంది.

రచయితకు జీవితంపై సమగ్రాభిప్రాయం చూపాలని తొందరలేదు. జీవితమును సమగ్రంగా చూపించాలని పట్టుదల ఉంది. ఆ ప్రదర్శిత జీవిత పరిధిలో పరిశోధించిన పాఠకులు ఊహించుకోగల అభిప్రాయమది.

మనుష్యులలో మంచి చెడ్డలు, తారతమ్యాలు, తప్పనిసరి! పల్లెలలోనూ మనుష్యులే ఉన్నారు. అయితే వాళ్ళు పుట్టుకతో మంచివాళ్ళుగా కానీ చెడ్డ వాళ్ళుగా కానీ రచయిత చిత్రించలేదు. మానవుల ప్రవర్తనకు అవకాశమూ, లేదంటే! అవకాశమూ కల్గిన పరిధిలో విస్తృతంగానో, సంక్షిప్తంగానో చేస్తున్న అదృశ్యహస్తం ఒకటి వుందనే తాత్త్విక చింతన రచయిత కుంది.

ఏ వ్యక్తికి ఏ విధమయిన ప్రవర్తన రచయిత చూపించినా, అది ప్రకృతిగతవ్యక్తియొక్క ప్రతి బింబమేకాని, తదన్యంకాదు. అందుచేత, జీవితంయొక్క విస్తృతిని లేండ్‌స్కేప్ లాగా రచయిత చిత్రించటమే పాఠకులు చూస్తారుగానీ, మరి ఇతరమైన ఏ దృష్టీ చూడలేరు.

శ్రీ రాజారాం తన కథలలో చిత్రించిన పాత్రలు సజీవంగా వుంటాయి. ఒక పాత్రను చిత్రింప తలపెట్టినప్పుడు రచయిత ఆ పాత్ర పుటు పూర్వోత్త రాలు, పూర్వాపరాలు స్పష్టంగాచెప్పి తృప్తి చెంది నట్లు కనిపిసుంది. ఆ సమయంలో కథాగమనం పరీక్షించే అవకాశంవైపు దృష్టిప్రసరింప కుండా, పాత్రసృష్టిలో లీనమయిపోయే రచయిత ఏకాగ్రత ఒక విధంగా ప్రశంసాపాత్రమే! అయితే కథకంటే ముఖ్యంగా పాత్రను ప్రదర్శించటంలో రచయితవాంఛను పాత్రను పాత్రగతసమాజాన్ని సముజ్జ్వలంగా సందర్శించాలనే తాపత్రయాన్ని చూచిన పాఠకులు బాధపడనక్కర లేదు.

గ్రామంలోఉండే మునసబు కరణం వీరూ, మధ్యరంగంలోకి వచ్చిన ప్రెసిడెంటూ, బడిపంతులు, బడిపిల్లలు, రైతులు, పంచాంగం తెలిసినవాళ్లు, కూతురుపై మమకారం పెంచుకొన్న తల్లిదండ్రులు, క్రొత్తయింటి కాపురంలో ఇమిడిపోదలచిన క్రొత్త కోడళ్ళు, దేశాల వెంబడిపోయే పారిపోయే వ్యక్తులు, ఒక విధంగా ఆశోపహతులు, అల్లుళ్లకోసం గాలించే వాళ్ళు—వివిధవిధాలుగా పాత్రలు కనిపిస్తాయి.

పసివాళ్ల మనస్తత్త్వం, యువకుల మానసిక అవ్యవస్థ; వృద్ధుల వాంఛలు, భయాలు రచయిత చక్కగా చిత్రింపగలిగినట్లు ఈ కథలలో చూడవచ్చు. కానీ పురుషపాత్రలు దర్శించే నేర్పు రచయితకు ఫోర్ డైమెన్షన్స్‌లో వుంది. అదే స్త్రీ పాత్రలను దర్శించ టంలో వీలుకాలేదు. బాధలుపడే స్త్రీలు, జీవితం, కుటుంబం చక్కదిద్దుకొనే స్త్రీలు, తండ్రిని చక్కగా చూచుకొనే కూతుళ్లు, భర్తను భద్రంగా చూచు కొనే భార్యలు, కొడుకుపట్ల వాత్సల్యం చూపే తల్లులు కనిపిస్తారుకానీ, ఒక్క స్త్రీ ఏ కథలోనూ, అన్నికోణాలనుంచి సమగ్రంగా గోచరంకాదు. 'అవ

శేషం'లో అనసూయమ్మ అయినా సమగ్రంగా కనిపిస్తుందేమోనని ఆశించితే, అక్కడా నిరాశే ఎదురవుతుంది.

అయితే పల్లెల్లో ఉండే పురుష పాత్రలు అన్ని కోణాలనుంచి సమగ్రంగా కనిపిస్తాయి. దైవసృష్టిలోని పురుషులు పాత్రలుగా కథలలో మలచబడ్డప్పుడు, సమాజానికి కార్బన్ కాపీలుగా కనిపిస్తారు. సమగ్రమైన పురుషపాత్రసృష్టిలో రచయిత అందెవేసిన చేయి!

వస్త్వైక్యం శ్రీ రాజారాం ఆః

చాలావరకు పాటించినా, కాలైక్యం, స్థలైక్యం గూర్చి ఆలోచింప నక్కరలేదు. నవలికలుగా పేర్కొనబడిన 'అవశేషం', 'కారణభూతుడు' 'మరీచిక' పెద్దకథలు మాత్రమే ఆ దృష్టితో. కథ సైజ్ చిన్నదయినా పెద్దదయినా ప్రముఖంగా శ్రీ రాజారాం కథారచయిత.

పల్లెలోనయినా పట్టణంలోనయినా, సాధారణంగా నవరసాలకూ ఆలంబనాలుగా మిగిలే మనుష్యులుంటారు. అయితే శ్రీ మధురాంతకం రాజారాంకథల్లో కరుణరసం ప్రధానంగా కనిపిస్తుంది. హాస్యం ఎక్కడో కొంచెంగా మాత్రమే వుంటుంది. శృంగారరసస్థితి కలిగే తావులలోకూడా రచయిత ఆ ప్రయత్నం చేయలేదు. సంసార జీవితం ప్రదర్శితమవుతుంది గానీ 'ప్రేమ' కనిపించదు. యువతీయువకుల ప్రేమ విషయంలో 'అవశేషం'లో 'ఇందుబాల' తొందర కనబడుతుంది, అది రసాభాసం! 'వగపేటికి చల్లచింది నన్'లో మురళీకృష్ణపాత్ర అపర గిరీశం లాగా వుంటుందని ఆశించిన వాళ్ళకు నిరాశే ఎదురవుతుంది. మరో సుగుణం ప్రేమ చిత్రింపవలసివచ్చినా, రచయిత గుంభనగా సంయమనం ప్రదర్శించటం! ప్రేమను గూర్చి చెప్పే పరిస్థితి ఎదురైనప్పుడు, మెల్లగా కథను కరుణంవైపు రచయిత లాక్కుపోవటంచూచిన పాఠకులు ఈ రచయిత జీవిత దృక్పథం కొద్దిలో కొద్ది అర్థం చేసుకొనే అవకాశం వుంటుంది.

శ్రీ మధురాంతకం రాజారాం కథలను కొన్ని తరగతులుగా విభజించుకోవచ్చు. ఆ విభజన పాత్రలను బట్టి కుదురుతుందికాని వస్తువులనుబట్టి కుదరదు. స్థూలంగా వస్తువు గ్రామగతమయింది. పాత్రలూ పల్లెలకు చెందినవే! వస్తువులో వైవిధ్యం వుంది. అంతకంటే పాత్రల వైవిధ్యం ప్రస్ఫుటం.

పల్లెలో పాఠశాల ఒక విధమైన చైతన్యయుత సంస్థ. అందులో అధ్యాపకులు, విద్యార్థులు అనేకులు. వారిని పరిశీలించి పాత్రలుగా మలచుకోగల రచయిత పరిమిత సమాజాన్ని యథాతథంగా చిత్రించినట్లవుతుంది. శ్రీ రాజారాం, అధ్యాపక వృత్తిలో ఉన్న రచయిత. అందుచేత చాలా కథలలో పాఠశాల బడిపిల్లలు అధ్యాపకులు వారి వారి మానసిక పరిస్థితులు పాఠకులకు కనిపిస్తూ కనిపించటం సహజమే!

'తాను వెలిగించిన దీపాలు'లో కృష్ణశర్మ తెలుగు పండితుడు. ఉద్యోగంనుంచి రిటైర్ అయి, తను పనిచేసిన పాఠశాల చూడవచ్చి తిన్న ఎదురుదెబ్బలోనుంచి పొందిన తాత్త్వికచింతన దర్శింపవీలవుతుంది.

'పాఠశాల అనగా ఇటుకలతోనూ, సిమెంటుతోనూ రూపొందిన భవనాల సమూహంకాదు. పాఠశాల అనగా విద్యార్థులు అనుకొన్న కృష్ణశర్మ 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుష్యులోయ్' అన్న గురజాడసూక్తి హృదయంలో తలపోశాడు.

'విధి విలాసము'లో చంద్రమౌళి కాలేజీ లెక్చరరు. ఆ పాత్ర కాలేజీ లెక్చరరుఅయినా, స్కూలు టీచర్ అయినా, జిల్లా కలెక్టరు అయినా కథలో ప్రాధాన్యంలేదు. లక్ష్మికి భర్త కావటానికి, వెంకటనరసయ్య గొంతులో మరణసమయంలో ఇన్ని నీళ్ళు పోయటానికి చంద్రమౌళి కాలేజీలెక్చరరు కావలసిన అవసరంలేదు. అయిదేళ్ళ క్రితం పిచ్చివాడుగాఉన్న చంద్రమౌళి అంత త్వరగా లెక్చరరు ఎలా అయ్యాడో కూడా ఆలోచింపదగిందే!

'అవశేషం'లో ఇందుబాల, ప్రకాశం సురేంద్ర పల్లె విడిచి పట్టణంవచ్చి చదువుకొని, కాలేజీ వాతావరణం కల్పించిన తొందరలవల్ల ప్రేమలలో ప్రవేశించిన పాత్రలు. అంత కంగారుగా ప్రేమించే అమ్మాయిగానీ, అది చూస్తూ కిమ్మనకుండావుండే అన్నగానీ, అరుదుగానీ అసలు లేకపోలేదు. అయితే ప్రకాశం పాత్ర విశిష్టమయింది, ఆ పాత్ర ఒక పరిపూర్ణ చిత్రణ! మరుపురాదు.

'కారణభూతుడు'లో రామన్న సీనప్ప చిన్న తనంనుంచీ స్నేహితులు. పట్టణంలో కాలేజీ చదువు ముగించుకొనివచ్చి, కారణభూతుణ్ణి కనిపెట్టగలిగారు.

'మరీచిక'లో ప్రకాశం కాలేజీ చదువు ముగించు కొనివచ్చిన విద్యార్థి. ఈ పెద్దకథలో రచయిత ఒక సుందరస్వప్నం పాఠకులకు ప్రదర్శించినట్లే !

రచయిత చాలా కథలలో ప్రకాశం ప్రధాన పాత్రగా గోచరిస్తుంది. ఆ పాత్రను చిత్రీకరించే టప్పుడు రచయిత తన ఆత్మను ఆ పాత్రలో చొప్పి స్తున్నట్లేననీ, తన ఆశలు నిక్షిప్తం చేసుకొంటు న్నట్లేననీ, పాఠకులు భావించే అవకాశం ఉంది.

మనదేశ భవిష్యత్తుకు ప్రాణభిక్ష ప్రసాదింప గలిగినవి పల్లెపట్టులు. అక్కడ జరిగే వ్యవసాయం దేశ సౌభాగ్యానికి అత్యంతావశ్యకం. విద్యావంతులయిన యువకులు వ్యవసాయరంగంలో కృషిచేస్తే దేశం సుభిక్షం అవుతుంది. ఆ ఆశ రచయితలో కని పిస్తుంది. అందుకే 'ప్రకాశం' వ్యవసాయంలో కృషి చేయ ప్రయత్నించటం 'మరీచిక'లో కనిపిస్తుంది.

'మర్రిచెట్టు'లో రామం స్కూలు విద్యార్థి ! ఎక్స్‌కర్షన్‌కు పోవాలని తపన పొందిన తన హృదయం గుర్తించినసత్యం, చివరలో పాఠకుల హృదయం కదిలిస్తుంది,

'మాతృసప్తకం'లో రామకృష్ణ వారాలుచేసి చదువుకొని కాలేజీ లెక్చరర్
పెళ్ళాడింతర్వాత, వారంలో ఏడు రోజులు భోజన సదుపాయాలు కలిగించిన తల్లులు ఏడు గురికి బట్టలు ఇవ్వటంలో అతని మనస్తత్వం పాఠకులకు స్పష్టంగా తెలిసిపోతుంది. పైగా రామకృష్ణ సైకాలజీ లెక్చరరు !

'ప్రాణదాత'లో నీరజ తాతయ్య అధ్యాపకుడుగా పలుపురికి ప్రాణదాత. శేఖరం జర్నలిస్ట్‌గా నీరజ విద్యార్జనకు డబ్బు పంపుతూ ఒక విధంగా ప్రాణ దాత ! జబ్బులో పడిపోయిన శేఖరంను రక్షించిన డాక్టర్ నీరజ మరోవిధంగా ప్రాణదాత ! ఈ కథ కళాఖండంలా ఆకర్షింపగలిగింది. అయితే వాస్తవిక దృక్పథంతో పరిశీలిస్తే కొంత అసహజంగా భాసించే అవకాశం కలిగివుంది.

'అడిగిరాని వరాలు' పూర్తి పాఠశాలా జీవితం చిత్రించే చక్కని కథ.

శ్రీ రాజారాం కథల్లో ఏదో విధంగా విద్యార్థి కానీ, అధ్యాపకుడుగానీ కనిపించి తీరవలసిందే! సాధా రణంగా కథ చెప్పే వ్యక్తిగావున్న పాత్ర, అధ్యాపక వృత్తిలోఉన్న పాత్రగా గోచరిస్తుంది.

రచయిత ప్రధాన పాత్రగావుండే క శ్రీ మధురాంతకం రాజారాం కొన్ని రచింపకపోలేదు. రచయిత అయిన శ్రీ రాజారాం కథలలో తీర్చిదిద్దిన రచయిత పాత్రలలోనుంచి, ఈ రచయిత మనస్తత్వం తెలుసుకొనే వీలేమయినా వుందేమోనని ప్రయత్నించే పాఠకులకు అవకాశం ఇవ్వకపోలేదు.

'జారుడు మెట్లు'లో నీలకంఠం ఉత్తమ రచ యిత. బీదతనంలో బాధలుపడ్డాడు. భార్యపై అను మానంతో దేశాలుపట్టుకు వెళ్ళిపోయాడు. పన్నెండు ఏళ్ళ తర్వాత తిరిగి స్వస్థలం చేరుకొనేసరికి తన పేరుతో తను వ్రాయని రచనలు ప్రచురింపబడి ఉండటంచూచి ఖిత్తరపోతాడు. అవి కాముక రచ నలు. బాధపొందుతాడు. అప్పటికే డిటెక్టివ్ సాహిత్యం ఉబ్బడి మబ్బిడిగా దిగుమతి అయిపుంటుంది. తీరా తెలుసుకొంటే తన పేరుతో రచనలు సృష్టించింది తన కొడుకేనని తెలిసి ఆశ్చర్యపోతాడు నీలకంఠ, కంఠంలో శ్రీ రాజారాం కంఠం వినిపిస్తుంది ప్రకాశం గొంతులోంచి వినిపించన ఒక్కమాట తృప్తి కలి గిస్తుంది. నీలకంఠం అనుకొన్న మాటలు 'తీసుకొన్న యితివృత్తంలోగానీ, కుదిరించుకొన్న శైలిలోగానీ, సాగించిన కథనంలోగానీ వీళ్ళుపో యిందొక క్రొత్త పోకడ. పోకడ అనటంకన్నా పోకడలు అనటం సమం జసం. ఎందుకంటే శైలిగానీ, కథనంగానీ, ఒకచోట ఉన్నట్లు మరొకచోట లేవు'......'రచయితపేరు చెప్పుకొని రచన అమ్ముకోడం సవాలైతే రచనమూలంగా రచయిత మళ్ళీ లోకంలోకి తిరిగి రావటం ఎదురు సవాలు'. అదే విధంగా గతానుభవం నెమరు వేసుకొని వ్రాసిన రచనను, ఆశ్లేషా ప్రచురణాగారం కర్త ప్రకాశం, తన తండ్రి రచన ప్రచురింపకుండా ఆపితే తల్లి ప్రశ్నింపగా ప్రకాశం, రచయిత, పాఠకుడు, పబ్లిషర్ అయిన ప్రకాశం పలికిన మాటలు. 'ఐనా నాన్నగారిపుస్తకాని కిప్పుడేం తొందర. ఎప్పుడై

వేసుకోవచ్చు దాన్ని. అది కాలగతికి మారొడ్డి కల కాలం నిలిచే పుస్తకం.

'చేదు నిజం'లో రాధాపతి నాటక రచయిత. బీదవాడు. రచన వాస్తవికంగా ఉండాలని తలంచేవాడు. కలల్లో బ్రతికే ప్రకాశం వీపుతట్టి కల్పనాత్మకంగా కథచెప్పి గడుసరిగా ప్రవర్తించాడు.

'జగన్నాటకం'లో ఒకప్రక్క నాటకం ప్రయోగింపబడుతూ వుంటుంది. మరోప్రక్క ప్రేక్షకులలో కథసాగుతూ వుంటుంది. నాటకంలో పాత్రలు అసహజంగా వుంటాయి. సంభాషణలు అసహజంగా వుంటాయి. జీవితంనుంచి దూరంగా పోయివుంటాయి. ప్రేక్షకులలోఉన్న సులోచన జీవితం నాటకంలో ప్రధాన పాత్రధారితో ముడిపడివుందని చివరిదాకా తెలియదు. అంత అసహజంగా రచన ఉండకూడదనీ రచయిత అభిప్రాయం.

'కారణభూతుడు'లో ఒక రచయిత పాత్ర వుంది. ఆ రచయితకు డిగ్రీ వుంది. ఉద్యోగంలేదు. జీవితంగూర్చిన ఆశలు నిరాశలయ్యాయి. పల్లెలో ఉన్న రెండు ముఠాలకు ఉన్న తగాదాలు అభివృద్ధి చెందేందుకు ఏర్పడ్డ రెండు వారపత్రికలలో ఒక వర్గం గుర్తించకుండా మరో వర్గం వారికి రచనలు అందించి బ్రతుకుదెరువు చూచుకొన్న రచయితమీద పాఠకులకు కోపంకంటే సానుభూతి కలిగేట్టు శ్రీ రాజారాం చేసిన చిత్రణ, పరిశీలింపదగింది.

పల్లెలోగానీ, పట్టణంలోగానీ కన్నకూతురు మీద తండ్రికి మమకారం తప్పదు. పల్లెలోని పుత్రికా జీవులు అల్లుళ్లను వెతకటంలో పడేబాధ, కొన్ని కథలలో గోచరమవుతుంది. 'ఎదురుగాలి' మున్నగునవి.

జాతకాలమీద పల్లె ప్రజలకు నమ్మకం ఎక్కువ. అన్నిపనులకు పంచాంగం తిరగేయటం తప్పనిసరి అవుతుంది. ప్రోనోట్‌లు వ్రాయటం చేత గాక, పంచాంగం చూడటం తెలియక, పల్లెటూరిలో బడిపంతులుగా ఉండటం కష్టం. 'పంచాంగ ప్రసక్తి' 'కాటుక కంటినీరు' అందుకుదాహరణలు.

సన్యాసుల రాకపోకలు, వారికి పరిచర్యలు, వారుచెప్పే మాటకోసం పల్లెప్రజలు చెవులప్పగించి వినటం గ్రామాలలో నేటికీ సామాన్యం. ఆ ఇతివృత్తంతో శ్రీ రాజారాం రచనలున్నాయి. 'వైరాగ్యంతో సరాగం, మొదలైనటువంటివి ఆరకం రచనలు.

పల్లెలో చాలామంది ఇంటిపట్టున ఉండలేరు. అందుకు కారణాలు అనేకం. దేశాల వెంబడి వెళిపోతుంటారు. మళ్లీ ఎప్పుడో వస్తారు. ఎటో పోతారు. అది ఒక విధంగా సృష్టి వైపరీత్యం అర్థం చేసుకోవాలనే తాపత్రయం. ఈ కోవకు చెందిన రచనలు 'మానవుడి విజయం' మొదలైనవి.

పేదవాడయిన విద్యార్థి డిగ్రీ పుచ్చుకొని ఉద్యోగంలో ప్రవేశించి వివాహ విషయం వచ్చేసరికి కొరకరాని కొయ్యగా తయారయ్యే ప్రమాదం ఉంది. పల్లె వాతావరణం వదిలిపెట్టి పట్టణ పరిసరాలకు పోయి, అక్కడి పద్ధతులు పూర్తిగా అనుకరింపలేక, వెనుకటి గుణం పూర్తిగా వదులుకోలేక సతమత మయిపోయే విద్యార్థులు ఎందరో!

'అవశేషం'లో ప్రకాశం స్వస్థలజ్ఞానం కోల్పోయినవాడుకాడు. వలచివచ్చిన ధనవంతుల బిడ్డను బీదవాడయిన ప్రకాశం కాదనుకొని వెళ్లిపోయి, ఏం సాధిస్తాడో అనే ప్రశ్న మిగిల్చివేస్తాడు. అయితే అతను జీవితంలో పైకిరాడని తెలిసినా ఒక విధమయిన ఆనందమే కలుగుతుంది.

'వగపేటికి చలించిందినన్'లో మురళీకృష్ణ బీదవాడు. డబ్బుతో రాగలే తేగలే అమ్మాయిని తప్ప పెళ్లాడననేవాడు, తల్లి దయనీయస్థితిని మరిచిపోయి, మూర్ఖంగా తన సౌఖ్యం తాను చూచుకొన్నా వాడిపట్ల పాఠకులకు బాధ కలిగినా, వాడయినా బాగుపడ్డాడని సంతోషమే కలగవచ్చు.

'భూపతి జంపితిన్ మగడు భూరి భుజంగము చేత జచ్చె...నృపతీ వగపేటికి చల్లచిందినన్' అనే పద్యంలో చివరి పదాలయిన 'వగపేటికి చల్లచిందినన్' అనే కథాశీర్షిక చూచిన పాఠకులు వేశ్యఅయిన తల్లి దగ్గరకు కొడుకు విటుడై వస్తాడేమోననే బాధ కలిగే అవకాశం వుంది. అయితే ఆ కథలో అటువంటి విషయం ఏమీ వుండదు. అప్పుడా శీర్షికకు అర్థం ఆలోచించుకోవలసివస్తుంది.

నేటి యువతీ యువకుల్లో పెళ్ళి విషయకంగా అవ్యవస్థ వుంది. అర్థం పర్థంలేని తోవల వెంట వాళ్ళ ఆలోచనలు పోతూవుంటాయి. 'ఎక్కవలసిన రైలు' 'సబల' అటువంటి రచనలే! ఆ కథలలో రచయిత పాత్ర చిత్రీకరణ ఫలితాంశంగా తీర్మానం పాఠకులను ఆకట్టుకొంటాయి.

పల్లెల్లో ప్రజాజీవితం, కుటుంబంలో సౌఖ్యాలు, దుఃఖాలు, కలహాలు, కలసికట్టుగా వుండటాలు ఎన్నో వుంటాయి. ఒక పాత్రతో మరో పాత్ర కలిగి వుండే సంబంధబాంధవ్యాలవల్ల మనస్సును దాచుకోవటం, వ్యక్తీకరించటంవంటి పరిస్థితులు; ఎన్నో ఎదురవుతుంటాయి ఆర్థికమయిన ఇబ్బందులు, మనఃతాపాలు, పంటపొలాల విషయం, వర్షం రానిబాధా. ఇటువంటి వస్తువులపై సమగ్రంగా చర్చించి, చక్కని కథలు వ్రాసే సామర్థ్యం శ్రీ రాజారాం పుష్కలంగా కలిగివున్నట్లు చెప్పవచ్చు 'చీమలు పెట్టిన పుట్టలు' 'మరీచిక' 'అప్ర' 'సంఘజీవి' 'రామారావు చతుర్శ్లోకాలు' ఉదాహరణప్రాయంగా చెప్పుకోవచ్చు.

పై చివరికథలో రామారావు పాత్ర శ్రీ రాజారాం పాత్ర అయివుంటుందని మిత్రులు ఊహింపగల్గుతారు. నిజం!

'సుడిగుండం' కూడా ఒకవిధంగా పై కోవకు చెందిన రచనే! అయితే తాసీల్‌దారు అయిన శేఖరం కోపతాపాలకు కారణం అని కుటుంబంలోని ఆర్థిక పరిస్థితులు అని అందరూ పోల్చుకోలేకపోవచ్చు. శ్రీ రాజారాం మరొక తాసీల్‌దారు పాత్ర 'ప్రాప్తి'లో సృష్టించి, తమాషాగా రచించటం గమనార్హమే!

రచయితకు తనపాత్రలపై సానుభూతి లేకపోవటం మహాపాపం. శ్రీ రాజారాంకు అటువంటి పాపం అంటుకోదు. ప్రతివ్యక్తీ తప్పులు చేస్తాడు. తప్పు చేయటం కాదు ఆ పాత్ర స్వభావం. అలా చేయవలసి వచ్చింది. అందరూ దుష్టుడు, దుర్మార్గుడు అనుకొనేట్టున్న వ్యక్తిని పాత్రగా స్వీకరించి, సానుభూతితో పాత్ర సృష్టిచేసి, పాఠకులకుకూడా జాలికలిగేట్టు చిత్రింపగలనేర్పు రచయితకుంది.

పల్లెలలో ఉండే, వివిధ విధాలుగా మసలుకొనే, మనుష్యుల్ని పాత్రలుగా తీర్చిదిద్ది ఆ పాత్రలకు సాహిత్య స్థితి, ప్రసాదించిన శ్రీ మధురాంతకం రాజారాం కథలు పల్లెపట్టులకు ప్రతిబింబాలు వంటివి. కాదంటే ఆ కథలు పల్లెలు చూడటానికి పనికివచ్చే దర్పణాలు. పల్లెప్రకృతి అన్ని కోణాలనుంచి పలికించి, ఒక సమగ్ర గ్రామం రచనలలో అందించిన రచయిత కృషి సఫలమయింది.

కవిత్వంలో కల్పన ఎంతవున్నా చింతలేదు. వాస్తవికత వుండి తీరాలన్న నిర్బంధం లేదు. అయితే కథా రచయితకు ఆటంకాలున్నాయి. కథ వాస్తవికంగా లేకపోతే, ఆ రచన చేసిన ప్రయోజనం ఉండదు.

వాస్తవికంగా వుండటం వీలవుతుంది. అయితే అంతా వాస్తవికంగా ఉండదు. కొంతవరకు మాత్రమే! అంతా వాస్తవమయితే అది చరిత్ర అవుతుందిగానీ సాహిత్యంకాదు. కల్పన ఉన్నప్పటికి వాస్తవ భ్రాంతి ఉండేట్టు రచించాలి. కథలో వాస్తవం వుంటే నిస్సారంగా వుండవచ్చు. అంతా కల్పనే అయితే అది పాఠకులకు దూరమయిపోతుంది. కాబట్టి కథలో వాస్తవాభాసం వుంటుంది.

'జగన్నాటకం'లో సులోచన అనే బక్కపలుచటి యువతి నాటకం చూస్తూ కూర్చుంటుంది. ఆమె తన గోడు అంతా ప్రక్కనే కూర్చున్న అప్పుడే పరిచయమయిన 'పిన్ని' (అది కలుపుకొన్న సంబంధం)తో చెప్పుకొంటుంది. రంగస్థలం విహాద ఆ సులోచన కథతో పోల్చదగిన క నాటకంగా సాగిపోతుంది. చివరికి అది నాటకం, ఇది జీవితం అనే ముగింపు ప్రస్తావింపబడింది.

నాటకంలో తనను వదిలేసి మరొకడితో లేచిపోయిన కథానాయికను ఆకస్మికంగా ప్రైజ్ రూపంలో వచ్చిన డబ్బుతో కాపాడిన కథానాయకుడి చిత్రణగానీ, కథాపథకంగానీ అసహజంగా అవాస్తవికంగా ఉన్నట్లు తేల్చటం రచయిత ఉద్దేశ్యం.

తనను వదిలేసి వెళ్ళిన భార్యను ఎంత పతిత అయినా తిరిగి తీసుకొనివచ్చి సంసారంచేసే భర్తలు లేరా? ఉండవచ్చు! ఉండకపోవచ్చు! ఈ సందిగ్ధ సమాధానం ఉన్న సమస్య ఎప్పుడూ అవాస్తవంకాదు. ఆకస్మికంగా అంత డబ్బు రావటం సాధారణంగా

జరగదు కాబట్టి అవాస్తవంగా అసహజంగా తృణీకరింపవచ్చు.

బాగుంది. అయితే సులోచన ముడిచిన గొడుగు మాదిరిగా గుట్టుగా కష్టనష్టాలు పైకి తెలియకుండా బ్రతుకుతున్న సులోచన, అపరిచితురాలితో తన గోడంతా వెళ్ళగ్రక్కుకొంటుందా? ఆమెకు తెలిసినవాళ్లతోనే తన దీన జీవితం చెప్పుకొనే ఇష్టం లేకుండా బ్రతుకుతున్న మానిని, సులోచన!

ఇది అసహజంగా ఉందనరాదు. ఎందుకంటే అది కథ కనుక. నిజమైన జీవితంకాదు కాబట్టి.

'జగన్నాటకం'లో ప్రదర్శింపబడిన నాటకంలో అవసరమయినప్పుడు బహుమతి రూపంలో డబ్బు రావటం అసహజంగా ఉంటుందని అంగీకరించి చూస్తే మరొక అవాంతరం ఎదురవుతుంది.

'జారుడు మెట్లు'లో శ్రీపతి సార్థక నామధేయం కలవాడు 'నీలకంఠం' అనే రచయితను చూడబోయి, అతని కష్టాలు చూచి వర్షం కురిసిన రోజు, అయిదువందల రూపాయిలు కిటికీలోంచి పడేసి పోవటం సహజంగా వుందా? ఏ రచయితమీదనయినా అమిత ప్రేమఉంటే అతని రచనలన్నీ కొని చదువుతారు, కాఫీ ఇప్పిస్తారు, నాలుగు గొప్పమాటలు చెబుతారు, కాదంటే పది రూపాయిలు అప్పు ఇస్తారు, దంటే పది రూపాయిలు గొప్పకోసం దానంచేస్తారు గానీ, అయిదువందలు గుప్త దానం చేస్తారా? చేస్తే చేయవచ్చుననుకొంటే నీలకంఠం అనుమానం విచిత్రంగా వుంటుంది. తన భార్య సహధర్మచారిణి ఎన్నిరోజుల్నుంచి ఇంత డబ్బు అధర్మమార్గంలో సంపాదించింది అని అనుమానిస్తాడు నీలకంఠం. ఇంతకాలం తనతో కాపురంచేసిన భార్యను గూర్చి నీలకంఠం అంతేనా తెలుసుకొంది?పోనీ ఇంట్లో గంజికాచుకోవటానికి గింజలులేని పరిస్థితిలో అంత డబ్బు ఉంచుకొని ఆమె పిల్లల దుఃఖం చూస్తూ ఉండగలదా? ఇదేదీ అసహజంగా లేదా? జీవితమైతే అసహజమే! కథ అయితే అసహజం కాదు. ఆమాత్రం కల్పన లేకపోతే కథ మలుపు ఎలా తిరుగుతుంది? నీలకంఠం ఇల్లు విడిచి వెళిపోవటానికి కారణం ఏమి చిక్కుతుంది? అతను భవిష్యత్తులో సాధింపబోయే లేదా సాగింపబోయే జీవితానికి నాంది తప్పనిసరికదా!

'వర్షించిన మేఘం'లో కారుక్రింద పడబోయిన స్వర్ణలతను రక్షించి శేషాద్రిని ఇది 'ప్రణయగాథ'కాదు గదా అని మిత్రులు ప్రశ్నించినప్పుడు, అతను చెప్పిన సమాధానంలో రచయిత అభిమతం వుంది. 'రాజకుమారి తోటమాలిని పెళ్లాడటానికి ఇది జానపద గాథకాదు. ప్రథమ పరిచయంలోనే ప్రణయానికి అంకురార్పణ జరగడమనేది లోకంలో అరుదుగానూ కథలలోనూ తరుచుగా జరిగే సంఘటన. పైగా దారంట వెళ్ళే దాసయ్యను ప్రేమించటానికి స్వర్ణలత అంత మూఢురాలు గాదు.'

అయితే 'సబల'లో నీళ్లలో పడిన విశాలను రక్షించిన రామారావు విశాలను ప్రేమించాడు. ఆమె కూడా ప్రేమించింది. పెళ్లయిపోయింది. అంత ఆకస్మికంగా, అంతకుపూర్వం కనీసం పరిచయమైనా లేని రామారావును ఆమె ఎలా పెళ్లాడగలిగింది? తను నీటిలో చావబోతుంటే ఎవరు రక్షిస్తారో అతన్ని పెళ్లాడదామనే నిశ్చయంతో నీటబడిందనుకొనటం సమాధానం అయితే, ఎవరో ముసలివాడో, ముతకవాడో, గుడ్డివాడో, కుంటివాడో ఆమెను రక్షించివుంటే ఆ వ్యక్తినే పెళ్లాడి వుండేదా?

కథ ఎప్పుడూ జీవితంవలె ఉంటుందికానీ పూర్ణ వాస్తవం ఉండదు. ఆ దృష్టితో కథలు చదవనక్కరలేదు. వాస్తవం అనే భ్రమ కల్పించి ఎంత అవాస్తవం అయినా వ్రాయవచ్చు. కథలు వాస్తవంగా ఉన్నట్లు అనిపించాలి. శ్రీ రాజారాం కథలు అన్నీ వాస్తవికంగా వుంటాయి. ఈ రచయిత మరొక తావులో సంభాషణగతంగా కల్పన కథలో అవసరమనే అంగీకరించటం పాఠకులు గమనిస్తారు.

శ్రీ మధురాంతకం రాజారాం 'మధు' అనే గుప్తనామంతో వ్రాసిన 'దేశీయత—వాస్తవికత' అనే వ్యాసం 'భారతి'లో ప్రచురితమయింది. ఆ వ్యాసం ఒక కథలాగా ప్రారంభింపబడింది. ప్రధానపాత్ర అయిన మధుసూదనంకు చక్రపాణి వ్రాసిన ఉత్తరంలో కథల చర్చ ఉంది. మధుసూదనం చక్రపాణిపై సదభిప్రాయం కలిగింపలేదు. అందుచేత చక్రపాణి ఉత్తరంలో ఉన్న

ఖించిన అన్ని సంగతులు మధుసూదనం మాటలు కావని, తన్మూలంగా 'మధు' మాటలు కావని, అందు వల్ల శ్రీ మధురాంతకం రాజారాం మాటలు కావనీ అనుకొనే అవకాశం వుంది.

ఆ వ్యాసంలో 'పదింట తొమ్మిదివంతుల కథల్లో ఈ నాడు కనిపిస్తున్న కాలేజీ వాతావరణాన్ని గురించే మాట్లాడుకొందాము......ఓ అబ్బాయి ఓ అమ్మాయిని ప్రేమించడంగానీ, ప్రేమించకపోవడం గానీ పెళ్ళాడడంగానీ, పెళ్ళాడక పోవడంగానీ వాటం తటవి మహత్తర పరిణామాలేవీ కావు.' ఈ సిద్ధాంతం అందరికీ సమ్మత మవుతుందని ఆశించే అవకాశం తక్కువ. ఎందుకంటే ఎక్కువ మంది అటువంటి రచనలే వ్రాస్తున్నారు. పాఠకులు చదువుతున్నారు కాబట్టి.

ఇటువంటి రచనలు విరివిగా వెలువడితే క్షీణ యుగంలో ప్రబంధాలకు పట్టినగతే ఆధునిక యుగంలో కథాసాహిత్యానికి పట్టవచ్చునని అంగీకరించవచ్చు. పైన పేర్కొనబడిన వస్తువుతో అడ్డమాకలులేకుండా రచనలు ఇప్పుడు వచ్చినట్లే ముందు ముందు వెలు వడితే కథారచన ప్రమాదంలోపడే పరిస్థితి తప్పని సరేకావచ్చు కానీ ప్రేమించటం ప్రేమించకపోవటం మహత్తరం పరిణామం కాకుండా పోదు. స్త్రీ పురుష సంబంధంకంటే లోకంలో మిగిలిఉన్న ఉదాత్తధర్మం ఏమిటో ఆలోచింపవలసి వస్తుంది. అయితే ఆ ప్రేమ రచనకు పూనుకునే రచయితలు నిస్సారమైన రచనలు చేస్తున్నారనీ, అవి అవాస్తవికంగా వుంటున్నాయనీ, అలా కాక సహజంగా ఉండే రచనలు వెలువడితే బాగుంటుం దనీ ఆశింపవచ్చును. ప్రతిభావంతుడు, సమర్థుడు అయిన రచయిత ఏ వస్తువు అయినా తీసుకొని ఉన్నత సృష్టి చేయవచ్చు. అయితే కొన్ని వస్తువులు మహో త్తమ సృష్టిచేయ వీలుగానివి అయితే అవుతాయి గాని, చక్కని రచన చేయటానికి సమర్థాలు కాకపోవు.

ప్రేమ కథలు పరిణతి చెందిన రచయితల చేతులలోకాక, రచనా పద్ధతులు అభ్యాసం చేసు కొంటున్నవారి హస్తాలలో నలిగిపోవటంవల్ల నేటి కథలు అటువంటి అభిప్రాయం కలిగిస్తున్నాయి.

దేశీయత—వాస్తవికత అన్న వ్యాసం చదివి, ఆపైన శ్రీ రాజారాం కథలు చదివితే, వ్యాసంలో స్థాపించిన సిద్ధాంతాలకు అనుగుణంగా, ఉదాహరణ ప్రాయంగా ఈ కథ లున్నాయి అనిపిస్తుంది. పేరు చెప్పని ఒక కథ క్లుప్తంగా ఉదాహరింపబడింది.

ఏ వ్యాసరచయిత అయినా ఏ వస్తువు కథకు పనికిరాదని తలపోస్తాడో, ఆ వస్తువే కథకు ఎంత వరకు తగిందవుతుందో ఆలోచించి ఆపైన సిద్ధాంతం చేయటం మంచిది. ఒకటి రెండు విషయాలలో పాక్షి కంగా అభిప్రాయభేదం ఉన్నప్పటికీ పై వ్యాసం కథా ప్రక్రియాత్మను ప్రదర్శించేదిగా వుంది. రచయితలు తాము రచనలుచేసే ప్రక్రియలపై వ్యాసరచనచేస్తే అది పై వ్యాసంలాగా మిక్కిలి ఉపయోగకరం అవు తుంది.

ప్రతి రచయితకు వ్యక్తిగతమైన రచనాశైలి ఉంటుంది. అది అనుకరింప సాధ్యంకానిది. శ్రీ రాజారాం వచనశైలి రమణీయంగా వుంటుంది. 'కథకు ఇతి వృత్తం శరీరంలాంటిదైతే శైలిని వేషంతో ఉపమించ వచ్చు'నని రచయిత అభిప్రాయం.

ఈ రచయిత శైలిలో తూగు ప్రధానమయింది. వాక్యనిర్మాణంలో క్రమత సమత వుంటాయి. వస్తుతః కావ్యాత్మ ఉన్న శ్రీ రాజారాం శైలిలో ఎడనెడ కవితా స్ఫూర్తి గోచరమవుతుంది. కథంతటా ఒక సమా నత్వం, ఒక ఋజుమార్గం గోచరమయి, ఈ కథ ఈ రచయితదే అని చెప్పగల ముద్ర వుంటుంది.

వర్ణనల సందర్భంలో రచయిత చూపే సంయు మనం గమనార్హం. ప్రకృతి వర్ణనలో కవితారీతి వున్నా, పాత్రల స్వభావస్వరూప వర్ణనంలో స్వభావోక్తి కనిపిస్తుంది. శైలిలోని విశిష్టతను ఎక్కువగా యధావస్తువర్ణనంలో పాఠకులు చూడగలుగుతారు.

ఆధునిక యుగలక్షణమయిన వేగం ఈ రచయిత శైలిలో గోచరంకాదు. మూర్తి దాల్చిన సంయమనం ప్రదర్శిస్తుంది శైలి. ఆంధ్రులలో ఆవేశపరులు అధికమే అయినా, ఇటువంటి పాత్రలు ఈ కథలలో అరుదు. అందుచేత ఆ పాత్రలు ప్రదర్శించే తొందర లేదు. అది ఉండి ఉన్నట్లయితే శైలిలో ఏమయినా మార్పు ఉండేదా అనిపిస్తుంది.

ఈ రచయిత అధికంగా సంభాషణలతో వ్రాసిన కథలు వేళ్ళపై లెక్కింప వచ్చునేమో! రచయిత కథ చెబుతూ వెళుతూ ఉండటమే కాని,

సంభాషణ గీతంగా పాఠకులకు కథ చెప్పిన తావులు అత్యల్పాలు.

కథా శిల్పం విషయంలో శ్రీ రాజారాం మార్గం ప్రత్యేక మయింది. ఆంగ్లంలో ఉన్న ఉత్తమ కథా లక్షణాలు అన్నీ సంతరించుకొని కథలు ఈ రచయితవి. ప్రారంభోపసంహారాలు మాత్రం ప్రసిద్ధాంగ్ల కథలలోలాగా కథాలక్షణానుగుణంగా వుంటాయి.

కాలక్షేపంకంటే ప్రయోజనం సాధించేదిగా కథ ఉండాలన్నది రచయిత అభిమతం. ప్రయోజనం ప్రవేశపెట్టినప్పుడు కథాశిల్పం దెబ్బతినకుండా రచన చేయటం అసిధారావ్రతం! కత్తిమీది సాము!

శ్రీ రాజారాం కథలు ఓపికగా చదవకపోతే కథాత్మ గోచరంకాని పరిస్థితి ఎదురవుతుంది. అదెందుకు జరుగుతుందంటే, కథను దూరంగా వుంచి, పాత్ర రూపరేఖలో స్వభావమో, తన ఉద్దేశమో రచయిత స్పష్టంచేస్తున్న సందర్భంలో కథ ఎక్కడ ఆగిపోయిందో, మరెక్కడ ప్రారంభమవుతుందో తేలదు కాబట్టి. కథాగమనం కుంటుబడకుండా ఏంచెప్పినా రాణింపుకు వస్తుంది.

చక్కని ప్రారంభం లిఖించి, కొంతదూరం కథ నడిపి, ఆ మధ్యలో రచయిత తన జీవిత దృక్పథం చెప్పటం సాగించి, చివరిలో చక్కని ముగింపు చెప్పటం, శ్రీ రాజారాం కథ లన్నింటిలో స్పష్టంగా కనిపించే సత్యం.

ముగింపుతో కథకు ఒక ఉన్నతస్థితినిచ్చే నేర్పు రచయితకుంది. 'సర్కసుడేరా'లో 'మేక పిల్ల పులినెలా నమ్మగలిగింది' అన్నప్రశ్నకు 'అవి జంతువులు గదండీ!' అనే జవాబుతో ముగింపు మనుష్యులకు కొరడా దెబ్బ! 'నాకు ఈత బాగావచ్చు' అని విశాల 'సబల' ముగింపులో చెప్పినమాట పాఠకుడి హృదయంలో ఒక్కక్షణం స్పందన ఆపుతుంది. క్షయతో బ్రతికిఉన్న భార్యను ఖాతరు చేయని వాడు నాటకంలో పాత్రగా నాయికకు క్షయవస్తే అల్లాడిపోయిన తీరుతో ముగింపు చెందిన 'జగన్నాటకం' పాఠకుల గుండెలో నిలిచిపోతుంది. 'పోనీలే నాయనా! ఇది నాకు దక్కాలని లేదు' అని ముగిసిపోయిన కథ 'వగపేటికి చల్ల చిందినవ్'లో తులసమ్మ మాట ద్వ్యర్థికావ్యం. 'అడిగిరాని వరాలు'లో రమణయ్య సెలవు పెట్టాడో, కొడుకు పెట్టించాడో ఆలోచించుకోమంటుంది ఉపసంహారం. 'ప్రాప్తి' సమాప్తి పట్టెడు నశ్యం ఇంత పని చేయిస్తుందా అని ఆశ్చర్యం కలిగిస్తుంది. 'మాతృసప్తకం'లో సుమిత్ర ముగింపులో జగన్నాథంగారి అమ్మాయిగా రామకృష్ణ భార్యగా ఒకే పనిచేసి కనిపిస్తుంది. 'మర్రిచెట్టు' శతాబ్దాలపాటు ఇక్కడే వుంటుందనే పరిసమాప్తి, మనిషి గతించినా మానవత్వం నిలిచి వుంటుందనే సూచనను కలిగిస్తుంది. శ్రీ రాజారాం కథలన్నింటిలో ముగింపు తటిల్లతలాగా మెరిసి ఆలోచనాలోచనాలు విచ్చుకొనేట్టు చేస్తుంది.

ఈ మధ్య ముద్రితమైన శ్రీ రాజారాం 'పాటలతోట' కవిత్వం కంటే కవితాహృదయాన్ని, కవితా హృదయం కంటే సంగీతాన్ని, సంగీతం కంటే సంగీతహృదయాన్ని, ఉత్తరోత్తర బలీయంగా ప్రదర్శిస్తుంది.

పట్టణ నాగరికత ప్రతిబింబింప చేసే రచయితలూ, పల్లెజీవితం చిత్రించే రచయితలూ, మనస్తత్త్వం రూపొందించే రచయితలూ, సమస్యలు పరిష్కరించే సదుద్దేశంతో కథానిర్మాణం చేసే రచయితలూ పలువురు ఆంధ్ర సాహితీలోకంలో కథానికా భవితవ్యం ప్రసాదిస్తున్నారు. గ్రామ గత సమాజ సందర్శనం చేసే ప్రతిభావంతులయిన కథా రచయితలలో శ్రీ మధురాంతకం రాజారాల విశిష్ట స్థానం పొంది వున్న సత్యం సరస పాఠకలోకం గుర్తించింది. మరింత సాహితీ తపశ్చర్య వల్ల కేంద్ర సాహిత్య ఎకాడమీ బహుమతి ఈ రచయిత పొందాలని మిత్రుల అభిమతం.

# ద్వితీయ అంతర్జాతీయ తమిళ మహాసభ - ఒక సమీక్ష

ి. రా.

భాష వ్యక్తాయాం వాచి—అని భాషకు మన ప్రాచీన వైయాకరణులు చెప్పిన నిర్వచనం. వ్యక్తమంటే అర్థవంతమయినదని తాత్పర్యం. ఈ వ్యక్త వాక్కు ఏ ఒక్కరి సృష్టికాదు; మానవ సముదాయ సృష్టి, సమాజ సృష్టి. ఒక్కరి వ్యక్తవాక్కును మరొక్కరు గ్రహించి, తదనుగుణము, తదనురూపము అయిన మరొక వ్యక్తవాక్కును ఉచ్చరిస్తూపోగా, ఈ వ్యక్త వాక్కులన్నీ కాలదేశవర్తమానాలను అనుసరించి, ఆయా మానవ సంఘాల ముఖయంత్ర వైవిధ్య విలసనంతో మార్పులు చెందుతూ నానాస్వరూపాలు పొందాయి. ఈ విధంగా భాష, భాషించే వారందరి సహకారంతో సంగృహీతమయిన సమష్టి భండారం. సంఘభావ వ్యక్తీకరణకు సమగ్రమైన రంగం.

సమాజ సంపద అయిన ఈ భాష వంతుల ప్రయోగ విశేషాలతో సారస్వతరూపం పొందుతుంది. ప్రతిభావంతుల పరిశీలన ప్రౌఢిమతో వ్యక్తమయిన పదజాలం ప్రజలందరి హృదయ ఫలకంపై అంకితం కాదగిన అపూర్వ స్వరూపాలను చిత్రిస్తుంది. దానితో భాష విస్తరిస్తూ, భావవ్యక్తీకరణకు వినూతన రీతులను గుస్తరించుకుంటూ సారస్వత రూపంతో ప్రత్యక్షమవుతుంది. కాని అది ప్రవాహినిగనుక ముందుకు సాగిపోతుంది. సారస్వతం దానికి అడ్డుకట్టలువేస్తూ, కొత్తదారులు చూపుతూ, కొత్త వివరణలు వెలయిస్తూ క్రమబద్ధం చేస్తుంది. భాష పూర్తిగా ప్రవాహిని, శరవేగ ప్రవాహిని, వాయువేగ, మనోవేగ ప్రవాహిని గనుక, ఎన్నో కారణాలవల్ల స్వస్వరూపం కోల్పోయే ప్రమాదం గూడ ఉంది గనుక, అలాటి ప్రమాదాన్ని సారస్వతం ఎప్పటికప్పుడు తగ్గిస్తూ, తద్భాషాభాషులందరికీ ఐక్యం చేకూరుస్తూ, పూర్వాపర కాలసమన్వయం సమకూరుస్తూ, భాషకు గంభీరత, విస్తారం సంపాదించి పెడుతుంది.

భాష మానవజాతి పుట్టుకతోనే పరిణమించినది, పరిమళించినది గనుక, అనుదిన అనుక్షణ భావ వ్యక్తీకరణ సాధనమయినది గనుక, ప్రాచీనుల జీవిత సర్వస్వానికి ప్రతిబింబమయిన సారస్వతానికి బాహిర స్వరూపమయినది గనుకనేటికీ ప్రజల బహిః ప్రాణంగానే వుంది. సామాన్య ప్రజలు కూడా వైయక్తికంగా ఏదూషణనైనా సహిస్తారుగాని, తమ భాషా దూషణను సహించరు—భాష రక్తంలో రక్తం, ప్రాణంలో ప్రాణం గనుక.

అరవ ప్రాణమైన ఈ భాష ఎప్పుడు పుట్టిందో, ఎలా పుట్టిందో చెప్పడం కష్టం, మానవుడు తన మనసులో తారాడే భావాలకు వ్యక్తమైన వాక్కులను ఎప్పుడు జోడించ గలిగాడో, ఆ జోడింపు ఏ కారణాలవల్ల, పరిస్థితులలో సంభవించిందో! ఏమో! సృష్టి కారణాల నన్నా వైజ్ఞానికులు స్పష్టంగా చెప్ప గలుగుతున్నారుగాని, పలుకు పుట్టుకను తెల్ప గలుగుతున్నారా? కాని, భాషాపరిణామక్రమాన్ని మాత్రం ఊహించగలుగుతున్నారు; శిశువుల భాషను, ఆదిమజాతుల భాషను, భాషా చరిత్రను బట్టి; భాష ఉత్తరోత్తరం అభివృద్ధి చెందుతుండగా, పూర్వ పూర్వ పరిణామ దశలను పరిశీలిస్తూ పోయి.

సారస్వత సంపత్తివల్ల ఒక భాషకు గౌరవం కలుగడం నిజమే. కాని, అంత మాత్రాన అది ప్రాచీనం. తక్కినవి అర్వాచీనం, అది గొబ్బ, తక్కినవి దిబ్బ అనడం సరికాదు. ఏ భాషా అర్వాచీనం కాదు

నేడు ప్రపంచంలోని ప్రతిమారుమూలలోను కనిపించే అనాది జాతుల భాషలు గూడ కొన్ని సహస్రాబ్దాల క్రితమే వేదాలను నిశ్వసించిన సంస్కృత భాషకు సమకాలికమైనవనే నా నమ్మకం. ఏ దైవదుర్విలసితంవల్లనో, ఏ పరిస్థితులవల్ల పొటమరించిన అనాస్థ వల్లనో, నిశ్చైతన్యం వల్లనో వాటిలో సారస్వతం వికసించలేకపోయి వుంటుంది. అయినా, ఏ అనాదిజాతిభాషా అంతటితో అంతరించిపోలేదు. దీనికి మనదేశంలో నేటికీ మనిన గోండు, సవర, గదబ, తోడా వంటివారి భాషలే ఉజ్జ్వల దృష్టాంతం.

మానవజాతి రక్తంలో, జీవితంలో, జీవనంలో ఇంతగా రంగరించుకొనిపోయిన ఈ భాష పరమార్థం ఏమిటి? భావవినిమయం; మానవుని మనసు మరుగుల లోని తలంపులను వ్యక్తీకరించడం. ఇలాటి భాష పరంపరాగతం కావడంవల్ల దానిపై మానవునికి మక్కువ కలుగడం సహజమే; దానికోసం వాడు ఎంతటి త్యాగానికైనా సిద్ధంకావడం సహజమే; పరులు దానిని దూషిస్తేనో, చిన్నచూపు చూస్తేనో సహించకపోవడమూ సహజమే. 'స్వస్థానవేష భాషాభిమతాః'. కాని, సంగరహితదృష్టితో, దూరదృక్కుతో పర్యాలోచించే వారికి భాష జీవితంలో ఒక అంగమేనని, దాని ప్రయోజనం భావప్రకటనమేనని, అది భావ ప్రకటన కొక సమ్యక్సాధనం మాత్రమేనని, అది భావప్రకటనైక పర్యవసాయి అని, అదే జీవితానికి చరితార్థత కాదని, పరమార్థం కాదని, జీవిత సంపూర్ణతకు, సాకల్యానికి భాషకన్నా మించినది మరొకటి—మానవశ్రేయస్సు, జాతిజీవనపరమార్థం—ఉన్నదనికరతలామలకమవుతుంది.

మానవుని యత్నసాకల్య పర్యవసానం సంఘ శ్రేయస్సు; జాతిజీవన శ్రేయస్సు. ఈ దృష్టితోనే మన ప్రాచీన నీతిశాస్త్రజ్ఞులు

'త్యజే దేకం కులస్యార్థే
గ్రామార్థే తు కులం త్యజేత్,
గ్రామం జనపదస్యార్థే,
ఆత్మార్థే పృధివీం త్యజేత్.'

అన్నారు. జనపదం అనేది మనం నేడు వాడుతున్న జాతి, దేశం అన్న అర్థంలో ప్రయుక్తమైంది. భాష ముఖ్యమా, జాతిజీవనం ముఖ్యమా? అన్నప్పుడు, పై సూక్తి ముక్తాఫలచ్ఛాయ మన మనసులోని మాలిన్యాన్ని తొలగిస్తుందని నా నమ్మకం. జాతి జీవనం అన్నప్పుడు, భారతదేశం ఒక్కజాతేనా? ఎప్పుడు ఇది ఏకజాతిగా వుంది?— మొదలయిన ప్రశ్నలు వేసేవారు లెక్కకు మిక్కిలి.

ఆధునిక సంఘ శాస్త్రజ్ఞుల నిర్వచనంతో ప్రాచీనులు జాతిపదాన్ని ప్రయోగించకపోవచ్చు. కాని, వారి దృష్టి నైకమానవసమాజ మన్నమాట నిజం. నేడు జాతి నిర్వాచకులు జాతికి అవసరమైన ప్రధాన లక్షణాలు నాలుగు అని అన్నారు—ఏకభాష, ఏకసంప్రదాయం, ఏకదేశవర్తనం, చరిత్రసంబంధం. ఇవి మానవ సముదాయాన్ని ఒక్కజాతిగా పరిగణించడానికి ప్రధానాంశాలుగా పేర్కొన్నారు. భారతదేశంలోని భాషలు అసంఖ్యాకం. చరిత్ర కూడా సమానం కాదు. ఏకదేశవర్తనం కూడా వివిధశీతోష్ణ పరిసితులతో కలిగిన విభిన్నజీవిత విధానాలవల్ల గ్రాహ్యంగా కనిపించదు. ఇక మిగిలిన నాల్గవ అంశం సంప్రదాయం—దీనిని సంస్కృతి అని అనుకుందాం. దీనిలో మతం, ఆచార వ్యవహారాలు, పండుగలు పబ్బాలు, సాహిత్యం, శాస్త్రం మొదలయినవన్నీ చేరుతాయి. ఇటీవలి కాలంలో విదేశ మతాలు మనదేశంలో కాలూని కొందరి ఆచార వ్యవహారాలలో మార్పులు తెచ్చినా, మొత్తంమీద కొన్ని సహస్రాబ్దాలుగా మనదేశంలోని వివిధ ప్రాంతాలను ఏక సంస్కృతి పూసల్లో దారంలాగ అనువర్తిస్తూ అనుబద్ధం చేస్తున్నదనడం నిర్వివాదం. వేళ్లమీద లెక్కపెట్ట దగిన కొన్ని ప్రాంతీయాచారాలు వినా, ఆసేతు శీతనగం, ఆకామరూపకచ్ఛం ఏకైక సంస్కృతి వెన్నెలలు వెలార్చిందనడం నిస్సందేహం. సహస్రాబ్దాలుగా ఈ సంప్రదాయ మొక్కటే మనలను ఏకంగా బంధించి వుంచింది. లేకపోతే, ఈ కాశీ రామేశ్వర యాత్రలు, కామాక్షీ విశాలాక్షీ పూజలు వుండేవా? రాజకీయంగా భారతదేశం ఒక్క జాతిగా—నేటి పాశ్చాత్య సాంఘిక శాస్త్రజ్ఞుల దృష్టితో—లేకపోయినా, సంప్రదాయంతో, తత్వ భావనతో ఏక జాతిగా వుంది, వుంటున్నది. స్వాతంత్ర్యోద్యమ ఫలితంగా నేడు రాజకీయంగాను ఏకజాతిగా ఏర్పడింది. మారణాయుధాలు నానావిధాలుగా నానాముఖాలుగా పుట్టుకొని వస్తున్న ఈసమయంలో చిన్నదేశాలు, చిన్నజాతులు మనడం ఎంత కష్టమో ప్రపంచానికి తెలియనిదికాదు. కనుక రాజకీయంగాను ఏకమయిన భారతదేశాని ఇక ముక్క

కాకుండా భద్రపరచుకోడం మనందరికి శ్రేయోదాయకం. ఏమైనా భావప్రకటనైక ప్రయోజనమైన భాషకన్నా సమాజశ్రేయస్సంధాయకమూ, సమాజ క్షేమకరమూ అయిన ఏకజాతి జీవన భావన మిన్న అనడం వివేకవంతులైనవారు హర్షిస్తారు.

అయితే, భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడడం కేవలం భాషాబలంతో కాదా?—అనవచ్చు. నిజమే. భాషా రాష్ట్రాలు పరపరిపాలనలో ఏర్పడిన బహుభాషా రాష్ట్రాలలో జరుగుతున్న అన్యాయాన్ని, పక్షపాతాన్ని, సమతలేని ఏక ప్రాంతాభివృద్ధిని, ఏకప్రాంత ప్రజల అభివృద్ధిని నివారించి, సకల ప్రాంతాలు సమానాభివృద్ధి పొందడానికి, పక్షపాతమో, ప్రత్యేకాభిమానమో లేక సమానావకాశాలతో సమానాభివృద్ధిని పొందించడానికి వుద్దేశించినట్టివి. స్వతంత్రదేశాలు కావడానికి గాని, భారతరాజ్యాంగవ్యవస్థనుండి విడిపోవడానికిగాని ఉద్దేశించినట్టివి కావు. భాషారాష్ట్రాలు ఏర్పడకపోయి నుంచే, నేటికీ కొన్ని ప్రాంతాలు నాలుగు శతాబ్దాల నాటి పరిస్థితిలోనే వుండేవి. భాషారాష్ట్రాల వల్ల భాషపై దురభిమానం, జాతివిచ్ఛేద భావన తొలగిపోయి, తమ ప్రాంతాల అభివృద్ధితో పాటే, తమ భాషల అభివృద్ధితోపాటే జాతి సమగ్రాభివృద్ధి అవసరమనేభావం ప్రజలలో కలిగింది దీనికి కారణం మనదేశంలో నానాత్వంలో ఏకత్వం రంగురంగు పూవులలోని పరిమళంలాగ సొబగులు విరజిమ్ముతూ వుండడమే. మనందరినీ ప్రాక్‌సంస్కృతి, అర్వాక్ రాజకీయ చరిత్ర, పరిస్థితులు, ఏకాకారంగా గుదికూరుస్తున్నందువల్ల, ఏకజాతిగా చేర్చడంవల్ల భాషలూ, భాషలతోపాటు, భాషలకన్నా జాతిజీవనము ముఖ్యమని నిర్ణయించుకోవలసి వుంటుంది.

ఈ దృష్టితో, ఈ ఆలోచనాభూమికతో గడచిన జనవరినెలలో మద్రాసు నగరంలో జరిగిన ద్వితీయ అంతర్జాతీయ తమిళ మహాసభల దృశ్యాలను తిలకిద్దాము.

## తమిళ పరిశోధన సంఘం

భారతదేశంలోను, లంక, మలేషియా, సింగపూర్, ఫిజీ, బర్మా, మొదలయిన విదేశాలలోను తమిళు లున్నారు. ఈ ప్రాంతాలలోని వివిధ విశ్వవిద్యాలయాలు తమిళ భాషా సాహిత్య చరిత్రాది విషయాలలో కృషి చేస్తున్నాయి. రష్యా ఇంగ్లాండు, అమెరికావంటి పాశ్చాత్యదేశాలలోను విదేశభాషాధ్యయనాసక్తులు తమిళభాషలో పరిశోధనలు జరుపుతున్నారు. ఈ పరిశోధన లన్నిటినీ ఏకముఖం చేసి, అభివృద్ధి చేయాలనే దృష్టితో 1964 జనవరిలో— భారత రాజధానిలో 26 వ అంతర్జాతీయ ప్రాచ్య విద్వత్సభ జరిగినప్పుడు—అంతర్జాతీయ తమిళ పరిశోధన సంఘం నెలకొల్పబడింది. ఈ సంఘ యాజమాన్యాన మలేషియా ప్రభుత్వ ప్రోత్సాహంతో 1966 ఏప్రిల్‌లో ప్రథమ అంతర్జాతీయ తమిళ విద్వన్మహాసభ జరిగింది.

మద్రాసులో గడచిన జనవరినెలలో జరిగినది ద్వితీయ అంతర్జాతీయ తమిళ విద్వన్మహాసభ దీనిలో 40 దేశాలనుంచి దాదాపు 600 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. జనవరి 3 వ తేదీనుంచి 10 వ తేదీ వరకు ఈ మహాసభ జరిగింది. జనవరి 3 వ తేదీ సాయంకాలం రాష్ట్రపతి ఈ మహాసభకు ప్రారంభోత్సవం జరిపారు. మద్రాసు విశ్వవిద్యాలయం సెంటినరీహాలులో విద్వత్సభలు, విశ్వవిద్యాలయం పరీక్షా భవనంలో తమిళ సంస్కృతి ప్రదర్శనం, ఐలెండు గ్రౌండ్సులో ప్రాచీన తమిళ నగరం 'పూంపుహార్' పేర నిర్మించిన ప్రత్యేక మంటపసముదాయంలో ప్రజా సామాన్యాన్ని ఆకర్షించే నాటకాది వినోదాలు, ప్రసంగాలు ఏర్పాటుచేశారు. 2 వ తేదీన మెరీనా సముద్ర తీరంలో పలువురు విద్వాంసుల శిలావిగ్రహాలు స్థాపించారు. 3 వ తేదీ సాయంకాలం గొప్ప ఊరేగింపు జరిగింది. దాదాపు 10 లక్షల మంది పాల్గొన్నారు. తమిళ చరిత్రలోని విశేషఘట్టాలను చిత్రించే ప్రదర్శన శకటాలు ఈ ఉత్సవంలో విశిష్టత. తంతి తపాలాశాఖవారు ఈ సందర్భంలో ఒక ప్రత్యేకమైన తపాలా బిళ్లను కూడ ప్రచురించారు.

సెంటినరీ హాలులో విద్వత్సభ రెండు విభాగాలుగా సమావేశమైంది: ఉదయం 9–0 గంటలనుంచి 1–0 గంటలవరకు బహిరంగ మహాసభలు; మధ్యాహ్నం భాష, విజ్ఞాన సాంకేతికశాస్త్రాలు, సాహిత్యం, చరిత్ర—సంఘశాస్త్రాలు, కళాపురాతత్త్వశాస్త్రాలు అన్న ఆరు వర్గాలుగాను, సిద్ధవైద్యం, భాషాస్థిరత్వం, సంగీత

రీతులు, పారిభాషికపదాలు—అన్న నాలుగు ప్రత్యేక వర్గాలుగాను విడిపోయి గోష్ఠులు, చర్చలు. రాత్రి ప్రత్యేక నాటక, నృత్య ప్రదర్శనాలు జరిగాయి. ఆరు రోజుల బహిరంగ మహాసభలకు వరుసగా, ఫాదర్ డాక్టర్ తనినాయగం (మలేషియా విశ్వవిద్యాలయం), డాక్టర్ సునీత్ కుమార్ చటర్జీ (భారత ప్రభుత్వం నేషనల్ ప్రొఫెసర్), ప్రొఫెసర్ ఎ. రోసెట్టి (రుమేనియా), ప్రొఫెసర్ ఎం. మెయిర్ హోఫర్ (ఆస్ట్రియా), డాక్టర్. టి. కె. మీనాక్షి సుందరం (మదురై), డాక్టర్ జె. వి. కె బుట్లె నన్ (చికాగో) అధ్యక్షత వహించారు. ఈ ప్రసంగాలన్నీ ఆంగ్లంలోనే, విడిగా తమిళులోను పరిశోధన ప్రసంగాల శాఖ ఏర్పాటు చేశారు.

## రాష్ట్రపతి మంచిమాట

3 వ తేదీ సాయంకాలం రాష్ట్రపతి డాక్టర్ జకీర్‌హుసేన్ మహాసభకు ప్రారంభోత్సవం జరుపుతూ తమిళ సాహిత్యాన్ని ప్రశంసించారు. తమిళ భాష భారతదేశంలోనేకాక, అన్యదేశాలలోను భాషింపబడుతున్నది గనుక అంతర్జాతీయభాష అని, తమిళులు దిఙ్నాగ, ధర్మపాలులవంటి తార్కికులను, గొప్పతత్త్వవేత్తలను, సంస్కృత కవులను ప్రసాదించారని, సకల విద్యలకు నిలయమైన దేవాలయ వ్యవస్థ తమిళుల వల్ల అభివృద్ధి చెందినదని, తమిళులు సమైక్య పరచే గుణం, పరమత సహనం, ఔదార్యం కలవారని కొనియాడుతూ, తమిళులు తమ ఉజ్జ్వల గతచరిత్రను, సంప్రదాయాన్ని స్మరించి, భాషాభేదాలుమాని, శాంతి రక్షణకు, దేశసమైక్య రక్షణకు పాటుపడుతారని ఆశిస్తున్నామని అన్నారు. రాష్ట్రపతి ప్రసంగంలోని ముఖ్యాంశాలను ఇక్కడ ఉట్టంకిస్తాను.

'తమిళభాష ప్రాచీనమైనది మాత్రమేకాదు, విశాలమైనది. ఈ అంతర్జాతీయ తమిళ మహాసభతోను, సదస్సుతోను నాకు సంబంధం కలుగడం ప్రత్యేక మాన్యతగా భావిస్తున్నాను. ఈ మహాసభకు గల ప్రత్యేకతతోపాటు, మన సంస్కృతిలోని నానాత్వం, దానిలో నిగూఢంగాను, గంభీరంగానువున్న ఏకత్వాన్ని గురించి నాకు గల అవగాహనను గాఢతరం చేసుకొనడానికికూడా ఈ అవకాశం నాకు కలిగించబడినట్లుగా భావిస్తున్నాను. మన భాషలలో తమిళుకు గౌరవమైన స్థానం వుంది. తమిళు ఉత్తర దక్షిణ భారతాలకు బలమైన అనుసంధాన భాషగా రూపొందింది. ఇది మన దేశంలోను, మనదేశానికి వెలిగావున్న దేశాలలోను మాట్లాడబడుతూన్నది. కనుక అంతర్జాతీయభాష. సృజనాత్మకమైన, వ్యాపనశీలమైన ఆగ్నేయాసియా సంస్కృతికి నిధానంగా వున్నది. అందువల్ల ప్రథమ అంతర్జాతీయ తమిళ మహాసభ సదస్సు, మలయా విశ్వవిద్యాలయ మలేషియా ప్రభుత్వాలయాజమాన్యాన కౌలాలంపూర్‌లో జరుగడంలో వింతేమీలేదు. ఈ మహాసభను సదస్సును ప్రారంభించవలసిందని మీరు నన్ను కోరడం వాస్తవికతలో మనం పరస్పరం ఎలా అనుబంధం కలవారమో, సంస్కృతికోసంచేసే పరిశుద్ధమైన న్వేషణ, ఆధ్యాత్మిక సమైక్యం, సమధిక సమైక్య భావాన్ని ఎలా ప్రోదిజేయగలమో నేను మరింత తీవ్రంగాను, నవనవోన్మేషంగాను గ్రహించేట్లు చేసింది.

'తమిళనాడుకు సాంప్రదాయికమైన ఎల్లలు వుండేవి. భౌగోళిక పరిధులకు, సాంస్కృతిక సీమలకు అతీతమైన వీర్యవంతమైన సంప్రదాయం వుండేది. తమిళుడనేభావం ఎక్కడెక్కడ స్థిరపడి వ్యాపించి పారజూచినమేరంతా తమిళనాడుగానే వుండేది. తమిళ భావం ఉత్తరాన హిమాలయాలను, తూర్పున పడమట సముద్రాలను, సముద్రాలకు ఆవల భూములను చూచింది. తమిళులు అరేబియాతోను, ఈజిప్టుతోను, రోముతోను వాణిజ్య వ్యాపారాలు జరిపారు. మన చరిత్రలో లభించే శక్తివంతమైన వణిక్సంఘాల పేర్లు వాటి అంతర్జాతీయ లక్షణానికి సూచికలు. ఆళ్వార్ల ప్రాచీన పాశురాలలో పల్లవ చక్రవర్తుల మామల్లపురం ఓడరేవులో విలువగల సరకులతో లంగరువేసిన ఓడల ప్రస్తావన వుంది. సుమాత్రాలో లభించిన ఒక 11 వ శతాబ్ది తమిళ శాసన శకలాలు తమిళనాడుకు, ఆగ్నేయాసియా దేశాలకు మధ్య వాణిజ్యం కొనసాగుతుండేదని సూచిస్తున్నాయి. తమిళరాజుల నౌకాబలం హిందూమహాసముద్రంలో ప్రాబల్యం వహించింది. నౌకాయుద్ధంలో ప్రసిద్ధిచెందిన రాజేంద్రచోళునికి చైనా చక్రవర్తితో దౌత్య, వాణిజ్య సంబంధాలు వుండేవి. కొన్ని శతాబ్దాలకుముందు, పాశ్చాత్యదేశాలతో వాణిజ్య ప్రయో

జన సంబంధంగా ఒక పాణ్డ్యరాజు రోమక చక్రవర్తి అగస్టస్‌కు దౌత్య ప్రతినిధివర్గాన్ని పంపాడు. సరిహద్దులకు ఆవల చూచే అలవాటున్న ఈ తమిళులు మంజీరాన్ని ఎంతో ఆదరంగా చూచారు. ఒక చేరరాజు సతీదేవి ఆలయాన్ని నిర్మించదలచి హిమాలయాలనుంచి ఒక శిలను పవిత్రగంగాజలాలలో ముంచి పవిత్రీకరించి తెప్పించినట్లు మన కొక గాధ వుంది.

'తమిళభాషా సంస్కృతులను గురించి విద్వాంసులకు తెలియని విషయం నేను చెప్పగలిగినదేమీ లేదు. అందరికి తెలిసినది నేను మళ్లీ చెప్పడం ఒక గొప్ప సంప్రదాయాన్ని ప్రశంసించడానికి మాత్రమే. ఈ సంప్రదాయం రెండువేల ఏళ్ల క్రిందట సంగం సాహిత్యంతో పుట్టింది.

ం సంపన్నమైనది. ప్రతిభావంతమైనది. శతాబ్దాల అభివృద్ధి అందు గోచరిస్తుంది. అప్పటి కురళ్ ఐహిక ఆముష్మిక విజ్ఞాన సర్వస్వం. కంబ రామాయణం మహోత్కృష్టమైన గ్రంధం. ప్రపంచ సాహిత్యంలోనే దానికి ఉన్నతస్థానం వున్నదని చెప్పవచ్చు. వర్తమానకాలమూ గొప్పదే. ఎందరో కవులు, ఎందరో నవలా రచయితలు వున్నారు. మహాకవి శ్రీ సుబ్రహ్మణ్య భారతిని గురించి చెప్పనవసరంలేదు.

'తమిళులు తమ భాషను పెంపొందించుకొనడమేగాక, సంస్కృతాన్ని అభ్యసించడంలోవున్న ఆవశ్యకతను గూడా గుర్తించారు. ఈ ఆవశ్యకత విషయం ఎట్లావున్నా, తన ప్రతిభను బహుముఖీనంగా పండింపచేసుకొనడం తమిళుని యొక్క లక్షణం. కులశేఖరఆళ్వారు తమిళంలో పెరుమాళ్ తిరుమొళి అన్న ఉద్గ్రంథం వ్రాశారు. సంస్కృతంలోను వ్రాశారు. ఆయన సంస్కృతంలో వ్రాసిన ముకుందమాల గొప్పస్తోత్రం. రామానుజులు సంస్కృతంలో ఆండాళ్ ఆనందానికి, నమ్మాళ్వార్ తత్వపద్ధతికిని రూపం ఇచ్చారు.

''మతానికి, తత్వశాస్త్రానికిగూడా తమిళులు చేకూర్చిన ఔన్నత్యం ప్రశస్తమైనటువంటిది. ఇచ్చట తమిళుల హృదయవైశాల్యము, వారి తాత్త్వికప్రశస్తి ఎవరినైనా ఆశ్చర్యచకితులను చేస్తాయి. శైవము, వైష్ణవము, అద్వైతము, ద్వైతము ఈ అన్నింటిలోను తమిళులు తమ ప్రతిభా ప్రాభవాలు ప్రదర్శించారు. కుందనాచార్యులు దక్షిణదేశంలో జైనానికి పునాదులు వేయడమేగాక, జైన త్వంలో అతిరథులలో ఒకరనిగూడా ప్రసిద్ధికెక్కారు. ద్ధంలో విజ్ఞానవాదాన్ని దిఙ్నాగుడు, ఆయన శిష్యుడు ధమ్మపాలుడు ప్రపంచించినారు. వారు నలందలో పాఠాలు చెప్పారు. కాని వారు కాంచీపురానికి చెందిన వారు. ఆ కాంచీపట్టణంనుంచే జెన్ బౌద్ధ ప్రవక్త అయిన బోధిధర్ముడు బయలుదేరాడు. ఇస్లాముమ గురించికూడా తమిళంలో గ్రంధం వుంది వోమర్ అనే తమిళకవి సీరా పురాణం అన్నపేరుతో మహమ్మద్ పైగంబరుని జీవితాన్ని క్యావంగా వ్రాశారు.

''సంస్థలను నిర్మించడంలో తమిళుల శక్తి సామర్థ్యలు మెచ్చదగినవి. పౌరసంఘాల విషయం చెప్పడం అనవసరం. ఉన్నత విద్యలకు సంబంధించిన అనేక సంస్థలను తమిళుల నిర్మించారు తమిళుల తత్వం ఐక్యలక్షణం కల్గినది. సర్వజనీనత వారి తత్వంలో నిబిడమై గోచరిస్తుంది. కురళ్‌లో ఈ వాక్యాలు వున్నాయి—ఘాతకుని ఆనందం ఒక్కరోజు కన్నా ఎక్కువ నిల్వదు. కాని శాంతివాది ఆనందం ఎల్లకాలం నిలుస్తుంది. ఉపవాసాలు, తపస్సు చేసేవాళ్లు గొప్పవాళ్లు. కాని ఒకరు చేసిన తప్పులను క్షమించేవాళ్లు ఇంకా గొప్పవాళ్లు. అపకారం చేసినవానికి ఉపకారం చేయడం ధర్మం. ఇది ఉత్తమ ధర్మం.

''మహాకవి సుబ్రహ్మణ్య భారతి భారతదేశాన్ని గురించి గొప్పగా ఆలోచించాడు. భారతదేశంలో సంకుచిత్వము, రాష్ట్రదురభిమానము, భాషాభేదాలు పనికిరావని, భారతదేశంనుంచి మానసికజాడ్యాన్ని, తాత్సారాన్ని బహిష్కరిస్తానని అన్నాడు. ఈ రోజునే గనుక ఆయన వుండివుంటే, ఆయన ఏమి అనుకునేవాడో? ఆయన హృదయం ఎంత నిరసనతో నిండేదో, లేక దుఃఖంతో క్రుంగేదో? తమిళులు మానవీయవాదులు. విశాలమైన హృదయము, సామ్య ధనసంపత్తి కలవారు. దాన్ని కాదనవలసిందని తమిళులకు చెప్పేవాడా? ఆత్మ విశ్వాసాన్ని పెంచడంకోసము, ఆ ఉత్తమ సంప్రదాయాన్ని మంత్రదండమువలె విని యోగించేవాడా? తమిళులను తమలో తాము కల

హించుతూ వుండమని చెప్పేవాడా? లేక తమ ఆత్మసాక్షాత్కారాన్ని అఖిల భారత జనత ఆత్మ సాక్షాత్కార సాధనంగా పాటించి] పనిచేయమని బోధించేవాడా?''

## తమిళే అనుసంధాన భాష కావాలని మద్రాసు ముఖ్యమంత్రి

ఈ ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ అణ్ణాదురై తమిళభాష యావద్భారతదేశానికి అనుసంధానభాష కాగల సమయం దూరంలో లేదన్నారు. 'తమిళభాష తన సాహిత్య బలంతో పలువురు విదేశ విద్వాంసులను ఆకర్షించింది. కాని, భారతదేశంలోని ఇతర ప్రాంతాలవారు ఈ భాషను నేర్చుకొనకపోవడం విచారకరం. తమిళుల సంస్కృతి వైభవం గొప్పది. తమిళులు ఇతరులతో మైత్రిని కోరేవారు; ఇతరుల భాషలను గూడ గౌరవించేవారు. ఇతర సాహిత్యంలోని మేలిమిని సొంతం చేసుకొనడానికికూడా జంకరు. కాని, తమిళుకు వుండవలసిన న్యాయమైన, గౌరవమైన స్థానాన్ని నిరాకరిస్తేమాత్రం వారు సహించరు' అని అన్నారు.

తొలినాటి మహాసభలో ప్రొఫెసర్ జీన్ ఫిల్లోజట్ (పారిస్) 'పురాతత్త్వశాస్త్రం—తమిళ పరిశోధన' గురించి, ప్రొఫెసర్ కె. కె. పిళ్లె (మద్రాసు విశ్వ విద్యాలయం) 'తమిళనాడు చరిత్రలో ప్రధాన ఘట్టాలు' గురించి ప్రసంగించారు.

## పురాతత్త్వ పరిశోధకుల పెన్నిధి తమిళగం

ఫిల్లోజట్ ప్రసంగంలోని ప్రధానాంశా లివి:— తమిళనాడులోని పురాతత్త్వ స్థలాలు పరిశోధకులకు విస్తృతఫలితా లిచ్చే రంగాలు. తమిళుల ప్రాచీన వైభవం సంపూర్ణంగా ప్రపంచానికి తెలియడానికి తమిళనాడులో లభించే పురాతత్త్వ విషయాల పరిశీలన ఆధునిక కాలపు అభివృద్ధితోపాటు జరుగాలి. అంతరించిపోయిన ప్రాచీన ఈజిప్టు, మెసపొటేమియా నాగరకతలవంటి నాగరకతల అధ్యయనంలో పరిశోధకులు పురాతత్త్వ విషయాలపైనే ఆధారపడవలసివుంటుంది. తమిళ నాగరకత జీవించివుంది. తమిళుల విషయంలో అలా చేస్తే, ప్రజలకు అన్యాయం చేసినవారమవుతాము. ప్రాచీన పురాతత్త్వ పద్ధతులను ఈ విషయంలో అనుసరించడంకాక పురాతత్త్వాన్ని, ఇప్పటి అభివృద్ధిని, సాహిత్యాన్ని సమన్వయపరచాలి.

''పరిశోధనలో శాసనాలు చాలా ముఖ్యం. ప్రాచీన స్థలాలలోని కుడ్యాలవిూది శాసనాలు, కాంస్య, తామ్ర శాసనాలు అసంఖ్యాకంగావున్న ప్రాంతం తమిళనాడు. వీటిలో చాలవాటిని ఇంకా పరిశోధించవలసివుంది. మానవజాతి శాస్త్ర పరిశోధనకూడా కొన్ని పురాతత్త్వ సమస్యల పరిష్కారానికి తోడ్పడుతుంది. ప్రాచీన తమిళులు భారత సంస్కృతిని సముద్రాంతరాలు దాటించి ఇండోనీషియా, ఇండోచైనా, చైనావంటి దూరప్రాచ్యదేశాలలో వ్యాపింపజేయడానికి మహాసేవ చేశారు. ఈ దేశాలలో చారిత్రకస్థలాలు, శాసనాలు తమిళ ప్రభావంగలవి వున్నాయి. వాటిలో సంస్కృతంవి చాల ప్రాచీనమైనవి.

''తమిళులు తరచు సంస్కృతంలో శాసనాలు వేయడానికి కారణం, ఇంగ్లీషు పారసీభాషలకుముందు సంస్కృతం భారతదేశంలోని వివిధప్రాంతాల ప్రజలకు, భారతీయులకు విదేశీయులకు మధ్య అనుసంధాన భాషగా వుండేది గనుక. తమిళులు తమిళులోను, సంస్కృతంలోను రచించిన సాహిత్య గ్రంథాలను తులనాత్మక దృష్టితో పరిశీలించాలి. ఈ భాషలు రెండూ పరస్పరం ఆదానప్రదానాలు చేసుకుంటూనే వున్నాయి.

''భూమిలో పూడుకుపోయిన చారిత్రకాధారాలను కనుగొనడానికి సూక్ష్మమైన కొత్త యంత్రాలు కనుగొనబడినవి. వీటిని ప్రాచీన చోళ నగరం కావేరిపూంపట్టిణంలోను, ఇతర ప్రాంతాలలోను వుపయోగించి పరిశోధనలు జరుపబడ్డాయి.''

## సంగం యుగం విశిష్టత

ప్రొఫెసర్ కె. కె. పిళ్లె 'తమిళ చరిత్రలో ప్రధాన ఘట్టాలు' అన్న పరిశోధన వ్యాసంలో తమిళనాడులో అన్ని కాలాలలోనూ శతాబ్దాలుగా అన్నిరంగాలలోనూ గణనీయమైన అభివృది జరిగిందన్నారు.

''ప్రాచీన తమిళులు ఎక్కడివారో చెప్పలేము. వారు దక్షిణ భారతపు అనాదివాసులో? వెలుపలినుంచి వలసవచ్చినవారో? — నిర్ణయించలేకున్నాము. కాని

తమిళచరిత్ర నిస్సందేహంగా సంగంకాలంనుంచి కనిపించే తమిళసాహిత్య భండారంనుంచి ప్రారంభ మైనదనవచ్చు. సంగం సాహిత్యంలోని చాలభాగం క్రీస్తుశకం తొలిశతాబ్దంనాటిదని ఇప్పుడు నిరూపితమైంది. సంగం యుగంలోని విలక్షణతలు స్థిరమైన సంఘవ్యవస్థ, సరళమైన సాహిత్యాభివృద్ధి.

"క్రీస్తుకు ఐదుశతాబ్దాలకు చాల ముందుగా ఆర్యులు దక్షిణభారతం అగ్రప్రాంతాలకు రాలేదు. సంగం సాహిత్యంలో కుల వ్యవస్థ సూచన లున్నాయి. కాని అంతమాత్రాన చాతుర్వర్ణ్య వ్యవస్థ ఆయుగంలో వ్యాప్తిలో వుందనడానికి అవకాశం లేదు. విద్యను మతంతో యోజించారు. ఏమైనా సంగం కాలంనుంచి నేటివరకు సాంఘిక జీవితం తీవ్రమైన మార్పులకు గురి కాలేదు. ఇటీవల సమష్టి కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నమయింది. సంగంసాహిత్యం ప్రాచీనతమిళుల మహా వైభవయుగం. తర్వాత గూడ గొప్ప యుగాలు వెలిశాయి. తమిళుల ప్రోత్సాహంతో కళలు విశేషంగా అభివృద్ధి చెందాయి." ఇది ప్రసంగ సంగ్రహం.

శ్రీ కె. వి. రమణి (భారత పురాతత్త్వశాఖ) పురాతత్త్వ శాఖవారి త్రవ్వకాలవల్ల తెలిసిన కొన్ని తమిళనాడు ప్రాచీన కళలు, చేతిపనులు గురించి ప్రసంగించారు. క్రీస్తు పూర్వం 300 నుంచి క్రీస్తు తర్వాత 300 సంవత్సరాల వరకు గలకాలంలో కనిపించిన వృత్తులను, కళలను ఆయన తెలియజేశారు. ఈ ఆరు శతాబ్దాలలోను తమిళ కళాకారులు; హస్తకళా కుశలులు ఉన్నత నైపుణిని సంపాదించి నట్టు తెలుస్తున్నదన్నారు. పింగాణీ పరిశ్రమ క్రీస్తుకు 300 సంవత్సరాలకు పూర్వమే తమిళులకు తెలుసునని, పుహార్‌నగరం త్రవ్వకాలలో వెలువడిన పెద్ద ఇటుక కట్టడాలనుబట్టి వారికి వాస్తు శాస్త్రం, శిలాయుగంలోనే ఇనుము కరగించడం తెలుసునని, రాగిపాత్రలు, నాణేలు, బంగారు నగలు నిర్మించడం తెలుసునని అన్నారు. ఇవన్నీ ప్రాత శవపేటికలలో కనిపించాయని అన్నారు.

శ్రీ ఆర్. రమణి (సింగపూర్) ప్రాచీన తమిళ నగరాలను గురించి ప్రసంగించారు. ప్రాచీన తమిళ నగరాలు గ్రీసు రోమక నగరాలతో పోల్చినప్పుడు ఉత్తమ నాగరికతను ప్రదర్శించాయని, గ్రామరక్షక దేవతలతో దివ్యస్థాయినికూడా నాగరికతకు కల్పించాయని అన్నారు. నగరాన్ని శాంతిభద్రతలను, రాజరికాన్ని రక్షించడానికి వీలుగాను, సంపూర్ణ జీవితానికి అవకాశం కల్పించే విధంగాను నిర్మించేవారని తెలిపారు.

## వేట్చి—గోగ్రహణం

సంగంకాలంలో వేట్చి (గోగ్రహణం) అనేది ఒక యుద్ధ ప్రక్రియ అని శ్రీ వి. అరుణాచలం (కౌలాలంపూర్) ప్రసంగించారు. కయ్యానికి కాలు దువ్వడానికి ఒక వర్గంవారు తమ శత్రువుల ఆవులను రాజులకు తెలియంకుడా పట్టుకుంటారు. ఇలాటి ఇతివృత్తాలు సంగ( వున్నాయి—అన్నారు.

సిలంబం—కర్రసాము ప్రాచీన తమిళరాజుల కాలంలో చాల జనప్రియమైన విద్య. ఇది తమిళ నాడులో నేటికీ జనప్రియంగా వు-ది—అని మరొకరు ప్రసంగించారు.

## ఋష్యశృంగగాథ—గోండుల ఆచారావశేషం

డాక్టర్ హెర్మన్ బెర్గర్ (పశ్చిమ జర్మనీ) 'రామాయణంలోని ఋష్యశృంగగాథ—ద్రావిడుల వర్షాపురాణం' అనే వ్యాసం చదివారు. 'ఋష్యశృంగగాథ అందరికీ తెలిసిందే. ఋష్యశృంగుని తండ్రిపేరు విభాండకుడు. కాని ఈ మాట వర్షాదేవత పేరయిన సమస్తపదం బీర్‌బెంట అనేదాని సంస్కృతీకరణం. కురుఖ్, భామ్‌టీ, సంతాలీ ఆదిమజాతి భాషలలో నేడు కనిపించే బీర్బంట, బీర్‌వెండు, బీర్‌పెండు అనే పదా లున్నాయి. గోండిభాషలో పిర్, పిఉ్ అంటే వాన. తమిళులో పెయ్. పర్జి, వెడిడ్, వెడిన్, వెణు, పెండు, పెన్ అనేవి గోండి, కుఇ భాషలలో దేవతావాచకాలు. బర్‌పెండుక్—వర్షాదేవత. ఇది సంస్కృతంలోని విభాండక శబ్దానికి సదృశంగా కనిపిస్తుంది. నేటికీ గోండులు వర్షంకోసం—విర్పెండుక్కు, బిబ్జెంజా, బిబెంజా—వర్షాదేవతను బలితో పూజించడం ఆచారం. కనుక ఋష్యశృంగగాథ

నేటికీ గోండులలో మిగిలిన అనాది వర్ణాదేవతారాధనకు సంకేతం'—

## భరతనాట్య శాస్త్రంపై తొల్కాప్పియం ప్రభావం

మరొక కుతూహల జనకమైన ప్రసంగం 'భరతనాట్య శాస్త్రంపై తొల్కాప్పియం ప్రభావం' అని డాక్టర్ ఎన్. వి. రాజగోపాలన్ (ఆగ్రా) చేసింది. 'అతి ప్రాచీన తమిళ వ్యాకరణ గ్రంథమైన తొల్కాప్పియంలో 'నాట్య' ప్రస్తావన వున్నందున తొల్కాప్పియ కర్త భరతనాట్య శాస్త్రంనుంచి పెక్కు భావాలు గ్రహించాడని ఇదివరకూ అనుకునేవారు. కాని, పెక్కు కారణాలవల్ల భరతనాట్య శాస్త్రం తొల్కాప్పియం కన్నా అర్వాచీనమని నిర్ధారిత మయినందున భరతనాట్య శాస్త్రం తమిళ అలంకార శాస్త్రమయిన 'అగప్పొరుళ్ ఇలక్కణం' అనుసరించి రచితమయింది. నఖకుట్టు, (నహ్హై కుట్టన్), కృశాశ్వ (ఇల్లం పరియన్) వంటి భరతాచార్యుల పేర్లు ద్రావిడ పదాలుగా తోస్తున్నాయి. కావ్యాదర్శకారుడు, శృంగార ప్రకాశ, సరస్వతీ కంఠాభరణకారుడు, కావ్య మీమాంసాకారుడు కూడా తమిళ పారిభాషిక పదాలను సంస్కృతీకరించారు.' ఇదీ వీరి వాదం.

డాక్టర్ పెంటి ఆల్టో (ఫిన్‌ల్యాండ్) ఫిన్నో—ఆర్జియన్ భాషల పదాలకు, ద్రావిడ పదాలకు గల పోలికలను గురించి ప్రసంగించారు 'వీటి పరిశీలనవల్ల ఉరలో—ద్రావిడ భాషల కొక ఆధారభూమిక కనిపించవచ్చు. ద్రావిడ ప్రాగైతిహాసికతను గురించిన ఆధునిక సిద్ధాంతాలు ద్రావిడులకు, ఔత్తరాహులకు గల ప్రాచీన సంబంధాలను నిరూపించవచ్చు. ఈ భాషలకు, ప్రజలకు ఉత్పత్తి సమానమైనదీ కావచ్చు'

డాక్టర్ రాబర్ట్ అస్టర్‌లిట్జ్ (అమెరికా) ద్రావిడ భాషలకు, యూరేషియాలోని యూకాగిర్, ఆల్టాయిక్ భాషా కుటుంబాలకు గల పోలికలను తెలిపారు.

డాక్టర్ ఎం. అంద్రోనోవ్ (రష్యా) ద్రావిడ—యూరేలియన్ సదృశ పదాల స్వభావం తెలియజేశారు.

రెండవనాటి సమావేశంలోని ప్రధాన ప్రసంగాల సారాంశమిది: బహిరంగ సభకు అధ్యక్షత వహించిన డాక్టర్ సునీతి కుమార్ చటర్జీ తమ ప్రసంగంలో 'క్రీస్తు శకం ప్రారంభకాలంలో వెలువడిన తొల్ కాప్పియం కాలంనుంచీ తమిళ విద్వాంసులు తమిళ భాషాశాస్త్ర జిజ్ఞాస చేస్తూనే వున్నారు. పాశ్చాత్యులు తమిళభాషాధ్యయనం చేయడం 17 వ శతాబ్దంనుంచి ప్రారంభమయింది. నేటి భారతీయ నాగరికతలో సగం ద్రావిడం. సంస్కృతం ద్రావిడజాతుల ప్రభావంతో ఎంతో మారుతూ వచ్చింది. దాదాపు నాలుగైదువందల ద్రావిడపదాలు సంస్కృతంలో చేరిపోయాయి. 2,500 సంవత్సరాలుగా ఈ సమన్వయం జరుగుతూ వచ్చింది అందువల్ల 7 వ శతాబ్ది తమిళ శైవభక్తుడొకడు అన్నట్టు 'నీవు తమిళుడవు' నీవు ఆర్యుడవూను. తమిళు వర్ధిల్లాలి, సంస్కృతమూ వర్ధిల్లాలి అన్నారు.

## మానవనాగరకతా వికాసంలో దక్షిణాపథం వ్యక్తిత్వం

డాక్టర్ హెచ్. డి. సంకలియా (పూనా విశ్వవిద్యాలయం పురాతత్త్వశాఖాచార్యుడు) 'దక్షిణాపథంలో నాగరకతా ప్రారంభం'పై వ్రాసిన ప్రసంగం పఠించబడింది. దానిలోని ముఖ్యాంశాలివి:

'రాయచూరునుంచి రామేశ్వరంవరకు దక్షిణాపథంలో జరిగిన పురాతత్త్వశాఖ తవ్వకాలలో కనిపించిన వివిధదశల నాగరికతా చిహ్నాలనుబట్టి, కర్నూలుజిల్లా గిద్దలూరు, అనంతపురంజిల్లా పాలవాయి, చిత్తూరుజిల్లా రాళ్లకాలవ మొదలయిన ప్రాంతాలలోను, దక్షిణ భారతంలో ఇతరత్రాను లభించిన సమాధులు, ఆయుధాలు, కుటీరాల అవశేషాలు, మొదలయిన వాటినిబట్టి దక్షిణభారతంలో మానవనాగరికత క్రీస్తుకు 2000 సంవత్సరాలకు పూర్వమే విశిష్టరూపానికి వచ్చింది, సింధుతీర నాగరికత స్థానిక పరిస్థితులనుబట్టి రూపు తీర్చుకున్నట్టే దక్కన్ దక్షిణభారత మానవుడు కూడా తన ప్రకృతి పరిసరాలకు అనుగుణంగా నాగరికతను రూపొందించుకున్నాడు. ఈవిధంగా ప్రకృతిమానవసంఘం ప్రాచీనతమ దక్షిణాపథ సంస్కృతులకు ప్రత్యేకత కల్పించాయి.

'ఇటీవల నా సహచరులు డాక్టరీ జడ్. డి. అన్సారీ, శ్రీ రామిరెడ్డి అనంతపురంజిల్లా పాలవాయిలో కనుగొన్న భస్మపు గుట్టలను పరిశీలించడంవల్ల తేలిన

దేమిటంటే ఇవి కేవలం పిడకల బూడిదగుట్టలు కావని, ఇనుము కరగించే కొలుముల స్థానాలని తోస్తుంది. ఈ విషయం స్థిరపడితే దక్షిణభారతంలో పెద్దయెత్తున ఇనుము కరిగించే కొలుములు వుండేవనడం రుజువవుతుంది.''

శ్రీ సంకలియా దక్షిణాపథ ప్రాచీన మానవుని నాగరికతను ఆరుదశలుగా పేర్కొని, అతనికి లిపి జ్ఞానం వుందనికూడా నిరూపించారు. అశోకుని శాసనాలు మస్కి, బ్రహ్మగిరి, కొప్పల్‌లలో వున్నాయని, అవి లిపిజ్ఞానంగలవారికోసమే గాని, లేనివారికి కాదని, కనుక అతనికి లిపిజ్ఞానం వుందని భావించవచ్చునని ఆయన నిర్ణయం.

మద్రాసు విశ్వవిద్యాలయం పురాతత్వ శాఖాచార్యుడు డాక్టర్ టి వి. మహాలింగం 'తమిళ నాడులో వాస్తుకళా వికాసం' గురించి ప్రసంగించారు.

డాక్టర్ కె. కైలాసపతి (లంక) తమిళ వీర గాధా సాహిత్యాన్ని హోమర్ కవితతో పోల్చారు. తమిళ వీరగాథా యుగాన్ని కాలదృష్టితో సుమేరియా, గ్రీక్, ఇండో — ఆర్యన్ వీరగాథాకాలం తర్వాత పేర్కొనవచ్చునని అన్నారు.

శ్రీ నొబొరూ కరాషిమా (టోక్యో) 'చోళుల పాలనలో అధికార వ్యవస్థ' పై ప్రసంగించారు. చోళ సామ్రాజ్యం మండలాలు, వలనాడు, నాడు అని విభక్తమై వుండేదని, నాడు అనే ప్రతి విభాగానికి పరిపాలక సభ వుండేదని, ఈ నాడులు చాలవాటిలో బ్రహ్మదేయ (అగ్రహారాలు) గ్రామాలు రెండు మూడు వుండేవని, అవి పరిపాలనలో చాల ప్రాముఖ్యం వహించేవని తెలిపారు.

## భూస్వామ్యంపై తిరుగుబాటు

'చోళ సామ్రాజ్యంలో భూస్వామ్య వ్యవస్థ — తిరుగుబాట్లు' అనే విషయమై శ్రీ ఎన్. వానమామలై (పాలయంకోట్టై) ప్రసంగించారు. చోళరాజులు 'వళ్లన్ వగై' భూములను 'బ్రహ్మదేయం', 'దేవదానం' భూములుగా మార్చడంవల్ల సంఘంలో కలిగిన మార్పులను చరిత్రకారులు ఉపేక్షించారు. ఈ పద్ధతి నిజంగా కర్షకుల అధికారాన్ని తొలగించింది. కర్షకులు తమ మనుగడ కోసం భూస్వామ్య వ్యవస్థపై తిరుగుబాటు చేయవలసి వచ్చేది. ఈ తిరుగుబాటు పన్నులను ఎగవేయడం, భూముల అధికార పత్రాలను ధ్వంసం చేయడం, ఆత్మహననం, పోరాటం మొదలయిన నానా రూపాలలో జరిగేది. ఇవన్నీ శాసనాలలో కనిపిస్తున్నాయి. ఈ తిరుగుబాట్లవల్ల ఫలం కొద్దిగానే వుండేది. కర్షకులను సంతృప్తిపరచడానికి చోళప్రభుత్వం కొద్దిగా సౌకర్యాలు కలిగించేది. తర్వాత కొన్ని శతాబ్దాలవరకు సంఘ వ్యవస్థ యథాతథంగానే వుంది—అని ఆయన వాదం.

## దక్షిణ ద్రవిడ భాషావర్గం

ప్రాగ్‌లోని కారోలైన్ విశ్వవిద్యాలయం ద్రావిడ, తమిళశాఖాచార్యుడు డాక్టర్ కామిల్ జ్వెలెబిల్ తృతీయ దిన మహాసభలో దక్షిణ ద్రవిడ భాషావర్గం అనబడే ద్రావిడభాషల సంబంధాన్ని చర్చించే పరిశోధన వ్యాసం చదివారు. ఈ వర్గంలో తమిళు, మలయాళం, కన్నడభాష, మూడు చిన్నభాషలు—తోడ, కోట, కొడగు చేరుతాయి. దక్షిణ ద్రవిడ భాషావర్గంలోని భాషలు తమిళుగాను, కన్నడంగాను విడిపోవడం క్రీస్తుకు 400 సంవత్సరాలకు పూర్వం జరిగివుంటుంది, తమిళ, మలయాళాలు తర్వాత 12 వ శతాబ్దంలో విడిపోయివుంటాయి: ఇది ఆయన వాదం పీఠిక. సిద్ధాంతం ఇది :

'తుళు దక్షిణ ద్రవిడవర్గానికి చెందినది కాదు. ఇది మధ్య ద్రవిడభాషావర్గానికి చెందింది కావచ్చు. తెలుగు మూలస్వరూపాన్నిబట్టి మధ్య ద్రవిడభాషావర్గానికి చెందింది. దక్షిణ ద్రవిడభాషావర్గానికి చెందిన భాషల పరస్పర సంబంధం, సమానపదాల సాదృశ్యంలోని తరతమభావాన్నిబట్టి గుర్తించవలసి వుంటుంది. ఇది ఇంకా అస్పష్టంగానే వుంది.

'ప్రాక్ తోడా, ప్రాక్ కొడగుభాషల ప్రజలు ప్రాక్ తమిళభాషా ప్రజలనుంచి క్రీస్తుశకానికి పెక్కు శతాబ్దాలకు ముందుగానే విడిపోయి వుండాలి. కొడగు తోడాభాషకన్నా తమిళుతో హెచ్చు సన్నిహిత సంబంధం కలది. అంతేకాక కొడగుకు, తోడాకు గాఢమైన వ్యాకరణ సంబంధం వుంది. తోడా—కోటా భాషావర్గం ప్రాక్ తమిళునుంచి విడిపోయిన కాలాన్ని పరిశోధకులు కచ్చితంగా నిర్ధారించారు.

'దక్షిణ ద్రవిడభాషావర్గపు మొట్టమొదటి మహత్తరమయిన చీలిక ప్రాక్ తమిళ—ప్రాక్ కన్నడ భాషా దశలమధ్య సంభవించి వుంటుంది. కాని ప్రధాన ప్రాక్ దక్షిణ ద్రవిడ భషల వెన్నెముకమాత్రం ఒక్కటే.

'క్రియా పద్ధతిలో గాఢమైన, ప్రాచీనమైన సంప్రదాయం కన్నడాన్ని తక్కిన దక్షిణ ద్రావిడ భాషావర్గంనుంచి వేరుచేసింది. ఇది క్రీస్తుకు దాదాపు 250—300 సంవత్సరాలముందు జరిగి వుండాలి.

## తమిళ మలయాళాలు మూలంలో ఒక్కటే

'తమిళ భాషా వికాసంలో ప్రాచీన మధ్య దశ అనబడే దశలో తమిళ మలయాళాలు బహుశా ఒకే భాషగా వుండివుంటాయి. ప్రాక్ మల యాళం అప్పటి ఉమ్మడి తమిళ— మలయాళభాషకు పశ్చిమప్రాంత మాండలికంగా వుండివుంటుంది. ఇప్పుడు ప్రధానమైన సమస్య దక్షిణ ద్రవిడ భాషలు విడిపోవడం ఎప్పుడు జరిగిందో, ఈ విశ్లే షానుక్రమణిక ఏమిటో

'తమిళభాషలో లభించిన మొట్టమొదటి శాస నాలు పల్లవులకాలంవి. వీటికాలం క్రీసు శకం 550 ప్రాంతం. ఈ శాసనాలభాష సమకాలిక సాహిత్య భాషతో చాలవరకు తుల్యంగా వున్నప్పటికీ, సమ కాలిక వ్యావహారిక తమిళ ప్రభావంకూడా దీనిలో హెచ్చుగా పడినట్టు తోస్తుంది.

'ఆధునిక సాహిత్య తమిళభాష రచనా విధాన మంతా క్రీస్తుకు మూడు శతాబ్దాల పూర్వపు తొలి వ్యాకరణ పద్ధతిలోనే వుంది. అందువల్ల తమిళు పూర్తిగా ప్రాచీన పద్ధతిని మార్చుకొననిది.

'క్రీస్తుకు పూర్వం 200 నుంచి క్రీస్తుశకం 50 వరకువున్న కాలంనాటివని భావించబడే బ్రాహ్మీ గుహా శాసనాలభాష బహుశా తమిళు మాతృభాషకాని రెండు భాషలు మాట్లాడేవారు వాడిన కృత్రిమ బౌద్ధ జైన పరిభాషాయుతం కావచ్చును. అందువల్ల తమిళభాషా వికాసంలో ప్రాక్‌సాహిత్య, ప్రోటో తమిళు దశలు రెండింటిని ఊహించడం ప్రయోజనకరం.'

## తమిళ్ బ్రాహ్మీ శాసనాలు

భారత ప్రభుత్వం ఆహారశాఖ ఉపకార్యదర్శి శ్రీ ఐరావతం మహాదేవన్ సంగంకాలపు తమిళ బ్రాహ్మీ శాసనాలను గురించి పరిశోధన వ్యాసం చదివారు. ఈయన తమిళ బ్రాహ్మీ శాసనాలలో పరిశోధన జరిపినట్టివారు. ఈ విషయంలో ఈయనే మొదటివారు. ఈ శాసనాల పరిశోధనవల్ల ఈ శాసన భాష సంగంకాలపు భాషతో సదృశంగా వున్నదని నిర్ధారణ అయింది. తమిళంలో వ్రాత క్రీస్తుకు పూర్వం రెండవ శతాబ్దంలో వున్నట్లు ధ్రువపడింది.

తమిళ సంఘంలో వృత్తులు చాలవరకు ఆనువంశికంగా ఉన్నప్పటికీ కుల వ్యవస్థ అనేది లేనట్లు శాసనాలవల్ల స్పష్టమవుతున్నదని ఆయన తన వ్యాసం వివరించారు.

డాక్టర్ సి. హెచ్. థామస్ 'అల్పసంఖ్యాకుల భాష మనుగడ' అనే విషయమై ప్రసంగించారు. ఇంగ్లండులో శతాబ్దాలుగా ఇంగ్లీషు పెత్తనంవల్ల వేల్ష్ భాషకు సమానప్రతిపత్తి లేక వేల్ష్‌భాష మాట్లాడేవారి సంఖ్య క్రమంగా ఎలా తగ్గిపోతున్నదీ, వేల్ష్ వ్యావహారికానికి, గ్రాంధికానికిగల భేదాన్ని, మాండ లికాల సమస్యను డాక్టర్ థామస్ వివరించారు. ఈ వేల్ష్‌భాషా పరిస్థితి భారతదేశంలో పెక్కుభాషలకు ఏర్పడిందని పలువురు వక్తలు వ్యాఖ్య చేశారు.

మద్రాసు పురాతత్త్వశాఖ మాజీ కెమిస్టు డాక్టర్ ఎస్. పరమశివన్ పురాతత్త్వ పరిశోధనకు భౌతికశాస్త్ర సహాయం గురించి ప్రసంగించారు. ఆధునిక పరికరాలతో పెక్కుప్రాచీన స్థలాలను కను గొనవచ్చునని ఆయన తెలిపారు.

## బాంగ్‌కాక్‌లో పల్లవరీతి శిల్పాలు

బాంగ్‌కాక్ రాజకుమారుడు శ్రీ శుభద్రదుశ్ డిస్కుల్ థాయ్‌లెండ్ దక్షిణప్రాంతంలో కనుగొన్న నారాయణీ విగ్రహశిల్పవిశేషంగురించి ప్రసంగించారు. దీనిలో పల్లవకాలపు శిల్పరీతు లున్నాయని, ఒక్క ముఖకవళికలు తప్ప వేషభాషలన్నీ పల్లవ పద్ధతిలో వున్నవనీ వివరించారు.

ఇండో చైనాలోని కారైకాల్ అమ్మైయార్ విగ్రహాలపై డాక్టర్ కోలెట్టి కైలాట్ (పారిస్) ఒక

వ్యాసం చదివారు. కారైకాల్ అమ్మయార్ ఒక శైవయోగి, శివుని పాదాలవద్ద వున్నట్టు గండరించబడ్డారు.

మహాబలిపురం రథాలు క్రీస్తుశకం 5 వ శతాబ్దానివని, ఇవి నాగార్జునకొండ అనుకరణ అని డాక్టర్ చార్లెస్ ఫాబ్రి (న్యూఢిల్లీ) ప్రసంగించారు.

## సజాతీయ భాషల అధ్యయనం

తమిళ విద్వాంసులు సజాతిభాషలయిన తెలుగు, కన్నడ, మలయాళ భాషలను నేర్చుకోవాలని, కనీసం వాటిని గురించి తెలుసుకోవాలని కేరళ విశ్వవిద్యాలయం తమిళశాఖాచార్యుడు డాక్టర్ వి. ఐ. సుబ్రహ్మణ్యం 4 వ నాటి సమావేశంలో ప్రసంగించారు. ఆయన తమిళ సాహిత్యంలో ప్రధాన ఘట్టాలను గురించి ప్రసంగించారు.

ఈ నాలుగు భాషలలోను సాహిత్యపు ఇతివృత్తాలు చాలవరకు సమానంగా వుంటున్నాయి. ఉదాహరణకు శిలప్పదికారం రచించిన ఇళంగో మతంకోసం సింహాసనం పరిత్యజించడం మధ్యయుగాలలో కొచ్చిన్ రాజవంశంలోని ఆచారాలను పోలింది. సాహిత్యాభిమానులు శాసనాల విషయంలోను శ్రద్ధ చూపాలి—అన్నారు.

డాక్టర్ సుబ్రహ్మణ్యం ప్రసంగంపై తీవ్రంగా చర్చ జరిగింది. కణ్ణకి మధురను కాల్చివేయడమనేది అప్పుడెప్పుడో జరిగిన భయంకర అగ్నిప్రమాదానికి ప్రతీక అని, దానివి, మహిమను, మతంకోసం రాజ్యపరిత్యాగం మొదలయిన విషయాలను క్రోడీకరించి పొందుపరచిన ఇతిహాసకావ్యమే శిలప్పదికారం కావచ్చునని పలువురు పృచ్ఛకులు సూచించారు.

తర్వాత లంక ప్రభుత్వం బౌక్కసంశాఖ అనువాదకురాలు శ్రీమతి మహేశ్వరీ బాలకృష్ణన్ 'అనువాదంలోని సమస్యలు' అనే విషయమై ప్రసంగించారు. ఇతర భాషలను, ముఖ్యంగా ఆంగ్ల రచనలను తమిళంలోకి అనువదిస్తున్నప్పుడు కలిగే చిక్కులను వివరించి, అంతటా ఒక పదజాలం వాడడం అవసరమని, అలవాటులోవున్న సంస్కృత పదాలను వాడడానికి జంకరాదని ఆమె ప్రసంగ సంక్షేపం.

## పండితారాధ్య చరిత్రలోని తమిళ గీతాలు

ఉస్మానియా విశ్వవిద్యాలయం లింగ్విస్టిక్స్ శాఖాచార్యుడు డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి పండితారాధ్య చరిత్రలోని 'అరుళుగిరితియన్నె యరనే పరానే' అదిగా ఎనిమిది ద్విపదలలోగల తమిళ ప్రార్థనా వాక్యాలు ఆధారంగా 12, 13 శతాబ్దాలలోని తమిళభాషలోని స్వరసంవాదాన్ని గురించి పరిశోధన వ్యాసం చదివారు. ఈ తమిళ వాక్యాలు సోమనాథుడు ఏ తమిళ స్తోత్రంనుంచి ఉదాహరించాడో తెలుసుకోడం కష్టమని ఆయన తెలిపి, వాటి వ్యవహారపు ఉచ్చారణ మార్పులను శబ్దశాస్త్రరీత్యా వివరించారు.

లంక విశ్వవిద్యాలయం తమిళ శాఖాచార్యుడు డాక్టర్ ఎ. వేలుపిళ్లే 'తమిళ శాసనాల వ్యాకరణం వీరచూళియం' అనే విషయమై ప్రసంగించారు. నూతన తమిళ వ్యాకరణాలలో ఇది ప్రాచీనతమమని దీనిపై సంస్కృత ప్రభావం విశేషంగా వున్నందున, ఇది వ్యావహారిక తమిళభాషపై మొగ్గుచూపినందున దీనిని తమిళ విద్వాంసులు అంతగా ఆదరించలేదని ఆయన అన్నారు.

పూనా దక్కన్ కాలేజీలో ఆస్ట్రోఏషియాటిక్ శాఖ రీడరు డాక్టర్ హెచ్. ఎస్. బిళిగిరి 'హెమ్మిగె తమిళంలో భూతకాల ప్రత్యయం' అనే విషయమై ప్రసంగించారు. మైసూరు వైష్ణవ బ్రాహ్మణులు, ముఖ్యంగా హెమ్మిగె వైష్ణవ బ్రాహ్మణులు విచిత్రమైన తమిళం మాట్లాడుతారని, అది మామూలు తమిళులకు దురవగాహమని అన్నారు.

శ్రీ వి. ఆర్. బాలసుబ్రహ్మణ్యం (లక్నోలో దక్షిణాది భాషల పాఠశాల ప్రిన్సిపాలు) ఉత్తరప్రదేశ్‌లో 'హిందీ మాతృభాష వారికి తమిళభాష నేర్పడం' అనే విషయమై ఒక వ్యాసం చదివారు ఉత్తరప్రదేశ్ విద్యార్థులు తమిళంలోని 'ఴ' అనే వింత

క్షరం పలుకలేక పోతున్నారని, హిందీ విద్యార్థులకు తమిళం ద్వితీయభాషగా బోధించడానికి తగిన పాఠ్య గ్రంథాలు లేవని ఆయన తెలిపారు.

లంక మత్స్యాభివృద్ధి శాఖ పరిశోధనాధికారి శ్రీ కె. సచ్చితానందన్ ప్రాణి శాస్త్ర విషయాలను తమిళంలో అనువదించడంలోగల లోపాలు చిక్కులను గురించి ప్రసంగించారు.

### తొలి తమిళ నవలా రచయిత

ఎడింబరో విశ్వవిద్యాలయం భాషాశాఖ సీనియర్ లెక్చరర్ డాక్టర్ ఆర్. ఇ. అషర్ 'తమిళ ప్రప్రథమ నవలాకారుడు పండిట్ ఎన్. ఎం. నటేశ శాస్త్రి 1859—1906' అనే విషయమై ప్రసంగించారు. తమిళంలో వచనంలో వ్రాసిన కల్పనా కథల వివరాలు తెలుపడానికి ప్రయత్నం జరుగలేదని, తమిళ నవలాపిత అయిన శ్రీ నటేశశాస్త్రి తమిళ జానపద సాహిత్యం ఆధారంగా రచనలు సాగించి తన పేరును శాశ్వతం చేసుకున్నారని, ఆయన సంస్కృత కథలను, షేక్స్‌పియర్ నాటక కథలను తమిళంలో వ్రాసి కొత్త పద్ధతిని చూపారని డాక్టర్ అషర్ అన్నారు.

శ్రీ ఎన్. వానమామలై (పాలయంకోట్ట) తమిళ జానపద గేయాలలో సాంఘిక ఇతివృత్తాలను గురించి, మలయా విశ్వవిద్యాలయం భారత విషయ శాఖాచార్యుడు శ్రీ ఇ. ఎస్. విశ్వనాథన్ 'ఆధునిక తమిళ సాహిత్యానికి పుదుమైపిత్తన్ సేవ' అనే విషయమై ప్రసంగించారు.

లంక సుప్రీంకోర్టు న్యాయమూర్తి డాక్టర్ హెచ్. డబ్ల్యు. తంబయ్య 'జాఫ్నా తమిళరాజ్య మూలం' అనే విషయమై ప్రసంగించారు. యంగ్‌మింగ్‌షన్ (తైవాన్)లోని చైనా సంస్కృతి కళాశాల ఆచార్యుడు డాక్టర్ వోరియంట్ లీ 'మలక్కా తమిళ ప్రధాని ముతాహిర్' అనే విషయమై వ్యాసం చదివారు. మలయా విశ్వవిద్యాలయం భారతీయ శాఖాచార్యులు డాక్టర్ ఎక్స్. ఎస్. తనినాయగం '1859-1896 లో గాడెలోప్, మార్టినిక్‌లకు తమిళుల వలస' అనే విషయమై ప్రసంగించారు.

హవాయి విశ్వవిద్యాలయం సాంఘిక శాస్త్రాచార్యుడు డాక్టర్ క్లారన్స్ ఇ. గ్లిక్ 'పశ్చిమ మలయాలోని రెండు తమిళ వర్గాల పరిస్థితిలో కలుగుతున్న మార్పులు'గురించి ప్రసంగిస్తూ—ఈ రెండు వర్గాలు భారత్‌లోని తమిళనాడునుంచి, లంకనుంచి వచ్చినట్టివని, ఈ రెండు వర్గాలకు చాల వ్యత్యాసాలు వున్నందున అభివృద్ధి చెందుతున్న మలయాజాతిలో ఈ వర్గాలకు ప్రత్యేకత ఇవ్వవలసివచ్చిందని, లంక నుంచి వచ్చిన తమిళుల సంఖ్య అల్పమయినందున వారు తమ వోట్లద్వారా అధికారం సంపాదించలేక పోతున్నారని వివరించారు.

### లంక తమిళుల నాటక సంప్రదాయం

లంక విశ్వవిద్యాలయం తమిళశాఖ రీడర్ డాక్టర్ ఎస్. వైద్యనాథన్ 'లంక తమిళుల రెండు విశిష్ట జానపద నాటికల పరిశీలన' పై ప్రసంగించారు. లంకలో నేటికీ భద్రంగావున్న ఈ జానపద నాటకాలకు మహత్తర సాహిత్య, సాంఘికమూల్యం వుందని ఆయన వివరించారు.

పోలెండులోని వార్సజివా విశ్వవిద్యాలయం ఆచార్యుడు డాక్టర్ ఎం. క్రిస్టోఫర్ బ్యెర్స్కి 'కూడియాట్టం, భాగవత మేళా నాటకంలలో విస్తృత పరిశీలన జరుగాలి' అనే విషయమై ప్రసంగించారు. భారతదేశంలో ప్రాచీన నాటక పద్ధతులు మరుగై పోతున్నాయి గనుక వాటి సర్వే విస్తృతంగా కావాలని ఆయన కోరారు.

'లంక తమిళులలో నేడున్న కొంవై అనే జానపద సంప్రదాయం సంగంకాలపు కళావశేషం' అనే విషయమై కొలంబో నేషనల్ మ్యూజియం మానవజాతి శాస్త్రజ్ఞుడు డాక్టర్ ఎం. డి. రాఘవన్ ప్రసంగించారు.

### దేవాలయ శాసనాలు—సంగీతం

డాక్టర్ టి. ఎన్. రామచంద్రన్ (మద్రాస్ దేవాదాయ ధర్మాదాయశాఖ ప్రచురణశాఖ ప్రత్యేకాధికారి) 'దేవాలయ శాసనాలు—సంగీతం' అనే విషయమై ప్రసంగించారు. అమెరికాలోని రోచెస్టర్ విశ్వవిద్యాలయం సంస్కృత హిందీ అధ్యయనశాఖ

అసిస్టెంట్ ప్రొఫెసర్ జి. ఆర్. వెల్బన్ 'రాజ కళ్మంగలం శిల్పాల'ను గురించి ప్రసంగించారు.

శ్రీ ఎం. దండపాణిదేశికర్ అధ్యక్షతన జరిగిన సంగీత సంప్రదాయాల గోష్ఠిలో డాక్టర్ ఆర్. ఇ. రీన్ (కాల్గేట్ విశ్వవిద్యాలయం—అమెరికా) సంప్రదాయ సిద్ధమైన కర్నాటక సంగీతం సాంఘిక సంప్రదాయంలో చాల అభివృద్ధి చెందిన సహేతుకమైన సంగీతరీతిఅని, సంగీతాన్ని భక్తితోను, మతంతోను మేళవించడంవల్ల శ్రీ త్యాగరాజు సంగీతపు అభివ్యక్తి, సౌందర్యం అనే రెండు అంశాలను సృజనాత్మక మార్గంలో అభివృద్ధి చేయగలిగారని అన్నారు.

## అనువాదాల ఆవశ్యకత

విదేశ భాషలలోని పాఠ్యగ్రంథాలను తమిళంలోకి అనువదించవలసిన అవసరాన్ని గురించి మద్రాసు విశ్వవిద్యాలయం తమిళ శాఖాధ్యక్షుడు డాక్టర్ ఎం. వరదరాజన్ 5 వ నాటి సమావేశంలో 'వివిధ యుగాలలో తమిళ్' అనే పరిశోధన వ్యాసంలో తెలిపారు.

తమిళభాష రెండు సహస్రాబ్దాల కిందే వ్రాత మూలకమయినప్పుడు, తమిళభాష అంతకు ముందు ఎంతో ముందుగా వుండివుంటుంది. సంగం సాహిత్యంపై సంస్కృత ప్రభావం లేదు. అది కావ్య యుగంలో ఏర్పడింది. ఇకమీద వివిధ భాషల సాహిత్యాలను ఆంగ్లం ఆకళించుకొన్నట్టుగా తమిళు అనువాదాలద్వారా ఆకళించుకోవాలి—ఇది ఆయన వ్యాసం సారాంశం.

ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన మధుర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు డాక్టర్ టి. పి. మీనాక్షి సుందరం విద్వాంసులు విస్తృత దృక్పథాన్ని అలవరచుకోవాలని, తమిళు ప్రాచీనకాలంలో ఆక్రమించుకొన్న స్థానాన్ని మరల సంపాదించడానికి కృషి చేయాలని కోరారు.

శ్రీ ఎల్. పి. కె రామనాథన్‌చెట్టియార్ (అణ్ణామలై విశ్వవిద్యాలయం తమిళ శాఖాధ్యక్షుడు) 'సంగం యుగంలో తమిళ సాహిత్యానికి ఉపోద్ఘాతం' అనే వ్యాసం చదివారు. సంగం కవులు దేశభక్తిని, ప్రేమను, వాత్సల్యాన్ని తక్కిన భావాలకన్నా హెచ్చుగా తమ రచనలలో చిత్రించారని, ప్రజలు తమ దేశాన్ని విపత్తులనుంచి రక్షించుకొంటూ సుఖంగా జీవించారనే విషయం ఆ రచనలవల్ల తెలుస్తుందని ఆయన వివరించారు.

## సమానంగా పారభాషిక పదాల అనువాదం

'తమిళ అనువాదం — పారిభాషిక పదాల నిర్మాణం' అన్న విషయమై మద్రాసు విద్యాశాఖామంత్రి శ్రీ వి. ఆర్. నెడుంజెళియన్ అధ్యక్షతన ప్రత్యేక గోష్ఠి జరిగింది, విజ్ఞానశాస్త్ర పారిభాషిక పదాల అనువాదం విషయంలో విద్వాంసులు జాగ్రత్తగా వుండాలని శ్రీ నెడుంజెళియన్ హెచ్చరించారు. తమిళనాడు, లంక, మలయ, సింగపూర్, మారిషస్, దక్షిణాఫ్రికాలలోని తమిళ విద్వాంసులు సమష్టిగా అన్నిప్రాంతాలలోను వాడదగిన సాంకేతిక పదజాలం సృష్టించాలని కోరారు.

పారిభాషిక పదాల అనువాదం పునస్సృష్టిగా వుండాలని మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ అనంతనారాయణన్ సూచించారు. ఇతర భాషా పదాలు బస్సు, కాఫీ, సైకిల్‌వంటివాటిని విడనాడరాదని డాక్టర్ మార్, డాక్టర్ ఆర్. ఇ. అషర్ అన్నారు.

## తమిళభాష భవిష్యత్తు

చివరిరోజు సమావేశంలో శ్రీ క. సంతానం 'తమిళభాషభవిష్యత్తు'ను గురించి ప్రసంగించారు. 'తమిళభాష భావి అంతర్జాతీయ స్థాయి తమిళ కవులు, తమిళ తత్త్వవేత్తలు, తమిళ విజ్ఞాన శాస్త్రజ్ఞులు తమిళులో మౌలికమైన రచనలకు తమిళును వినియోగించడంపై ఆధారపడి వుంటుంది. అలా జరిగితే తమిళు ప్రపంచంలోని ప్రధాన భాషలలో గౌరవస్థానం పొందగలుగుతుందనడంలో సందేహం లేదు.

'పరిపాలన, ఉన్నతవిద్య మొదలయినవాటికి తమిళునే వాడడానికి తగినంత వ్యవధి వుండాలి. దీనికి 30 సంవత్సరాల పథకం ఏర్పాటుచేసి, ఈలోగా తమిళులో క్రమ క్రమంగా వ్యవహారం సాగించాలి. సంవత్సరానికి వంద ఉత్తమ పుస్తకాలు ఇతర భాషల

నుంచి అనువదించడం, 50 మౌలిక పుస్తకాలు రచించడం జరుగాలి. ఇంగ్లీషును అనుసంధాన భాషగా చేసుకోవాలి.'

## 'వెరి' అన్న పదంపై రభస

శ్రీ సంతానం తన ప్రసంగంలో "ప్రభుత్వం గాని, విశ్వవిద్యాలయంగాని రేపటినుంచి అన్ని విషయాలు తమిళులోనే బోధించాలని నిర్ణయించగానే తమ లక్ష్యం నెరవేరుతుందని తమిళుపై వెర్రి ఆవేశంగల కొందరు (ఫానటిక్కులు. వెరియర్గళ్—తమిళ అనువాదం) అనుకుంటున్నారు" అని అనగానే శ్రీ ఎం. పి. శివజ్ఞానగ్రామణి మొదలయిన పలువురు ఫానటిక్ అనే పదాన్ని తొలగించి క్షమాపణ కోరుకోవాలని అడ్డుతగిలారు.

మాతృభాషలో సకల కార్యకలాపాల నిర్వహణకు 30 ఏండ్ల పథకం మంచిదికాదని మరికొందరు విమర్శించారు. తాము కొన్ని సంవత్సరాల స్వల్ప వ్యవధిలోనే మాతృభాషలోనే అన్నీ నిర్వహిస్తున్నామని హీబ్రూ విశ్వవిద్యాలయం ఆచార్యుడు డాక్టర్ సెయిం రాబిన్, లంక ప్రతినిధి శ్రీ రత్నం అన్నారు.

అంతర్జాతీయ తమిళ పరిశోధన సంస్థ ఏర్పాటు—అనే విషయమై డాక్టర్ ఎస్. కె. క్యాత్రే (పూనా దక్కన్ కాలేజీ డైరెక్టర్) వ్రాసిన వ్యాసాన్ని ఆయన సభకు రాలేకపోయినందున మరొకరు చదివారు.

## డాక్టర్ ఎమెనో షష్టిపూర్తి సంచిక

కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం భాషా శాస్త్రాచార్యుడు డాక్టర్ ముర్రే ఎమెనో భారతీయ సంస్కృతికి చేసిన సేవపట్ల కృతజ్ఞతగా ఆయన అభిమానులు, శిష్యులు ఆయన షష్ట్యబ్దిపూర్తి సందర్భంగా సిద్ధపరచిన ప్రత్యేక సంచికను డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి చివరినాటి సమావేశం ప్రారంభంలో ఆవిష్కరించారు. ఈ సందర్భంలో కృష్ణమూర్తి ప్రసంగిస్తూ, ఆచార్య ఎమెనో శ్రీ బర్రోతో కలిసి సిద్ధపరచిన 'ద్రవిడియన్ ఎటిమలాజికల్ డిక్షనరీ' చాల గొప్పదని, దీనితో ద్రావిడభాషా పరిశోధనలో కొత్త యుగమే ఏర్పడిందని, దీనిలో ప్రపంచ ప్రసిద్ధులయిన భాషావేత్తలు ఎస్. కె. చటర్జీ, క్యాత్రే, హోం మొదయినవారి 40 అపూర్వ వ్యాసా లున్నాయని, తను దీనికి సంపాదకుడుగా పని చేశానని అన్నారు. డాక్టర్ ఎస్. కె. చటర్జీ, డాక్టర్ మీనాక్షి సుందరం మొదలయినవారు శ్రీ ఎమెనో చేసిన సేవ భాషాశాస్త్ర పరిశోధనలో నూతన యుగాన్ని స్థాపించిందని ప్రశంసించారు.

మద్రాసు విద్యాశాఖామంత్రి శ్రీ నెడుంజెళియన్ ప్రసంగిస్తూ డాక్టర్ క్యాత్రే సూచన ప్రకారం నెలకొల్పదలచిన అంతర్జాతీయ తమిళ పరిశోధన సంస్థ ప్రధాన కార్యాలయం చెన్నపురిలో వుండడం ఉచితమన్నారు.

## తమిళ్‌కు 'ప్రమాదం'

మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ సి. ఎన్. అణ్ణాదురై ప్రసంగించారు: 'తమిళు శక్తివంతమైనది, సారవంతమైనది, ఇతర భాషా పదాలను తనదిగా చేసుకోదగినట్టిదీ, పదభండారం విరివిగా ఉన్నట్టిదీని. దీనితో సాటిఅయిన భాష ప్రపంచంలో మరొకటి లేదు. సహస్రాబ్దాలుగా ఈభాషను సంరక్షించిన ఘనులు నిర్దుష్టమైన సాహిత్య భండారం అందజేసి పోయారు దీనిని ప్రపంచంలోని సంపూర్ణ భాషలలో ఒక్కటిగా పరిగణించబడా లనేది తమిళుల వాంఛితం. తమిళులు సహస్రాబ్దాలుగా సుమాత్రా, జావావంటి ఇతర దేశాలకు వెళ్లడం వుంది. కాని వారు తమ భాషను అక్కడి వారిపై రుద్దలేదు, తమ సంస్కృతిని మాత్రమే వ్యాపింపజేశారు. మా భాషంటే మాకు చాలా గర్వం. కాని, ఆ గర్వం ఇతర భాషలను పాడుచేయడానికో, ఇతరులకు తమ భాషలపై గల అభిమానాన్ని నాశం చేయడానికో కాదు.

'ఇంత సంపన్నమయిన తమ ప్రాచీన భాషకు దీనితో సమానంకాని, ఇంకా భాషావర్గంలో చేరని మరొక భాషతో ప్రమాదం ఏర్పడుతుందని తమిళులు భయపడుతున్నారు నేను ఈ పండిత సభలో రాజకీయాలు తేదలచుకోలేదు. కాని, ఒక్కటి మాత్రం చెప్పగలను. తమిళులు తమ భాషకు కలిగిన ప్రమాదాన్ని దూరం చేయదలచుకున్నారు.'

వివిధ దేశాల ప్రతినిధులకు కృతజ్ఞత తెలుపుతూ, వారికి నిరంతరం తమిళులు స్వాగతం మిస్తారని మద్రాసు ముఖ్యమంత్రి అన్నారు.

తమిళులో అభిధాయా క్రియ అనే వ్యాసం శ్రీ కె. పి. అరుణాచలం, తమిళంలో కర్మణి ప్రయోగం అనే వ్యాసం డాక్టర్ ఎస్. అగస్త్యలింగం, 'రుమేనియా, హిందీ, తమిళాల వాక్య నిర్మాణం' అనే వ్యాసం డాక్టర్ లారెన్షియు ఘేబన్ (రుమేనియా) చదివారు.

డాక్టర్ జె. ఆర్. మార్ (లండన్) 'పదిట్టుపత్తు'ను గురించి, శ్రీ ఎం. ఎం. యువైన్ (లంక) 'తమిళ సాహిత్యంలో ముస్లిం సాహిత్య రూపాలు' గురించి, శ్రీ ఎస్. సింగారవేలు (మలేషియా) 'థాయ్‌లెండ్ పల్లవచోళ గ్రంథ శాసనాలలో తేవారం పద్యాలు' అనే విషయమై వ్యాసాలు చదివారు.

డాక్టర్ హెచ్. ఎఫ్. వోవెన్ (ఆస్ట్రేలియా) శ్రీమతి 'అన్నిబిసెంటు—దక్షిణభారతంలో రాజకీయ కార్యకలాపాల ఉత్థానం' అనే విషయమై, డాక్టర్ ఇ. పి. చెలిషేవ్ (మాస్కో) 'సుబ్రహ్మణ్య భారతి కవిత—భారత సాహిత్యంలో నూతన ధోరణుల అభివ్యక్తి' అనే విషయమై వ్యాసాలు చదివారు.

### తమిళ లిపి పుట్టుక

శ్రీ ఐ. మహాదేవన్ 3 వ నాటి ప్రధాన సమావేశంలో చదివిన 'తమిళ బ్రాహ్మీ శాసనాలు' అనే వ్యాసంపై డాక్టర్ బి. హెచ్. కృష్ణమూర్తి అధ్యక్షతన జరిగిన ప్రత్యేక సమావేశంలో చర్చలు జరిగాయి.

మద్రాసు విశ్వవిద్యాలయం హిందీ ప్రొఫెసర్ డాక్టర్ శంకరరాజులునాయుడు మాట్లాడుతూ, 'తమిళ లిపి బ్రాహ్మీలిపినుంచి పుట్టిందనడం తప్పు. ద్రావిడ నాగరికత చాల ప్రాచీనం. ఇది హరప్పా త్రవ్వకాలవల్ల తెలిసింది. అందువల్ల తమిళ లిపే బ్రాహ్మీకి తల్లి' అని అన్నారు.

కాని, శ్రీ మహాదేవన్ ఈ విషయంలో ఏకీభవించక, హరప్పాకు, బ్రాహ్మీకిగల సహస్రాబ్దాల అంతరం తెలిపి, తన వ్యాసంలో తాను పురాతత్త్వ పరిశోధనదృష్ట్యా ప్రాచీనంగా లభించిన తమిళ శాసనాలను ప్రస్తావించానని అన్నారు. తొల్కాప్పియంలో చెప్పిన లిపి బ్రాహ్మీయే అయివుంటుందన్నారు.

శాసనాలు అశోకుని కాలంలో ప్రచారంలోకి వచ్చాయని, అందువల్ల శాసనాలు ఆధారంగామాత్రమే తమిళ చరిత్రను నిర్ణయించడం సరికాదని కొందరన్నారు.

అశోకునిముందు తమిళలిపి వున్నట్టు నిదర్శనాలు లేవని శ్రీ మహాదేవన్ సమాధానం చెప్పారు.

తమిళనాడు చివర దొరికిన బ్రాహ్మీశాసనాల లిపికి, దేశంలో ఇతర ప్రాంతాలలో దొరికిన శాసనాల బ్రాహ్మీలిపికి వ్యత్యాసం వున్నందున, అవి క్రీస్తు శకం 3—4 శతాబ్దాల మధ్యకాలంవి అయివుంటాయని ప్రొఫెసర్ మహాలింగం (మద్రాసు) అన్నారు.

అధ్యక్షుడు డాక్టర్ కృష్ణమూర్తి చర్చలను సమీకరిస్తూ, శ్రీ మహాదేవన్ తమ వ్యాసంలో చెప్పిన దాని వుద్దేశం క్రీస్తుశకం 2 వ శతాబ్దికి ముందు తమిళులో లిఖితం లేనట్టు కాదని, అంతకుముందు లిపి వున్నట్టు నిరూపించే ఆధారాలు కనిపించలేదని మాత్రమేనని వివరించారు.

శ్రీ మహాదేవన్ ఆ అభిప్రాయంతో ఏకీభవించారు.

### 'భారతదేశ సంస్కృతి ఒక్కటే'

10 వ తేదీ సాయంకాలానికి యు అంతర్జాతీయ తమిళ మహాసభ సమాప్తమైంది. 11 వ తేదీన మహాసభ ప్రతినిధులకు వీడ్కోలు ఇవ్వబడింది ఈసమావేశానికి అధ్యక్షులయిన డాక్టర్ సునీతికుమార్ చటర్జీ తమ ప్రసంగంలో తమిళభాషా పరిశోధన విడిగా జరిగినా, భారత సంస్కృతి పరిశీలనాధ్యయనాలు సమష్టిగా, సమన్వితంగా జరుగాలని కోరారు. భారతదేశ మంతటికీ సంస్కృతి ఒక్కటేనని తాము విశ్వసిస్తున్నానని అన్నారు.

* * * *

ద్వితీయ అంతర్జాతీయ తమిళ మహాసభ ప్రసంగాలలో చాలావాటి సారాంశం విహంగమదృష్టితో ఇక్కడ ఇచ్చాను. ఈ మహాసభ ధోరణి ఏమిటో పాఠకులకు ఈ సమీక్షతో తెలిసే వుంటుంది. కొందరు విదేశీ ప్రతినిధులు తమిళ మహాసభ చర్చలు కేవలం ప్రాచీనవైభవ ప్రకటన ధోరణిలోను, వీరావేశంతోను కొనసాగలేదని అన్నప్పటికీ

ఏడునాళ్ళ శ్రద్ధగా ప్రసంగాలన్నీ విన్న ఎవరికైనా ఆ అభిప్రాయమే కలుగుతుంది. గతం ఆగతానికి మూలబంధమనడం ఎవ్వరూ కాదనరు. కాని, 'మూలబంధమే—భవనం కాదు' అన్న విషయం మననం చేసుకోకపోతే పునాది పునాదిగానే వుండిపోతుంది.

ఏ భాష గొప్పదనానికైనా ప్రాచీనత అనేది మాత్రమే ప్రధాన గుణం, గ్రాహ్యతకు ప్రధాన లక్షణం కాదు; సాహిత్య విస్తృతితో భాషలకు ప్రాముఖ్యం వస్తుంది. నేడు ప్రపంచమంతటా వ్యాపిస్తున్న, వ్యాపించినభాషల పుట్టుపూర్వాలు పరిశీలిస్తే, చాలావాటికి గణనీయమైన గత వైభవం కానరాదు. కాని, అవి అర్వాచీన కాలంలో ఎంతో అభివృద్ధిని సాధించాయి. అందువల్లనే, ప్రాబల్యమూ పొందుతున్నాయి.

ఈ సభలలో ప్రాచీన వైభవప్రాభవ ప్రఖ్యాపనం మాత్రమేకాక, భాషా విషయంలోను మడిగట్టుకోవాలనడం హెచ్చుగా కనిపించింది. జీవద్భాషకు మళ్ళు, దళ్ళు పనికిరావు. అది వాటిని తోసుకుని ముందుకు పోతుంది. లంక, మలేషియా, సింగపూర్ తమిళులు ఈ విషయాన్ని గ్రహించినట్టు నాకు తోచింది. సమకాలిక భాషలలో పదాలను స్వేచ్ఛగా గ్రహించి వాడుకోవాలని, పరభాషా సంస్కృతులపై ద్వేషం తగదని, అదే ప్రగతికి స్పష్టమైన మార్గమని వారి భావం. తమిళు కేవలం మ్యూజియం వస్తువుగా వుండరాదని, పట్టువిడుపులు, ఆదానప్రదానాలు అవసమని వారిలో పలువురు నాతో అన్నారు.

## సాహిత్యంతోనే భాషకు స్థానం

తమిళం ఇంత సంపన్నమయిన భాష అయినప్పుడు, విదేశాలవారు ఎంతో శ్రద్ధతో నేర్చుకుంటున్నప్పుడు, మనదేశంలోనివారు, ఇరుగుపొరుగువారు ఎందుకు నేర్చుకోడానికి ప్రయత్నించడం లేదు?—అనే ప్రశ్న చాలమందికి కలిగింది. సంగీత విద్వాంసులు, సంగీతప్రియులు త్యాగరాజ కృతుల కోసం, క్షేత్రయ్యపదాలకోసం, రామదాసు కీర్తనల కోసం తెలుగు నేర్చుకుంటున్నారు. తత్త్వ శాస్త్రాభిమానులు వివిధ దర్శన శాస్త్ర పాండితి కోసం సంస్కృతం నేర్చుకుంటున్నారు. విజ్ఞాన శాస్త్రంకోసం వివిధపాశ్చాత్యభాషలు నేర్చుకుంటున్నారు. గొప్ప సాహిత్యం ఉద్భవించినప్పుడు దాని ప్రభావం పరిసర సాహిత్యాలపైన, ప్రజలపైన పడుతుంది. సంస్కృత ప్రాకృతాల ప్రభావం, ఇతర భాషలపై పడినంతగా ప్రపంచంలో మరే ప్రాచీన భాషల ప్రభావమూ పడలేదు. కారణం వాని ప్రాచీన సాహిత్యం ఉజ్జ్వలంగా వుండడమే. నేడు ఆంగ్ల, రష్యన్, ఫ్రెంచి సాహిత్యాలపై ఆసక్తి కలుగడానికి కారణమూ ఇలాటిదే. తమిళ భక్తి సాహిత్యం ఒకప్పుడు గొప్ప ప్రభావం ప్రసరింపజేసింది. ఆధునిక భారతీయ భాషలలో మరాఠీ, బెంగాలీ హిందీలు వ్యాప్తికావడానికి కారణం, వాటి సాహిత్యమూ, ఉపయోగితాను. నేటి తమిళులకు అలాటి స్థాయి వస్తే, ప్రతివారు ఎగబడి నేర్చుకుంటారు. రాజాజీ ఈ సభల ప్రారంభంలోనే అన్నట్టు గతంకన్నా భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొనడం అవసరం.

మన భాష సౌష్ఠవంపై మనకు విశ్వాసం ఉన్నప్పుడు, మన భాష ప్రయోజనంపై మనకు నమ్మకం ఉన్నప్పుడు, మన భాషా మాధుర్యంపై మనకు గాఢమైన భక్తి వున్నప్పుడు మన భాషకు ముప్పు వస్తుందనే భయం ఎన్నటికీ కలుగదు; అలాటి భాష, దాని సాహిత్యం ఎన్ని ప్రళయాలు ముంచుకొని వచ్చినా నశించవు.

తెలుగువారమైన మనకూ ఇవన్నీ వర్తిస్తాయి. మన గతం గొప్పదని, మనభాష 'ఇటాలియన్ ఆఫ్‌ది ఈస్ట్' అని బొబ్బరించడంవల్ల ప్రయోజనం లేదు. ఎవరికివారు, తాము గొప్పదనుకున్న, మంచిదనుకున్న, తమ శక్తికి తగిన సేవ చేసి భాషా వాఙ్మయాలను పెంపొందించాలి. అప్పుడు అవి ఇతరుల దృష్టిని ఆకర్షిస్తాయి. ఎవరు వద్దన్నా, వాటి మాధుర్యం, జ్ఞానం, ఆనందం ఇతరులను ఆకర్షిస్తాయి.

ఈ సందర్భంలో రాష్ట్రపతి ఈ మహాసభను ప్రారంభిస్తూ చేసిన ఉపదేశం మనం విస్మరించరాదు.

# గ్రంథ విమర్శలు

## రామాయణ సమీక్షా

[సంపాదకులు: శ్రీ ఇ. ఆర్. శ్రీకృష్ణశర్మ, ఎం. ఏ., పిహెచ్. డి; ప్రకాశకులు: శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటి, తిరుపతి డెమీ 1/8 పేజీలు 116 - రాపరుకవరు. వెల: రు. 5/-]

శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ కాలేజి, సంస్కృతశాఖవారు 1965 ఫిబ్రవరిలో జరిపిన సెమినార్ ఉపన్యాసాలు ఇందులో ప్రచురించినారు. మొత్తముమీద వ్యాసము లన్నియు ఆయా విషయములను గూర్చి చక్కగా సమీక్ష చేసినవి ఇందులో చేర్చినంతవరకు, పరిమితమైన సమగ్రతతో ప్రదర్శింపబడుటచే, పాఠకులకు రామాయణ ప్రభావము గోచరించుచున్నది.

శ్రీ పంపాపతిరావు ప్రారంభోపన్యాసములో రామాయణములో ధర్మము, రాముని శీలము ప్రధానము లనుచు, వాల్మీకి శ్రీరాముని మానవమాత్రునిగనే చిత్రించిరని వాలి వధమును ఉదాహరించిరి.

శ్రీ బి. ఆర్. శర్మ తమ అధ్యక్షోపన్యాసములో క్రీస్తుకు పూర్వమే దూరప్రాచ్య భూములలో (Greater India) భారతీయ సంస్కృతి ముఖ్యముగా రామాయణము మహాభారతము పంచతంత్రముల ద్వారా వ్యాపించినదనుచు, అవి యక్కడ స్థానిక జాతీయత నలవరించుకొన్నవనిరి. భరత భూమిలో వాల్మీకి రామాయణము రాముని ఉత్తమాదర్శ పురుషునిగా ప్రజాహృదయములలో హత్తుకొనజేసినదనియు, ఇక అవతారమూర్తిగా ప్రదర్శించువానిలో అధ్యాత్మ రామాయణము ప్రాధాన్యము వహించుననియు తెలుపుచు, ఉత్తరకాండము వాల్మీకి కృతమా కాదా యను వివాదమును స్పృశించిరి.

డాక్టరు పి. నాగరాజరావు రెండవనాటి అధ్యక్షోపన్యాసములో వాల్మీకిని 'కవీనాం కవిః' అనిరి. 'రామాయణము సర్వకాలములకు అనువర్తించు సద్గ్రంథమే ఐనను, ముఖ్యముగా నేటికాలము వారికి ఉత్తమోద్బోధము కావించుచున్నది. రాముడు ధర్మాత్ముడు, ధర్మనిష్ఠుడు, ధర్మజ్యేష్ఠుడు— 'రామో విగ్రహవాన్ ధర్మః'. ఇట్లనుచు చివరి పేరాలో శ్రీమద్రామానుజుల దృష్టిలో రామాయణము కావ్యమే కాదు, 'శరణాగతి' ప్రాధాన్యమును ప్రదర్శించు సాక్షాద్వేదమే ప్రాచేతసునివలన రామాయణ రూపమున అవతరించినదని సూచించిరి.

ఆ చివరి పేరాకు వివృతిగానే శ్రీ టి. కె. గోపాలస్వామి అయ్యంగారి 'న్యాసవిద్య—రామాయణము' అను వ్యాసము భావింపదగియున్నది. వేదాంతములలో ప్రసిద్ధమైన 32 బ్రహ్మవిద్యలలో న్యాసవిద్యయొకటి. అదియే ప్రపత్తి, శరణాగతి, శరణవరణము, ఆత్మనిక్షేపము—అను నామములతో వ్యవహరింపబడుచున్నది. నమశ్శబ్దముకూడ ప్రపత్తికే అన్వయించును. ఇట్లు చెప్పి రామాయణము ఏయేకాండములలో ఏయే సందర్భములలో ప్రపత్తిని ప్రదర్శించునో తెలిపిరి. కాని ఇందులో వేదాంత వచనములతోగాని బ్రహ్మవిద్యా స్వరూపముతోగాని తమ యాశయమును సమన్వయించుటకు ఏమాత్రము పూనుకొనకుండుట శోచనీయము.

'జైన సంప్రదాయములో రామాయణ కథ' ఎట్లు పెనవేసికొనినదో శ్రీ ఎచ్. సి. భయానీ చక్కగా తమ వ్యాసములో వివరించిరి. అందులో వానరులు కపిధ్వజులైన విద్యాధరులు. రావణాదులుకూడ విద్యాధరులే. వారి సంప్రదాయములో బలదేవులు, వాసుదేవులు, ప్రతివాసుదేవులు ప్రతిమహాయుగమునను తొమ్మండుగురు చొప్పున అవతరింతురు. అందులో శ్రీరాముడు 8 వ బలదేవుడు, లక్ష్మణుడు 8 వ వాసుదేవుడు, రావణుడు 8 వ ప్రతివాసుదేవుడు. కన్నడ వాఙ్మయముతోడను, జైన సంప్రదాయ గ్రంథములతోడను పరిచయములేని పాఠకులు ఈ వ్యాసము ముఖ్యముగా గమనింప దగినది.

శ్రీ భగీరథమిశ్ర 'హిందీలోని రామాయణములు' అను వ్యాసములో రామాయణకథ హిందీలో 4 అంచెలుగా వ్యాపించినదని ప్రారంభించి ఏదశలో ఏ ఏ ప్రధాన గ్రంథములు వెలువడినవో చక్కగా ప్రదర్శించిరి. ప్రథమదశలో వాల్మీకి రామాయణమునకు అనువాదములు వెలసినవి. వానిలో విశేషము పేర్కొనదగినవి లేవు. రెండవదశలో రాముడు భగవంతుడే లోకోద్ధరణమునకై అవతరించి ఆదర్శజీవితము గడిపిన అవతారపురుషుడైనాడు. వీనిలో కొన్నిటి నుదాహరించి అన్నిటిలో తులసీదాసు రామచరితమానసము అగ్రగణ్యమైనదని యథోచితముగా విస్తరించిరి. దానితర్వాత ఎన్నదగినవి ఆచార్య కేశవదేవుల 'రామచంద్రిక'యు సహజరాముల 'రఘువంశదీపిక'యు నని వానిని కొంత స్పృశించిరి. మూడవ దశలో శ్రీరామ పూజ ప్రత్యేక సంప్రదాయమై రసికోపాసనా సాహిత్యము వెలసినది. అందులో సీతారాములు రసస్వరూపులు. ఈ సంప్రదాయములో రమారమి 70 మందికవులు 200 గ్రంథములు రచించిరట ఇక నాల్గవదశ ఆధునిక కాలము. ఈదశలో రాముడు ఆదర్శమానవుడు; సత్యము, ప్రేమ, ధర్మము అనుష్ఠించి సంఘమునకు మార్గదర్శకుడైనవాడు. వీనిలో మైథిలీ శరణగుప్తగారి 'సాకేత' నిరాలాగారి 'రామకీ శక్తి పూజా' ప్రధానమైనవి. ఈ చక్కని వ్యాసము ముగించుచు, "But the idea that the theme of the Ramayana is out of date is gaining ground among the Hindi poets because of the feeling that more than what is sufficient has already been written on the theme," అని వ్యాసకర్త వ్రాసిన వాక్యముమాత్రము చింత్యము. అది వ్యాసకర్తవంటివారి కొందరిభావమునే ప్రదర్శించును గాని సాధారణముగా హిందీ కవులకు అన్వయించునని భావింపము. కొన్నివేల సంవత్సరములుగా భరతభూమిలోననేకాక, భారతీయ సంస్కృతి ప్రసరించిన ప్రదేశములందెల్ల నాటుకొనిన రామకథకు ప్రాతదనముండునా ? రామచరిత మానసమునకు ప్రతిస్పర్ధిగా శ్రీ విశ్వనాథ 'రామాయణ కల్పవృక్షము' రచన చేయుటయే ఆంధ్రదేశములోని కవులకు రామాయణకథ ప్రాతపడలేదనుటకు ప్రబలమైన నిదర్శనము. అట్టివారు హిందీ కవులలోమాత్రములేరా ? కంకంటి పాపరాజు అన్నట్లు 'రాఘవేశ్వరు చారిత్రము నెందరెన్నిగతులన్ వర్ణించినన్ గ్రాలదే!'

'తెలుగు వాఙ్మయములో రామాయణ కథ' అను వ్యాసములో శ్రీ టి. కోదండరామయ్య తెలుగులోపుట్టిన ప్రధాన రామాయణములనుగూర్చి చాలవరకు చక్కగా వివరించిరి. రామకథ స్త్రీల పాటలలో ఆంధ్రత్వము కూర్చుకొనినదికూడ 'లక్ష్మణదేవర నవ్వు' 'ఊర్మిళ నిద్ర' ఇత్యాదు లుదహరించి ప్రదర్శించినారు. కాని సుబ్రహ్మణ్యకవి కీర్తనాత్మకముగా అద్భుతమైన కావ్యశిల్పమును అద్భుతతరమైన గేయశక్తితో జోడించి రచించిన అధ్యాత్మ రామాయణమును ప్రస్తావింపకుండుట లోటుగా తోచినది. శ్రీ విశ్వనాథ 'రామాయణ కల్పవృక్షము'నకు నేడున్న విస్తార ప్రచారమునుబట్టి చప్పని ఒక్కవాక్యముతోనే పూర్తిచేయుటయు తృప్తిగా లేదు. అట్లే వాసుదాసుగారి రామాయణము గూడ దాని ప్రచార విస్తృతినిబట్టి కొంత వివరింపవలసినది. వ్యాసకర్త క్లుప్తీకరించుట కట్లు చేసిరనలేము. రంగనాథ రామాయణ కర్తృత్వము విషయము అనవసరముగా దీర్ఘముగా ప్రస్తావించి గోన బుద్దారెడ్డి తండ్రిపేరు పాండురంగ విఠలనాథుడై యుండగా దానిని క్లుప్తీకరించి రంగనాథుడని వాడియుండునని నిరాధారముగా ఒకానొకరు చేసిన ఆకాశసౌధతుల్యమైన ఊహను సమాదరించి విస్తరింపవలసిన అవసర మీ వ్యాసములో లేదు గదా ! మరియు 44 వ పుటలో 'In the Valmiki Ramayana it is stated that Rama installed the idol of Siva at Rameswaram.' అని వ్రాసిరి. వావిళ్లవారు ప్రచురించిన రామాయణము యుద్ధకాండము, 125 వ సర్గములో నిట్లున్నది.

'ఏతత్తు దృశ్యతే తీర్థం సాగరస్య మహాత్మనః
సేతుబన్ధ ఇతిఖ్యాతం త్రైలోక్యేనాభిపూజితమ్.
ఏతత్పవిత్రం పరమం మహాపాతక నాశనమ్
అత్రపూర్వం మహాదేవః ప్రసాద మకరోత్ప్రభుః
అత్రరాక్షస రాజోఽయ మాజగామ విభీషణః'

అని మాత్రమే యున్నది. గోరఖ్‌పూరు గీతా ప్రెస్సువారు వేసిన రామాయణములోగూడ యుద్ధకాండము

123 వ సర్గలో పై శ్లోకాలే కొంచెము ముందు వెనుకలుగా ఉన్నవి. రామేశ్వరములో శ్రీరాముడు శివ విగ్రహము ప్రతిష్ఠచేసినట్లు వాల్మీకి రామాయణములో చెప్పనేలేదు. పై వాక్యములు పుష్పకవిమానములో తిరిగివచ్చుచు శ్రీరాముడు సీతతో పలికినవి. ఇట్టి విపరీతప్రమాదములు క్షంతవ్యములు కావు. ఇట్టివి ఆంధ్రులపై నాంధ్రేతరులకు అనాదరము కలిగించును. మరియు రామాభ్యుదయమును గురించి, 'The next work is the Ramabhyudayam a treatise on the Ramayana written in the Prabandha style' (P. 33) అని వ్రాసిరి. అది Treatise కాదు. Treatise అంటే వ్యాసమువంటి వివరణ గ్రంథము కాని కావ్యముకాదు. పరభాషయైన ఆంగ్లము వాడుటలో మనకు కొన్ని పొరపాట్లు తప్పవుకాని ఇట్టివి అపార్థము కలిగించును.

'కన్నడ వాఙ్మయములో రామకథ'ను గూర్చి శ్రీ యు. కె. సుబ్బరాయాచార్ వ్యాసము కలదు. కన్నడములో భారతమునువలెనే రామాయణమును గూడ ముందు వ్రాసినవారు జైనకవులు. వారు జైన రామాయణములనే అనుసరించిరి. జైన రామాయణ కథలలో రెండు సంప్రదాయములు కలవు. ఒకటి గుణభద్రునిది ఉత్తరపురాణకథ. రెండవది విమలసూరి 'పఉమచరిఅ' ననుసరించునది. చాముండరాయ పురాణము గుణభద్రునికథ ననుసరించెను. దానికిని వాల్మీకి కథకును గల పది ప్రధానభేదములను వ్యాసకర్త తెలిపిరి. మరి విమలసూరి కథ ననుసరించియే అభినవపంప బిరుదాంకితుడగు నాగచంద్రుడు 'రామచంద్ర చరిత పురాణము' రచించెను. ఈ రామాయణమే కన్నడ రామాయణములలో చిరస్థాయికాంచినదని దానిలోని కొన్నిభాగములు వ్యాసకర్త అనువదించి వర్ణించిరి. కాని ఈ కథకును గుణభద్రుని కథకును గల ప్రధానభేదములుకూడ వివరించినచో బాగుండెడిది. మరియు వాల్మీకి రామాయణము, ఆనంద రామాయణము, అధ్యాత్మరామాయణములనుకూడ కన్నడములోని కనువదించిన ఇతర కవులను పేర్కొనిరి. 12 పేజీలున్న ఈ వ్యాసములో సజీవులైయున్న నేటి కవుల రామాయణములకు 6 పేజీలు ప్రత్యేకించుట చిత్రముగా తోచినది. అందును పద్మభూషణ డా. కె. వి. పుట్టప్ప (కువెంపు) 'రామాయణ దర్శనము'నకు 3½ పేజీలు ప్రత్యేకించుట మరింత విచిత్రమనిపించును. అభినవపంప నాగచంద్రుని కృతికి 1½ పేజీలు మాత్రమే వినియోగించి, దీనికింత విస్తృతిమాపుట వ్యాసకర్త కాగ్రంథమందుగల ప్రత్యేకాభినివేశమునే ప్రకటించునుగాని ఔచిత్యమును ప్రదర్శింపదు. తెలుగు రామాయణముల వ్యాసకర్త 19 పేజీల వ్యాసములో 19, 20 శతాబ్దముల ఆంధ్రరామాయణముల ప్రశంస 9 పంక్తులలో ముగింపగా, ఈ కన్నడ వ్యాసకర్త ఆధునికుల నింత విస్తరించెను. రిది అతివృష్టి, ఒకరిది అనావృష్టి!

శ్రీ కె. ఎన్. ఎజుతచ్చన్ 'మళయాళములో రామాయణములను' గూర్చి వ్రాసిన వ్యాసము అట్లు కాక యథోచిత విన్యాసముతో సమగ్రసుందరమై విలసిల్లుచున్నది. నేటి మళయాళమునకు పిత యనదగిన తున్చాట్ ఎళుతచ్చన్ (16 వ శతాబ్దము) రామాయణమునకు యథోచితోన్నత స్థాన మిచ్చిరి. ఆ కవి వాల్మీకి రామాయణము ననుసరింపక అ రామాయణము ననుసరించుట మళయాళ వాఙ్మయములోని విశిష్టత. ఆధునికులలో ప్రసిద్ధుడగువల్ల థోల్ కవి వాల్మీకి వాడిన ఛందస్సులనుగూడ మార్పుచేయక పద్యమునకు పద్యము చొప్పునచేసిన అనునాదమును గూర్చి ప్రస్తావించి, శ్రీ కుమారన్ ఆశాన్ 'చింతావిష్టయాయ సీత' అను కావ్యములోని భావసౌందర్యమును శ్లాఘించిరి. మళయాళ వాఙ్మయములో బహువిధ రంగములలో రామకథ ఎట్లు విస్తరించినదో తెలిపి, వ్యాసము పరిసమాప్తి చేయుచు, తక్కిన భాషాకవులవలెగాక మళయాళ కవులు రామాయణ కథావృత్తాంతములను సంప్రదాయసిద్ధమగు కథను వదలి మార్పులుచేయుట కిచ్చగింపక దాని పవిత్రతను భద్రపరచిరని వక్కాణించిరి. ఇది రామకథాభిమానులందరు గమనింపదగిన విశేషము!

శ్రీ ఈ. ఆర్. శ్రీకృష్ణశర్మ 'రామాయణములో ప్రదర్శించిన ధర్మమునుగూర్చి ఒక భావము' అను వ్యాసములో శ్రీరాము డవలంబించిన ధర్మస్వరూపమును కొంత విచారణ చేసిరి. అందులో మూడు ముఖ్యసందర్భము లెత్తుకొనిరి. (1) దండ

కారణ్య మునుల ప్రార్థనచే వైరము లేకుండ రాక్షస వధమునకు పూనుకొనుట (2) వాలివధము (3) సీతను అగ్నిశుద్ధి కోరుట. వ్యాసకర్త జీవితములవలెనే ధర్మ స్వరూపమును మార్పుచెందుచుండుననుచు శ్రీరాముడనుష్ఠించినది 'శ్రేష్ఠధర్మము' అని శ్రీరాముని వచనములనే ఒత్తిపలికిరి. వ్యాసకర్త సమర్థన చూడగా జర్మనుతత్త్వవేత్త నీచే (Nietzsche) ప్రవచించిన అతిమానవ (Superman) ధర్మముగా భాసించినది.

ఈ సంపుటములోని వ్యాసము లన్నిటికి చివరనున్న 'వాల్మీకేః గేయ పరిస్పన్దః' అను సంస్కృత వ్యాసము మకుటాయమానమైనది. అది ఒక్కటే సంస్కృతములో నున్నది. తక్కినవి ఆంగ్ల వ్యాసములు. ఈ సంస్కృత వ్యాసరచయిత మన రా. అనంత కృష్ణశర్మగారవుట ఎంతయు సమ్మోదావహమైనది. దీనిలో రామాయణము నెడల గౌరవభావము వదలకయే, మోమోటము లేకుండ శ్రీ శర్మ విషయ విచారణ చేసిరి.

'పాఠ్యేగేయే చ మధురమ్'—'ప్రమాణై స్త్రిభి రన్వితమ్'—'జాతిభిః సప్తభి ర్బద్ధమ్' 'తన్త్రీలయ సమన్వితమ్'—'సమ తాల సమన్వితమ్'—'మార్గ విధాన సమ్పదా'—ఇత్యాది ప్రయోగములు రామాయణమునందే కలవు. ఈ ప్రయోగముల అర్థమును విచారణచేసి వాల్మీకి ఉద్దేశించిన రామాయణ గాన సంప్రదాయము నేడు కానరాదని నిర్ధారణ చేసిరి. అంతేకాక నాట్యశాస్త్రములోగాని సంగీత రత్నాకరాది శాస్త్రగ్రంథములలోగాని చెప్పబడిన లక్షణములు కొన్ని నేడు దురవగాహముగా నున్నవి. ఒకనాడు దేశిగా పరిగణింపబడినదానికే తర్వాత లక్షణము ఏర్పడగా, నది మార్గగా పరిగణితము కాసాగినది. అందుచే కుశలవులు రామాయణ గానముచేసిన మార్గ విధాన సమ్పద నేడు కానరాకున్నది. ఐనను నేటికిని అనన్యసామాన్యమైన సంగీత పరిస్పంద మున్నది కనుక—ఆనాటి మార్గ విధానము కాకపోవుగాక—అద్యతన దేశీయపథముననే యథారుచిగా యథాశక్తిగా శ్రీ రామాయణమును విస్రబ్ధముగా గానము చేయుచు పఠించుచు ధన్యుల మగుదముకాకయని శర్మగారు కావించిన ఉద్బోధము సహృదయు లందరికి సమతమై ధైర్యము కలిగించునదిగా నున్నది.

ఈ సభలు జరిగిన రోజులలో రైళ్ల రాకపోకలకు కలిగిన ఆటంకములవలన కొందరు విద్వాంసులు సభలకు రాలేకపోవుట ఈ సమీక్ష అసమగ్రతకు కారణముగా సంపాదకులు నివేదించిరి. సభలకు రాని వారి వ్యాసములు కొన్ని యిందున్నవి. తక్కిన వట్లేల తెప్పించి ప్రచురింపలేదో సంపాదకులు తెలుపలేదు. ప్రక్కనే ఉన్న తమిళ రామాయణముల వ్యాసమైన నిందులో లేదు. మహారాష్ట్రము, గుజరాత్, ఓఢ్రము, బంగాళీ, కాశ్మీరీ ఇత్యాదిభాషల రామాయణములగూర్చి ప్రయత్నించిరా? జావా, బలి, మలయా, కాంబోడియా, సయాము, బర్మా మొదలగు దూరప్రాచ్యభూములలో రామాయణకథ బహుముఖముల వ్యాప్తిచెందినది.ఆ వివరములు కూడ తెలుపని రామాయణ సమీక్ష సమగ్రము కానేరదు. పైవన్నియు నొకఎత్తు, సంస్కృత మొకయెత్తు. ఇది సంస్కృత శాఖవారు కూర్చిన పరిషత్తు. సంస్కృతములో ఏయే రామాయణములున్నవో, సంస్కృత కావ్యములలో, నాటకములలో రామకథాగంగ ఎట్లు సంపన్నమై పొంగి పారినదో తెలుపకుండుటమాత్రము క్షంతవ్యము కాదు.

పుస్తకము కూర్పుకూడ సరిగా యూనివర్శిటీవారి సెలెక్షన్సు టెక్స్టు పుస్తకమువలెనే అనాకర్షకముగా ప్రచురింపబడుట కూడ విషాదకరముగా నున్నది. ఈ విధముగానున్న ఈ 116 పేజీల గ్రంథము వెల రు. 5/— లు పెట్టుటలో ప్రచురణకర్తల ఉద్దేశము బోధపడుటలేదు. అచిరకాలముననే సమగ్రమైన రామాయణ పరిషత్తు జరిపి, సర్వాంగ సుందరముగా మరొక సమీక్షాగ్రంథమును శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీవారు ప్రకటించి శ్రీమద్రామాయణ ప్రియులయు సహృదయులయు మన్ననలకును కృతజ్ఞతకును ఇతోధికముగా పాత్రులగుదురు గాక!

—నోరి నరసింహ శాస్త్రి.

# ఆధునిక చరిత్ర

('ఆధునిక చరిత్ర' మూలం: ఎ. వి. ఎఫిమావ్. అనువాదకుడు: రాచమల్లు రామచంద్రారెడ్డి. విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్. విజయవాడ—2. వెల: 9—00.)

ఎఫిమావ్ మరియు ఐదుగురు యితర రచయితలు కలిసి 'ఆధునిక చరిత్ర' అను యీ గ్రంథాన్ని రష్యన్ భాషలో వ్రాశారు. దానిని ఆంగ్ల భాషనుండి తెలుగులోనికి రాచమల్లు రామచంద్రారెడ్డిగారు అనువదించారు. అనువాదం సరళంగా వుంది.

'మహా విప్లవకారులూ, మహావిద్యావంతులూ ఐన మార్క్స్—ఏంగిల్సులు సమాజ అభివృద్ధిని గురించి ఒక సిద్ధాంతం రూపొందించినారు. ఆ సిద్ధాంతాన్ని చరిత్ర గతి పూర్తిగా బలపరుస్తున్నది' (పేజి. 10) అని యీ 'ఆధునిక చరిత్ర' కర్తల విశ్వాసం. ఆ సిద్ధాంతాన్ని లక్ష్యంగా పెట్టుకొని యీ పుస్తకం రచింపబడింది. కనుక అందలి సత్యాసత్యాలను తర్కించవలసిన అవసరం ఏర్పడుతున్నది.

19-వ శతాబ్దిలో కారల్‌మార్క్స్, ఫ్రెడరిక్ ఏంగిల్సులను యిరువురు మేధావులు గతితార్కిక భౌతికవాదమనే నూతన దర్శనాన్ని వెలయించినారు. ఆ దార్శనిక సిద్ధాంతాలను వారు సమాజ పరిణామానికి అన్వయించి ఆర్థికనియతి సూత్రాన్ని ప్రతిపాదించినారు ఈ ఆర్థిక నియతి సూత్రం ప్రకారం ఉత్పత్తి విధానం, ఆర్థిక స్థితిగతులు చరిత్ర పరిణామాన్ని నిర్ణయిస్తాయి. వాని మూలంగా సమాజంలో ప్రధానంగా రెండు వర్గాలు యేర్పడుతాయి. ఉత్పత్తి సాధనాలు స్వాధీనమందున్న వర్గమెప్పుడూ పాలకవర్గ మౌతుంది. అట్లులేనివర్గం పాలితులు. పాలకవర్గం పాలితులను దోచుకుంటుంది. ఈ రెండు వర్గాలమధ్య సంఘర్షణ అనివార్యం. ఈ సూత్రాన్ని పురస్కరించుకొని సమాజ పరిణామం అర్థం చేసికోవలసి వుంటుంది. సమాజం తొలిదశలో మానవుని జీవితం సాక్షాత్తు ప్రకృతిమీద ఆధారపడి వుంది. అప్పుడు సొంత ఆస్తి లేదు. ప్రాకృతిక వస్తువులను సమాజం ఉమ్మడిగా అనుభవిస్తూ వుండేది. తర్వాత సొంత ఆస్తి యేర్పడి బానిస యుగం ప్రారంభమైంది. బానిస యుగంలో బానిస యజమానులకూ బానిసలకూమధ్య వర్గపోరాటం జరిగింది. తర్వాత భూస్వామిక యుగం వచ్చింది. ఈ యుగంలో పాలకవర్గంగావుండిన భూస్వాములకూ దళితవర్గంగావుండిన రైతులకూ, పరిశ్రమలను అభివృద్ధి చేస్తూవున్న బూర్జువాలకూ మధ్య వర్గపోరాటం జరిగి పెట్టుబడిదారీ యుగం ప్రారంభమైంది. ఈవిధంగా చరిత్ర పరిణామంలో వర్గపోరాటం అనివార్యమని మార్క్సిస్టు సిద్ధాంతం తీర్మానించింది. ఇక పెట్టుబడిదారీయుగంలో ప్రధాన ఉత్పత్తి సాధనం యంత్రం. యంత్రాధిపతులు అనగా పెట్టుబడిదారులు అధికారం స్వాయత్తం చేసికొంటారు. లాభంకోసం పెట్టుబడిదారులు ఉత్పత్తి సాగిస్తారు. వారు కార్మికులకు కేవలం బ్రతకటానికి కావలసినంతమాత్రమే యిస్తూ అదనపు విలువను అపహరిస్తారు. దీనివల్ల పెట్టుబడిదారులకూ శ్రామిక వర్గానికీమధ్య పోరాటం తప్పదనీ, విప్లవం రాక తప్పదనీ, శ్రామికవర్గం జయించితీరుతుందనీ, ముందుగా శ్రామికనియంతృత్వం నెలకొల్పబడుతుందనీ, తర్వాత వర్గాలు అంతరించి, దోపిడీరహితమైన సోషలిజం యేర్పడుతుందనీ మార్క్సిస్టు సిద్ధాంతం ఉద్ఘాటిస్తున్నది.

పైన పేర్కొన్న మార్క్సీయ చారిత్రకవాదం సిద్ధాంతరీత్యా అహేతుకం. అనుభవం దృష్ట్యా అవాస్తవికం. సమాజపరిణామానికి ఉత్పత్తి విధానమే మూలకారణం కాదు. రాజకీయ విప్లవాలు, శాస్త్రపరిజ్ఞానం, వ్యక్తుల ప్రాబల్యం, భావాలప్రభావంకూడ ముఖ్యకారణాలే. ఆర్థికస్థితిలోనిమార్పే మానవచరిత్రలోని ఇతర పరివర్తన లన్నిటికీ పరమకారణం అయితే ఆర్థిక స్థితిలో వస్తున్న యీ మార్పు దేనివల్ల కలుగుతున్నది ? ఈ ప్రశ్నకు మార్క్సిజంలో సరియైన సమాధానం లభింపదు. ఉత్పత్తివిధానం సర్వం నిర్ణయిస్తుందన్న వాదం శాస్త్రకారుల, మహాపురుషుల ప్రాముఖ్యాన్ని వివరింపలేదు. పైగా యీ వాదం చరిత్రను ఒక సాంఘికశాస్త్రంగా పరిగణించటంలేదు. అహేతుకమైన గతితర్కాన్ని సమాజపరిణామానికి సంధించి, వర్గపోరాటమనే ఏకగతిని చరిత్రకు కల్పించి, యీ వాదం చరిత్రను ఒక కర్మసిద్ధాంతంగా, ఒక జోస్యం చెప్పేపద్ధతిగా చిత్రిస్తున్నది. అందుకే ప్రొఫెసర్ సెబైన్ ఈ క్రింది విధంగా వ్రాస్తున్నాడు :—

("The notion that society advances with iron necessity toward an inevitable goal

belongs to the realm of religion or fate rather than to that of science or history.'')

ప్రాచీన చరిత్ర మాట ఎలా వున్నా, కనీసం గత వందయేండ్లలో వచ్చిన చారిత్రక పరిణామాలనైనా యీ వాదం సహేతుకంగా వివరింపగలదా? అంటే లేదనే చెప్పాలి! మార్క్సీయ సిద్ధాంతం ప్రకారం పెట్టుబడిదారీ వ్యవస్థలు విచ్ఛిన్నం కాలేదేమి? ఆ సిద్ధాంతం ప్రకారం పారిశ్రామిక దేశంలో రావలసిన సోషలిస్టు విప్లవం పారిశ్రామికంగా వుకబడిన రష్యా, చైనాలలో ఎలా వచ్చింది? సోషలిస్టు వ్యవస్థకు ప్రతిగా ప్రజాస్వామ్యం బలపడిందేమి? ప్రజాస్వామికదేశాలలో కార్మికుల స్థితిగతులు నానాటికీ మెరుగైనవేమి? సోషలిస్టురాజ్యాలమధ్య సయోధ్య ఎందుకులేదు? ఈ ప్రశ్నలకు ఆర్థిక నియతివాదం సంతృప్తికరమైన సమాధానాలు యివ్వలేదు. కాగా మార్క్సీయ చారిత్రక సిద్ధాంతం గత చరిత్రను తప్పుగా అర్థం చేసుకొంది. భవిష్యత్తును తప్పుగా చిత్రీకరించింది.

అయినప్పటికీ యీ 'ఆధునిక చరిత్ర' మార్క్సిస్టు సిద్ధాంతాలు అనుల్లంఘనీయాలనీ, కారల్‌మార్క్స్—లెనిన్ మహాశయుల సూక్తుల ప్రకారమే చరిత్ర నడిచిందనీ, 'ప్రపంచంలోని అన్నిజాతుల ప్రజలకూ కమ్యూనిజమే భవిష్యత్తు' (పేజి. 30) అని ఘోషిస్తుంది. ఈ గ్రంథంలో 1640 నుండి 1918 వరకు జరిగిన చరిత్ర సమీక్ష చేయబడినది. 1640 లో ఇంగ్లండులో వచ్చిన విప్లవం పెట్టుబడిదారీ వ్యవస్థకు నాంది యనియూ, 1917 అక్టోబర్‌లో జరిగిన రష్యా విప్లవం సోషలిస్టు వ్యవస్థకు నాందియనియూ గ్రంథకర్తల విశ్వాసం. మార్క్సిస్టు సూత్రాలను తు. చ. తప్పకుండా అన్వయించాలంటే కొన్ని వాస్తవాలను మరచి, కొన్ని సంఘటనలను విరిచి, చరిత్రనూ, చారిత్రక వ్యక్తులనూ 'చిత్రవధ' చేయవలసివుంటుంది. అందువలన అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలు బహుళం కాకతప్పవు. అందుకు యీ 'ఆధునిక చరిత్ర'యే నిదర్శనం.

ఈ పుస్తకంలో 'ప్రవేశిక' అను భాగంలో ప్రాచీన యుగంలోనూ, మధ్యయుగంలోనూ జరిగిన సామాజిక అభివృద్ధియొక్క ముఖ్యలక్షణాలు వివరింపబడినాయి. ఈ భాగంలో నవీనయుగోదయానికి తోడ్పడిన సాంస్కృతిక పునరుజ్జీవనం (రినైజాన్సు), మత సంస్కరణోద్యమం (రిఫర్మేషన్)వంటి ఉద్యమాల ప్రాముఖ్యం చర్చింపబడలేదు. పైగా యెటువంటి ఉపపత్తులు చూపకుండా కొన్ని తీర్మానాలు చేయబడినాయి. ఉదాహరణకు:—'క్రీ. పూ. నాల్గవ సహస్రాబ్దికీ క్రీ. పూ. మొదటి సహస్రాబ్దికీ మధ్య నైలునదీ లోయలోనూ, టైగ్రిస్, యూఫ్రటిస్ నదుల లోయల్లోనూ, భారత దేశంలోనూ, చైనాలోనూ విశాలమైన ప్రాంతాల్లో బానిస నియంతృత్వాలు విస్తరించి ఉండేవి. గ్రీసులోనూ, రోములోనూ అవి అత్యున్నత దశను అందుకున్నాయి.' (పేజి 15). యూరప్‌లో 5 వ శతాబ్ది కాలంలో ఫ్యూడల్ వ్యవస్థ యేర్పడిందంటూ 'ఆసియాలో ఈ మార్పు కొన్నిదేశాల్లో ముందుగానూ, కొన్నిదేశాల్లో కొంత తర్వాతనూ వచ్చింది.' (పేజి 18) అంటే పాఠకుడు యేమని నిర్ణయించుకోవాలి? చారిత్రక గ్రంథాల్లో స్పష్టతలేని యిటువంటి వాక్యాలు గర్హ్యనీయాలు.

ఈ గ్రంథంలో చరిత్రను వర్గపోరాటంగా బుజావు చేయటానికి యత్నం జరిగింది. అందువల్లనే ఒక్క కలం పోటుతో ఆంగ్ల, ఫ్రెంచి, అమెరికా విప్లవాలూ, వలసదేశాల్లోవచ్చిన జాతీయ పోరాటాలూ, వర్గపోరాటాలుగా బూర్జువా విప్లవాలుగా వర్ణింపబడినాయి. 'అమెరికన్ రాజ్యాంగచట్టంలోని కొన్ని మౌలిక సూత్రాలూ, రాష్ట్రాల రాజ్యాంగచట్టాలూ

స్పష్టంగా ప్రజలకు వ్యతిరేకంగా ఉద్దేశింపబడినాయి' (పేజి 76) అనియూ, అమెరికాలోని సుప్రీంకోర్టు 'సామాన్య ప్రజలకు వ్యతిరేకంగా బూర్జువాలను పదేపదే బలపరిచింది' (పేజి 77) అనియూ యీ చరిత్ర కర్తల తీర్పు. ఫ్రెంచి విప్లవం వ్యక్తిగతమైన ఆస్తి హక్కును గుర్తించి వర్గపీడనను సమర్థించినదని వీరి నిర్ణయం. (పేజి 107). నెపోలియన్ ప్రవేశపెట్టిన చట్టాల ప్రధాన ఉద్దేశం తమ ఆస్తులను అనుభవించుకోటానికి బూర్జువాలకు హామీలు యివ్వటమేనట! (పేజి 144). ఈ చరిత్రకర్తల నిర్ణయాలు ఎంత అస్పష్టంగా, అవాస్తవికంగా వుంటాయో యీ క్రింది ఉదాహరణలు ఋజువు చేస్తాయి. 'భారతదేశంలోని అస్పృశ్యులు మొత్తం సమాజానికి చెందిన బానిసలు' '18-వ శతాబ్ది మధ్యలో ఫ్యూడల్ యుద్ధాలమూలంగా, రైతు తిరుగుబాట్లమూలంగా, మొగల్‌సామ్రాజ్యం విచ్ఛిత్తి పొందింది' (303 పేజి), '1857—1859 లో భారతదేశంలో బలీయమైన ప్రజా తిరుగుబాటు జరిగింది. ప్రధాన తిరుగుబాటుకర్తల్లో సిపాయిలూ, రైతులూ, చేతిపనులవాళ్ళు వున్నారు'. (308 పేజి). 'ఇంగ్లీషు కార్మికులకు మార్క్సిస్టు రకం రాజకీయ పార్టీని నిర్మించుకోవలసిన అవసరం గుర్తించేటంత పరిణతిలేదు.' (458). 'ఐశ్వర్యాల్లో పొరలాడే కొద్దిమంది దురహంకృత కోటీశ్వరులకూ, నిత్యం కటిక దరిద్రపు అంచులో బ్రతికే లక్షోపలక్షల కార్మికులకూ మధ్యవుండే అగాధంవిషయంలో అగ్రదేశం అమెరికా.' (501 పేజి).

కొందరు చారిత్రక వ్యక్తులను వర్ణించిన తీరు యీ గ్రంథకర్తల దృక్పథంలోని బలహీనతను చాటుతోంది. అందుకు ఈ క్రింది ఉదాహరణలు చూడండి:—'వోల్టేరుకు విప్లవమంటే భయం' (95 పేజి). 'రూసో బూర్జువా పరిపాలన స్థాపించటానికి పోరాడినాడు.' (97 పేజి). 'లాయిడ్ జార్జి సామాన్య ప్రజలను మోసగించటంలో సిద్ధహస్తుడు.' (460 పేజి). 'అమెరికన్ సామ్రాజ్యవాదుల్లో అత్యంతదురాక్రమణశీలవర్గాలప్రతినిధి రూజ్వెల్టు' (513 పేజి). 'ప్రెసిడెంట్ విల్సన్ అమెరికన్ కోటీశ్వరుల ప్రతినిధి' (520 పేజి). కమ్యూనిస్టులు ప్రతిపాదించిన విప్లవమార్గాలను తిరస్కరించిన సోషలిస్టు నాయకులను యీ గ్రంథం పెట్టుబడిదారుల ఏజెంటులనీ, అవకాశవాదులనీ అవహేళన చేస్తోంది. 'లూయీబ్లాంక్ సోషలిస్టునని చెప్పుకున్నా, కార్మికులకు ద్రోహం చేసినాడు' (245 పేజి). 'ఫ్రెంచి రచయిత, ప్రాతికేయుడూ అయిన ప్రౌధన్‌కు యేవీ తెలియకపోయినా అహంకారం యెక్కువ' (352 పేజి).

1917 లో రష్యాలో జరిగిన సోషలిస్టు మహావిప్లవం 'భూములను పారిశ్రామికసంస్థలనూ సమాజ ఆస్తిగా ప్రకటించి, దోపిడీని సకలరూపాలలోనూ రద్దుచేసింది' (107 పేజి) అని యీ గ్రంథం విశ్వసిస్తోంది. భూములనూ, పరిశ్రమలనూ సమాజఆస్తిగా ప్రకటించితే దోపిడి ఎలా రద్దు అయిపోతుంది? అప్పుడు అదనపు విలువ ఏమయిపోతుంది? సమాజపరం చేయటమంటే ప్రభుత్వ యాజమాన్యంలో వుంచటమేగదా? దానివలన ప్రభుత్వానికి విస్తృతమైన నిరంకుశాధికారాలు దత్తంచేయటమేగదా?—ఇటువంటి ప్రశ్నలకు యీ గ్రంథంలో సమాధానాలు దొరకవు.

మార్క్సిస్టు కళ్లజోడుతో చరిత్రను పరిశీలించినందువల్ల ఈ 'ఆధునిక చరిత్ర' రచయితలు అనేక ముఖ్యవిషయాలను వదలిపెట్టినారు. వారు ఉత్పత్తి విధానానికీ, ఆర్థికస్థితిగతులకూ, కార్మికోద్యమాలకూ అత్యంతప్రాధాన్యం యిచ్చారు. శాస్త్రపరిశోధనలకూ, సాంకేతిక విజ్ఞానానికీ, భావవిప్లవాలకూ, తాత్త్వికపరిణామాలకూ, సంస్కృతీ వికాసానికీ యీ 'చరిత్ర'లో స్థానం లభింపలేదు. ఇక ఆధునికయుగంలో చెప్పుకోతగిన అనేక చారిత్రక సంఘటనలు—ముఖ్యంగా జాతీయరాజ్యాల అవతరణ, జాతీయవాద విజృంభణ, ప్రజాస్వామ్య వికాసం, సోషలిస్టుభావాల ప్రగతి, సెక్యులర్ సమాజపరిణామం, పెట్టుబడిదారీవ్యవస్థలో వచ్చిన సంస్కరణలూ—మొదలయినవి ఇందులో కనపడవు. పైగా ఆసియారాజ్యాల చరిత్రకు తగినంత ప్రాధాన్యం లేకపోవటం యీ గ్రంథంలోని మరొక లోపం.

ఈ 'ఆధునిక చరిత్ర' సంకుచిత మార్క్సీయ

సిద్ధాంతపు చట్రంలో పోతపోయబడిన గ్రంథం. మార్క్సిస్టు సిద్ధాంతంలోని ముఖ్యలోపాలన్నీ ఇందులో గోచరిస్తున్నాయి. మార్క్సిజంపట్ల మూఢ విశ్వాసం కలవారు బహుశా దీనిని మెచ్చుకోవచ్చు. సమగ్రమైన యదార్ధ చరిత్రనూ, సాంస్కృతిక వికాసాన్నీ తెలిసికొనగోరు సత్యప్రియులకు ఇది నిరుపయోగం!

—కె. వి. ఆర్.

## పై రు గా లి

[కథల సంపుటి: రచన: శ్రీ కలువకొలను సదానంద. ప్రకాశకులు: విశ్వప్రభ ప్రచురణలు: పాకాల, చిత్తూరుజిల్లా వెల: రు. 2–25.]

ఈ సంపుటిలో పైరుగాలి, సూత్రధారి, అప్పిచ్చువాడ, వింతరైలు, ఆదర్శం, భేతాళకథ, అన్నదాత, ఉన్నమాట, పిల్లనగ్రోవి, చక్రం—అనే పది రచన లున్నాయి. అన్నీ యింతకుముందు వివిధ పత్రికలలో ముద్రితమైనవే...

ఈ రచనలన్నీ 'కథ'లని చెప్పేందుకు వీలు లేదు. రచయిత తాను చెప్పదలుచుకున్నదాన్ని సూటిగా, సేరుగా చెప్పడంతప్ప కథా స్వరూపాన్ని గురించి ఎక్కువగా పట్టించుకోలేదనిపిస్తుంది. రచనలలో చక్కని కథనమూ, శక్తివంతమైన ఆలోచనా ధోరణీ గోచరిస్తున్నాయి కాని, 'కథలు'గా పఠితల మనసులలో నిలిచిపోగల లక్షణం లోపించిందని చెప్పక తప్పదు అయినా రచయితకున్న కథనచాతురీ, ఆహ్లాదకరమైన శైలీ మిక్కిలి మెచ్చదగినవి.

'పైరుగాలి'లో బుద్ధిగా చదువుకుంటున్న రాధమ్మ ఏమీ చదువుకోని రాముడికి మనసిచ్చి, మను వాడటం రచయిత నేర్పుగా చిత్రించారు. 'సూత్రధారి' కథలో ఇంకా ఉయ్యాలలోనే ఉన్న తన పసికందు పెరిగి పెద్దవాడైనతర్వాత ఆడుకునేందుకు పనికివస్తుందని సుభద్రమ్మ పొరుగుపిల్లలాడు కుంటున్న బంతిని మురుగుకాల్వలోనుంచి తీసి దాచింది. కాని గంగాబాయి గయ్యాళిలా బంతి దొంగను నానాదుర్భాషలూ ఆడుతూవుంటే వినలేక కళ్లనీళ్ల పర్యంతమై చివరకు ఆ బంతిని చాటుగా అక్కడే పారేస్తుంది సుభద్రమ్మ......ఇది ఈ సంపుటిలో మరొక చక్కని రచన......నిరంతరదానశీలుడైన విశ్వనాథం చాలామందిని క్షుద్బాధనుంచి రక్షించాడు. కాని అవసరసమయంలో అతన్ని ఆదుకునేవారే కరువైనారు. విశ్వనాథం మరణం మంచితనానికి మరణం వంటిది. 'అన్నదాత' అనే శీర్షిక క్రింది ఆ రచన అందువల్లనే గుండెలను కదిలించగలదు.

'అప్పిచ్చువాడ', 'వింతరైలు,' 'భేతాళకథ', 'చక్రం', కూడా బాగున్నాయి. ఆదర్శం, ఉన్నమాట, పిల్లనగ్రోవి ఈ మూడూ అంతంతమాత్రపు రచనలు.

రచయిత కథాస్వరూపాన్నిగురించి మరికొంచెం ఆలోచించి కృషిచేస్తే మిక్కిలి మంచిరచనలు చేయగలరని ఆశించేందుకు ఈ సంపుటి బలమైనసాక్ష్యమే యిస్తున్నది.

—వ.

## హౌ స్ స ర్జ న్

[నవల. రచయిత: శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు. ఎమెస్కో పాకెట్ బుక్ ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో. మచిలీపట్నం, మద్రాస్, సికింద్రాబాద్. ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్. వెల: రు. 2–00 పేజీలు: 228]

డా॥ ఎస్. మధుకరరావు హౌస్ సర్జన్సీ చేస్తున్న, ఉత్సాహవంతుడైన, పెళ్లికాని యువకుడు. ప్రేయసిని చూడాలని ప్రియుడుపొందే తపనతో తుల్యమయింది, మధు, వైద్యవిద్య లోతులు తెలుసుకొనే కోర్కెతో పొందుతాడు.

ఈ నవలలో రకరకాల జబ్బులు, (ఎందరు మనుష్యులో అన్నిరకాల జబ్బులు) వాటికి డాక్టర్లు ఏం మందులు వాడుతారో, ఆమందులు—వాటి పేర్లు, హాస్పిటలలో తిరిగే డాక్టర్లు, నర్సులు పేషెంట్లు, రోగులవెంట వచ్చినవాళ్ళు మందుల వాసనలు అదొక ప్రత్యేక లోకం.

ఒక వృత్తికి సంబంధించిన నవల, 'డాక్టరుకథ' తప్ప ఇంతవరకు ఆంధ్రసాహిత్యంలో వెలువడి

నట్లు లేదు అంతా వైద్యవృత్తి సంబంధి సంగతిగా ఉన్న ఈ నవల ఈకోవలో గుర్తింపదగింది.

శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావుయం.బి.బి.యస్. పూర్తిచేసి, హౌస్ సర్జన్సీ పూర్తిచేసి డాక్టరుగావున్న రచయిత. పేరు ముందు 'డా॥' అని పెట్టుకోక పోవటం సరసపాఠకులు గమనించిన రచయిత. సంయమనం హర్షింపదగింది.

ఈ నవలలో పాత్ర అయిన మధు వైద్యవృత్తి ప్రాణప్రదంగా భావించుకొన్న యువకుడు. ఆ రంగంలో ఈ జీవితంలో తెలుసుకో గలిగిందంతా తెలిసికొని, దానివల్ల తన ప్రజలకు ఏవో మేలుచేయాలని భావించే యువకుడు. కాల్పనిక మనస్తత్వం విస్తారంగా గుండెలునిండ నింపుకొన్న సమాజాభ్యుదయ కాంక్షా జీవి. అంతకంటే పైకి పైపైకి పోవాలని తలంచే తృష్ణకలవాడు. హౌస్ సర్జన్సీ పూర్తి అయిన వెంటనే పై చదువులకోసం పైదేశం అయిన యునైటెడ్ కింగ్‌డమ్ వెళ్ళిపోయాడు.

ఈ మధుచుట్టూ చాలా పాత్రలు ఉన్నాయి. డాక్టర్లు, హౌస్ సర్జన్లు, మొదలైనవాళ్ళు. ఇంకా రోగులూ వాళ్ళవాళ్ళ రోగాలూ ఉన్నాయి. అయితే ముఖ్యమయిన పాత్రలు రెండు. నళిని నర్సు! మృదుల హౌస్ సర్జన్!

మృదుల, నళిని అక్కచెల్లెళ్ళవంటి వారు. ఇద్దరూ మధును ప్రేమించారు. నళినిపాత్ర ఎగ్రెసివ్‌గా వుంటుంది. మృదుల పాత్ర డిఫెన్సివ్‌గా వుంటుంది. ఇద్దరికీ మాట్లాడటం బాగాచేతనవుతుంది. మృదులలో వక్రోక్తి ఎక్కువ. నళినిలో స్వభావోక్తి.

నళిని మాటలు నిష్కల్మషంగా, ఆత్మీయంగా, వుంటాయి. ఆమె ప్రేమలో స్వార్థంలేనట్లు రచయిత చిత్రీకరణ కొంతవరకు సహజంగానే వుంటుంది.

మృదుల పెద్దయింటి అమ్మాయి. మధును పెళ్ళిచేసుకోవాలని ఆశపడుతుంది. అయితే కంగారు పడదు.

మధు తండ్రిలేడు. తల్లివుంది. బీద కుటుంబం. కష్టాలుపడి చదువుకొన్నాడు. ఆశలున్నవాడు. అనురాగం ఉండీ లేనివాడు. నళినిని ప్రేమించాడో లేదో, మృదులను పెళ్ళాడగలడో లేడో తెలుసుకోలేనివాడు. యువకుల అవ్యవస్థకు ప్రతీకవంటివాడు.

అర్ధరాత్రి, ఎవరూ లేనప్పుడు ఒంటరిగా ఉన్న వాడి ప్రక్కలో—భార్యగానీ, ప్రేయసిగానీ, కానటువంటి యువతి, ప్రేమించిందే అయినా—కూర్చుంటుందా? అవుననికాని, కాదనికాని చెప్పటం కష్టం! పృథ్వి విశాలమయింది. ఏమయినా జరగవచ్చు.

అయితే, ఆ యువతిని, యువకుడయినవాడు కోర్కెలున్నవాడు, మాటలతో మానిని మనస్సు దొంగిలించగలవాడు, ఏదోఉన్నట్లు మాట్లాడే అలవాటున్న—యువకుడు 'నీ కేమైనా పిచ్చిపట్టిందా?... ఈ సాహసం బాగులేదు.' అంటాడా? లోకంలో ఏం జరుగుతుందోగానీ, నవలలోమాత్రం, మధు ఆమాటలు అన్నాడు. మరి, ఆమె వెళ్ళిపోయిందా? పోలేదు. అయితే ఆపైన ఏంజరిగింది! కొంచెం జరిగింది. ఆ కథా కమామీషు బ్లాక్ అండ్ వైట్‌లో ఉన్న నవలలో చదవండి.

ఈ నవలలో లేడీడాక్టర్లు చేసేపనులు వగైరా వగైరా చదివింతర్వాత, కాల్పనిక జగద్విహారంచేసే యువకు లెవరైనా, పెళ్ళికాని ఆడపిల్లలయిన డాక్టర్లను పెళ్ళిచేసుకొందామనే ఆశ ఇంకా జీవింప జేసుకొంటారా? అనుమానం!

మధు చాలా రోగాలకు, చాలామందులు నవలలో చెప్పేశాడు. వైద్యవృత్తి స్వీకరించిన శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు వ్రాసిన నవల కొబట్టి ఆ యాజబ్బులకు ఆయామందులు సరైనవే అయివుంటాయి. ఆ దృష్టితో ఇదొక కేటలాగ్ అయ్యే అవకాశం వుంది.

నవలలో రోగులు పొందే వేదన బాధలు కళ్ళకు కట్టినట్లు గోచరిస్తాయి. హాస్పటల్ వాతావరణం నవల చదువుతుంటే నేత్రాలముందు ఆవృత మవుతూ వుంటుంది.

బ్రెస్ట్‌కేన్సర్‌ను గుర్తిపట్టించుకోని డాక్టర్! గుండెనొప్పి అని చెబుతున్న పహిల్వాన్‌వంటి వ్యక్తి హౌస్ సర్జన్ పరాచికం భరించలేక కూలబడటం,

ఆ రాత్రి హౌస్ సర్జన్ బద్ధకించటంవల్ల మరణించిన పసిబిడ్డ, తమ జబ్బులు నయంచేసే భగవంతుడుగా డాక్టరుకు అన్నిసంగతులూ చెప్పుకొనే పల్లెజనం. పెన్సిలిన్ ఇంజక్షన్ రియాక్షన్ వచ్చి చనిపోయిన పసిబిడ్డ, ఎన్నోకేసులు కళ్లముందు తారాడుతాయి. హాస్పటల్ వాతావరణం హృదయ విదారకంగా వుంటుంది. చూచి భరింపలేని వ్యక్తులు ఈ నవల చదివికూడా భరించలేరు. ఈ నవల చదవటానికి కొద్దో గొప్పో ధైర్యం కావాలి!

నిద్రపోతున్న రాజేశ్వరిని తట్టిలేపిన రోగి వ్యవహారం నవ్వు తెప్పిస్తుంది. అది భరింపదగిందిగానే వుంది. అయితే సుందరం ఎగ్జామినర్స్ ఎదుట నిలబడటం, ఆ ఘట్టం నవ్వుతెప్పిస్తుందికాని వాస్తవికంగా వుండదు. హాస్యంకోసం, అవాస్తవికత నవలకు ఆపాదించుకోనక్కరలేదు.

డాక్టర్ చాగంటి సూర్యనారాయణమూర్తి వ్రాసిన 'డాక్టరు కథ' ఈ 'హౌస్ సర్జన్' చదువుతుంటే తేపతేపకూ గుర్తుకు వస్తూవుంటుంది. ఒక రోగి, రోగం గూర్చి డా॥ మూర్తి ఆ పుస్తకంలో స్వగతంగా పలుక్కొనే దానికీ, అదే స్థితిలో ఈ నవలలో శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు అనుకొనే దానికి సంబంధం కనిపిస్తూ వుంటుంది.

ఈ 'హౌస్ సర్జన్'లో హౌస్ సర్జన్సీ చేస్తున్న డాక్టరు మధు తన అనుభవాలు క్రమంగా చెప్పుకుంటూ పోతూవుంటాడు. నవల అంతా ఉత్తమ పురుషలో చెప్పబడింది. 'సౌభాగ్యవతి' ఉత్తమ పురుషలో వ్రాయబడిన ప్రథమాంధ్ర నవల. తరువాతిది. 'గృహం విడిచింది'. 'సౌభాగ్యవతి'లో డాక్టర్ మాధవ్ తన జీవితం, హాస్పిటల్ అనుభవాలుతో సహా చెప్పుకుపోవటం కనిపిస్తుంది. ఈ 'హౌస్ సర్జన్' ఆ కోవలో మూడో నవల.

ఇటువంటి నవలలు ఆంధ్ర సాహిత్యంలో ఇంతకు పూర్వం లేవు. వస్తు విశిష్టత, రచనా విశిష్టతలచేత, ఇటువంటి నవలలు పాఠకలోకం బాగా ఆదరిస్తుంది.

మధు, మృదుల, నళిని ఈ మూడు పాత్రలు కొద్దిలో కొద్ది కాల్పనికంగా కనిపిస్తాయి. మృదుల స్వార్థ కాంక్షామయజీవితం తప్పులేదనిపిస్తుంది. నళిని త్యాగమయశీలం వెనుక కోరిన ఆనందపు కలయిక తృణీకరింపబడి జాలి కలుగుతుంది. మధు అమాయకుడు, అర్భకుడులాగా కనిపిస్తాడు.

ఇటువంటి కథలు సినిమాకు బాగా పనికి వస్తాయి. అసహజంగావుండే సినిమా కథలకు, సహజతాసహజతల సమ్మిశ్రితరూపంలోఉన్న ఈ నవలలోని కథ తీసిపోదు.

ఉత్తమ నవలా రచయితగా పేరొందిన శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు రచించిన ఈ నవల 'హౌస్ సర్జన్' పాఠకుల ఆమోద పాత్రమవుతుంది.

## పిడికెడు ఆకాశం

[నవల: రచయిత: శ్రీ గొల్లపూడి మారుతీరావు. ఏమెస్కో పాకెట్ బుక్. వెల: రూ 2—00. పేజీలు 208]

దేశం ఎదగడం మానుకొంది. సమాజం తలలోంచి పుట్టగొడుగులు పుట్టుకువస్తున్నాయి. జాతి జీవితం వక్రపథంలో పయనిస్తూవుంది. వెనుదిరిగి చూచుకోకపోతే పరిష్కారం వుండని పతనంలో పడుతుంది. ఎందుకీసమాజంలో కొందరి నుదుటమీద పొద్దు పొడుస్తుంది? ఎందుకు కొందరి బ్రతుకులిలా తెల్లవారుతాయి? ఇదంతా వాళ్లు చేసుకొన్న పాపమా? అందరి పాపాలు ఏకీకృతమై సీతరూపం రూపొందిందా అనిపిస్తుం దీనవల చదివి ముగించిం తర్వాత.

ఏం తప్పుచేసింది సీత? ఎందుకింత పరిష్కారం అసాధ్యం అయ్యే జీవిత విషవలయంలో బంధింపబడింది—అనే ఆలోచన రేకెత్తిస్తుం దీరచన.

సీత అయినింట పుట్టిన అమ్మాయి కాదు. అయినా ఆమెలో ఆర్థికలోపం వ్యక్తిత్వలోపంగా, గుణలోపంగా రూపొందలేదు. వయస్సు కొనితెచ్చిన గుండె బరువు పండువెన్నెల అయితే, ఆ వెన్నెల వలచిన వాళ్లు వంచించే వాళ్లవుతారని ఆమె అనుకోలేదు.

ప్రేమించినవాణ్ణి సర్వాత్మతో నమ్మటం తప్పుకాదు. వయస్సుకు సహజమైన కోర్కెలకు

మనస్సు సంచలించటం వింతకాదు. ఆమె వెర్రెక్కి గట్లు దాటి ప్రవర్తించే కోవలోకివచ్చే యువతీ కాదు. తనని తాను అదుపులో ఉంచుకోగల ఆత్మస్థైర్యం అలవర్చుకొన్న అమ్మాయి కాకపోలేదు. అయినా పతన మయింది. తిరుగులేని దెబ్బతింది.

గోపాలం సీతను మోసం చేయటంకోసం పుట్ట లేదు. ఆ మాటకొస్తే లోకం అంతటినీ జులుం చుట్టి చలాయించి పరిపాలించాలని అయితే అందిన ఆనందం అరక్షణంకూడా ఆలస్యం చేయకుండా అభిమానించే గుణం పుంజుకొన్నవాడు, అందుకే బలహీనపు నేలలోంచి బలంగా పెరుక్కు వచ్చిన పిచ్చిమొక్కను నేర్పుగా గుంజుకొన్నాడు. సీత శీలం చెడిం దయిపోయింది.

ఆమె అలాగే అయిపోవాలని అతను అనుకో లేదుగానీ, అనుకోని అవాంతరంవచ్చి, సీతకు దూర మయి పోయాడు. అంతరంకాని అవక తవకలు బాహిరంగా బాహిరిల్లి లోతుల్లో హృద యాలనిండా ఎలాంటి గతుకులు సృష్టించి బతు కులకు అతుకులు వేస్తాయో నవల నిలువుటద్దం లాగా చూపుతుంది.

ఆ పైన నాగరాజు కథ నాజూకుగా ప్రారంభ మవుతుంది. అతనికి సీతపై ఎనలేని గౌరవం వుంది. ఉన్నది వూరికే వుండలేదు. ఆమెను ఉద్ధరిద్దా మనే తలంపును తలుపుచాటు నుంచి తయారుచేసి సిద్ధమయిన రంగస్థలంమీదికి ఒద్దికగా తీసుకు వచ్చింది.

గోపాలం మిత్రుడిగా, సీతను ఓదార్చవలసిన బాధ్యత తమ భుజస్కంధాలమీద గందరగోళంగా ఉందని నమ్మిన నాగరాజు సహృదయుడే అయికూడా, సీతా సముద్ధరణ కాంక్షా సంయుతుడైకూడా, పెళ్లి చేసుకొందా మనుకున్న వాడయికూడా సీత మొండి తనం, బండతనం, ఎండుగుండెతనం, మూర్ఖపు రాబందతనంనల్ల పరిస్థితుల ఒత్తిడికి లొంగిపోయి, సీతకు దూరమయి పోతాడు. ఆమె నుదుటిమీద రెండో మచ్చ కాంతిమంతంగా ముద్రితమయి పోయింది.

మాధవరావు చిన్నవాడు చితకవాడూ కాదు. పిల్లాజెల్లాలేని, అల్లాటప్పయ్య వెంకటప్పయ్య ఏమీ కాదు. ఎభై ఏళ్లు దాటాయి. లు పెళ్లీడు కెదిగిన వాళ్లు, కూతుళ్లున్నారు. కుంటికాలయితే నేమి కూతురుకు పెళ్ళి చేయగలవాడు, లౌక్యం తెలి సినవాడు. సీత నుదుటిమీద మంచితనం చాటున సహాయంమాట వెనుకనుంచి పెద్దతనం భద్రంగా మూట గట్టుకొని, ఆ మూటకు మూట సీతముఖం మీద కుమ్మరించి, ఆమె ముఖమంతా మచ్చ పడేట్లు చేస్తాడని ఎవరనుకొన్నారు? అయితే అంతా అయింది.

టైప్ నేర్చుకొన్న సీత ఉద్యోగంలో ప్రవేశించి గుర్నాథం అభిమానం సంపాదించుకొని జీవితం భారంగా నెట్టుకు వస్తున్న ఘడియల్లో తిరిగిన మలుపు సీత జీవితంలో ఏమయినా కాంతి ప్రస రిస్తుందా? ఆమె ముఖంలోని మచ్చల మాలిన్యం సౌజన్యం రబ్బరుతో తుడిచివేస్తుందా అని ఆశించే పరిస్థితి ఎదురవుతుంది.

రచయితలకు దయాదాక్షిణ్యాలు తక్కువగా వుంటాయనటానికి సీత నిదర్శనం. ఆమెకన్నీ కష్టాలే రావటం ఏమిటి? గుర్నాథంపై అధికారివచ్చి ఇన్‌స్పెక్షన్‌చేసి, అన్ని హంగులతో పార్టీ కావాలనటం ఏమిటి? అందుకు హంగుల్లో ఒక హంగుగా అంగంగా అంగన కావాలనటం సబబే అయితే అందుకు సీత సిద్ధంకావటం కోమల హృదయం ఉన్న పాఠకుల గుండె రంపపుకోతలో తెగిపోతుంది.

గుర్నాథం మంచివాడనుకొంటే, ఇంకింత మంచి పని చేస్తాడనుకొంటే సీత జీవితంలో సౌఖ్యపు వెలుగు పూవు కాంతుల పరిమళం విరజిమ్ముతుందనుకొంటే తపీమని గుర్నాథం ఆమెను సిస్టర్ అనటం ఏమంత బాగుంది? ఆమె తన శీలం తూలనాడబడాలని అనుకో నప్పుడు దయనీయంగా పరాభవింపబడింది. అర్ధ ఇష్టంతో, ఆమె అంగీకరించినప్పుడు అపజయం ఎదురుకొంది. ఇద్దరు మంచివాళ్లమధ్య ఆమె—అంత దాకా దుష్టుడైన ఒకడు—జీవిత పునరుద్ధరణ చేజేతులా చేసుకొంది పాపంకాదు పుణ్యం.

నవల చివరలో సీత ఒకప్రశ్నగా మిగిలిపోతుంది అది సమాధానం కాంక్షించే ప్రశ్న! వట్టిప్రశ్న కాదు.

శ్రీ గొల్లపూడి మారుతీరావు వ్రాసిన ఈ నవల ఒక మంచి సృష్టి! వాస్తవమో, అవాస్తవమో. గాని

కార్యకారణ సంబంధంతో వ్రాయబడిన ఈ నవలను పాఠకులు బాగా ఆదరిస్తారు.

రచయిత సృష్టించిన అన్ని పాత్రలు కళ్ళ ముందు మెదులుతాయి. చైతన్యవంతమయిన పాత్ర సృష్టి! మరుపురాని పాత్రలు చిన్నవే అయినా కుటుంబ రావు! గోవిందరావు! వర్ధనమ్మ! ఎంత చిన్న పాత్రలు అయినా ప్రత్యేక వ్యక్తిత్వంతో భాసించేవిధంగా రచయిత చిత్రించిన తీరు అభినందనార్హం.

శృంగార సంబంధి విషయాలు వ్రాసేటప్పుడు రచయిత వ్యక్తిగతంగా కంగారుపడటం నవలలో అంతమంచిదికాదు. ఎంత విషయం అయినా చెప్పవచ్చు గదా, పదాలు జాగ్రత్తగా ప్రయోగించుకొంటూ. 'ఆమె అతనికి ప్రయోగాలు నేర్పింది' అనటం బాగుంటే ఇక ఏమయినా వ్రాయవచ్చు.

గోపాలం పేరును కుదించి పాల్‌గా పిలవటంలో 'పాలు ఏమిటీ—పాలూ పెరుగు' అని అపహాస్యం చదువుతుంటే 'విష్ణుశర్మ ఇంగ్లీషు చదువు'లో డానియెల్ అనే పేరును డానియెల్ ఏమిటి ధనియాలు లాగా అన్న అపహాస్యం గుర్తుకు వస్తుంది.

'గోపాలానికి పెళ్లి ముఖ్యంకాదు — ప్రేమ ముఖ్యం' ఈ ప్రేమ అనే పదం స్త్రీ శారీరకవాంఛ అనే అర్థంలో ప్రయోగింపబడింది. అది సరసంకాదు.

నవలలో అక్కడక్కడ సమకాలీన సాహిత్యం పై చెణుకులున్నాయి. అవి నవలకు ఆధిక్యం ఆర్జింపవు. రచయిత అసహనంమాత్రం వ్యక్తం చేస్తాయి.

ఎక్కడో చదివిన వాక్యాలులాగా, గుర్తుంచు కొన్న భావాలులాగా, అక్కడక్కడా కొన్ని వాక్యాలు అనిపిస్తుంటాయి. ఈ రచయిత ఇతర రచనలలోని వాక్యాలో, మరి ఇతరుల సాహిత్యంలో ఏమూలనోవున్న వాక్యాలో ఇదమిత్థంగా చెప్పటానికి కుదరదుగానీ, కొన్ని వాక్యాలు చదువుతుంటే, ఈవాక్యాలు మేమెక్కడో చదివినట్లున్నాము అనిపిస్తుంది పాఠకులకు.

పాత్రలు, సంఘటనలు, కథ, అపురూప మయినవి కావు. కాని తీర్చిదిద్దిన తీరు, అందుకు చూపిన నేర్పు నవలకు శక్తిని ప్రసాదించాయి.

తెలుగు సాహిత్యంలో యువకుల ఉత్కంఠకు ఆహారంగా వెలికివచ్చిన రచన ఈ నవల. దీనిని చదివిన కోమల హృదయులు సీతపొందిన దయనీయ జీవితం తలుచుకొని ఒక నిమిషం అయినా బాధపడతారు.

## నిరీక్షణ

[నవల: రచయిత్రి: శ్రీమతి ఉన్నవ విజయ లక్ష్మి. ఏమెస్కో పాకెట్ బుక్. వెల: 2-00. పేజీలు 160.]

'రాధ అత్తవారింటికి వెళ్లిన మరుసటిరోజు నుంచి, క్రొత్త పెళ్లికూతురనే సంకోచం అయినా లేకుండా ఇంట్లో పనిపాటులన్నీ చేయిస్తుండేవారు.

తల్లిచాటు బిడ్డగా పెరిగిన రాధకు పెళ్లితో బాధలు ప్రారంభమయ్యాయి. అత్తింట్లో అందరూ ఆమెను బాధించారు. చివరకు భర్త కూడా ప్రేమగా చూచుకొంటున్నట్లు నటించి పుట్టింటినుంచి డబ్బు తీసుకురమ్మనే ప్రబుద్ధుడు.

రచయిత్రి రచన గనుక అత్తింటిలో అటు వంటి కష్టాలుంటాయాఅని సంశయం కలిగించుకో నక్కరలేదేమో !

రాధ ఏడుస్తూ ఇప్పించిన డబ్బుతో మోటారు సైకిల్ కొనుక్కొన్న భర్త, పట్నాంనుంచి తిరిగి వస్తూ ప్రమాదంలో పడి గతించాడు.

ఇక్కడ రచయిత్రి సాధించిన కవితా సత్యం గమనించిన పాఠకులు ఆనందిస్తారు.

చెడి, అన్నదగ్గరకు చేరుకొంది రాధ. అన్న ప్రకాశం, వదిన కామాక్షి. వదిన తమ్ముడు ఆంజనేయులు సార్థక నామధేయుడు.

'నిన్ను చూస్తే వెర్రి జాలేస్తుంది రాధా. నువ్వు పాపం, జీవితంలో ఏం చూశావని?...పోనీ అని మా అక్కయ్యకీ బావకీ అయినా నీకు మళ్లీ పెళ్లి చేద్దామన్న వుద్దేశ్యం ఎందుకు కలగదో......మా అక్కయ్య మరీను !...ఇంటి పనంతా నీచేత చేయిస్తూ నిన్నో దాసిదానిలా చూస్తోంది.'

ఆంజనేయులకు రాధంటే జాలి లేదు. వాంఛ వుంది. ఆమెను పెళ్లాడుదామనే సత్సంకల్పంలేదు.

తని మూలంగా ఆమె కష్టాలు మూడు పూలూ రు కాయలుగా విరాజిల్లాయి. రైలు క్రింద పడ ోయింది. సినీమాలో కథానాయకుడులాగా వేణుగోపాల వు వచ్చాడు. ఆమెను రక్షించాడు.

నవల ఈ సంఘటనతో ప్రారంభమవుతుంది. ంతకుముందు కథంతా ఫ్లేష్ బేక్‌లో చెప్పబడింది పయోజనం పరిశీలనార్హం.

అతను వేణుగోపాలరావు, ఆమె రాధ! ఇంకే ుంది వాళ్ళిద్దరికీ పెళ్ళయిపోతుంది. అయితే అంత ్వరగా కథ ముగిసి పోలేదు. రాధ మానసిక చాంచ ్యం ఆంజనేయులు దుష్టబుద్ధి, వేణుగోపాలరావుకు లిగిన అవాంతరాలు ఏకంఅయి కథ పెంచాయి.

పార్వతివంటి ఉత్తమ స్నేహితురాలు, ఇంది ంమ్మవంటి మంచి వాళ్ళు ఉంటే ఎవరకయినా ందుకుంటాయి కష్టాలు! అందుకే రాధ కష్టాలు ుంచుతెరలు విచ్చిపోయినట్లు తొలిగిపోయాయి.

'జరిగిందంతా మరిచిపోయి మనచేతిలో ఏమీ ేదు. మనం కేవలం పరిస్థితులకు బానిసలం' అని ేణు అంటే 'మిమ్మల్ని భర్తగా పొందగలిగిన నేనెంతో ుదృష్టవంతురాలని' అంది రాధ. ఆ పైన 'తృప్తిగా భర్తగుండెల్లో తలదాచుకొంది రాధ' నవల సమాప్తం.

రచయిత రచనలో స్త్రీని ఎలా చూస్తాడో తెలిసిం దానికంటే, రచయిత్రి రచనలో స్త్రీ స్త్రీని ఏ విధంగా దర్శిస్తుందో తెలిసి ఆనందం కలుగుతుంది. ఈ నవలలో ఆ దృక్కోణం వుంది.

ఈ నవలలో అంతా మంచితనం, లేదా అంత చెడ్డతనంతో పాత్రలున్నాయి కాని, మంచి చెడ్డల కలగలుపుగా పాత్రలు లేవు.

మంచివాడయిన వేణుగోపాలరావు — డాక్టర్— మంచిదయిన రాధతో, మంచిగా మసలుకొంటే కలిగిన కష్టం వాళ్ళకు ఎన్నో కష్టాలు కలిగించింది.

సంఘటనలు బలంగానూ లేవు. పాత్ర సృష్టి సహజంగానూ లేదు. కానీ స్త్రీ హృదయార్తి, కల్పనా మయమయిన వాంఛలు, వాంఛాసిద్ధికోసం ప్రయత్నించే తీరు, ఈ నవలలో గోచరమవుతాయి.

టైం ఎక్కువగావుంటే, ఏం చేయాలో తెలి యకపోతే పొద్దుపుచ్చటంకోసం ఈ నవల కాల క్షేపంగా చదువుకోవచ్చు.

—రవి.

## బాలగంగాధరతిలక్ నాటికలు

[1. సుప్తశిల. వెల: రూపాయి. 2. సుచిత్ర ప్రణయం. వెల: 75 పైసలు. ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. ఏలూరు రోడ్డు విజయవాడ—2]

'సుప్తశిల' అహల్యగాథ. ప్రప్రథమంగా పుస్తకరూపంలో ముద్రితమయింది.

'సుచిత్ర ప్రణయం' యువతీ యువకుల విచిత్ర ప్రణయగాథ. ఇంతకుముందు 'భారతి'లో ముద్రితం.

అందరికీ తెలిసిన కథలాగా 'సుప్తశిల'లోని అహల్య కథలేదు. మార్పుచెందింది. ఆమార్పు సరసంగా వుంది. సహృదయ హృదయామోదకరంగా రూపొం దింది.

'సుప్తశిల'లో నాటకీయత వుంది. ఆలోపం లేదు. అయినా అది కావ్యంగా రచింపబడితే మరింత శోభావహంగా వుండేది.

'సుప్తశిల' నాటిక అయినప్పటికీ రసజ్ఞుడైన కవి చేతిలో అందాలు సంతరించుకొన్న రసపారమ్య సిద్ధిపొందిన కావ్యంలా కనిపిస్తుంది.

తిలక్ కవిత్వంలాగా సుప్తశిల గోచరిస్తుంది. ప్రతిపదంలోను, ప్రతివాక్యంలోను కవితాస్ఫూర్తి గోచ రించి కవితాకళాఖండికగా 'సుప్తశిల'ఎదుట నిలుసు ంది.

సమర్థులయిన నటీనటులు ప్రదర్శించితే ఒక పూర్ణరసమయ స్వప్నంలా నాటిక ముగుస్తుంది.

నాటికలో స్వప్నం సాధించిన ఫలితం నాటిక అంతటికీ తేజస్సు ప్రసాదించింది.

అహల్య సౌందర్యం భావించిన తిలక్ సౌందర్య దృష్టి రసజ్ఞులు నాటికలో పరికింపగలుతారు. ఆనందపారవశ్యంలో మునిగిపోగలుగుతారు.

ఆమె, 'అవయవాల పొందికలో మెత్తని మెరు గులో, కాలాన్ని ఓడించే శక్తి కనిపిస్తుంది. ఆమె పరిపూర్ణ యౌవనవతి.'

ఆమెకు కలవచ్చింది. అందరికీ వస్తాయి కలలు. కలల్లో ఎందరో కనిపిస్తారు. ఆమెకు ఒక మనోహర, సుందరాకారం గోచరించింది. హృదయ గతభావపరిశుభ్రతవల్ల స్వప్న సౌందర్యం వ్యక్త మవుతుంది.

ఆమె వెన్నెల్లో ఆకాశపథంలో ఎగిరిపోతూ వుంది కలలో. 'వెన్నెలజరీఅంచుగల లేతమబ్బుగమ్ముల్ని' తొలగించుకొంటూ వెళుతూవుంది. ఎంత చక్కని కల!

కలలో ఉజ్జ్వల, బలిష్ట తనుయష్టిగల యువకుణ్ణి చూచింది అహల్య నాతో నృత్యోత్స వంలో పాల్గొనమని ఆహ్వానించింది ఆమె మన్మథ తాపం—రచయిత చిత్రించిన తీరు హృదయం కదిలిస్తుంది.

అతని కౌగిలిలో ఒదిగిపోతున్న సమయంలో ఆమె రాయిగా మారిపోతున్నట్లు వచ్చిన కలమూలంగా భావి కథా సూచనవల్ల ప్రరోచన పలికినట్లయింది.

కల కరిగిపోయింతర్వాత నందినితో ఆమె తన కల చెప్పుకోవటంతో హృదయం చెప్పుకొన్న తీరు చూచి, ప్రచండార్కధర్మ పతివ్రత గౌతమ మహర్షి సహధర్మచారిణి శారీరక సంక్షోభం దూరీకృతం చేయలేకపోవటంపట్ల పాఠకులు మనస్సు చిత్రహింస పొందుతుంది.

అహల్య వాంఛ అసహజం అనలేరు, గౌతమ మహర్షి నిష్ఠ అసంగతం అనలేరు పాఠకులు. ఆ ధర్మ సంఘర్షణ ఈ నాటిక—సుప్తశిల.

గౌతమ మహర్షి సామాన్య మానవుడిలాగా రూపొందలేదు. ఆమె వ్యథ అర్థం చేసుకోలేదు. సునంద సుమంతుల ప్రణయైక జీవనం అహల్య బాధోద్దీపన కారకమయింది.

ఇల్లాలు ఇల్లువిడిచి అర్ధరాత్రి వెలుపలికి పోవటం ధర్మబద్ధంకాదు. ఎంత శారీరక చాంచల్యం ఉన్నా, కులపతి అయిన అహల్య అర్ధరాత్రి అలా వెళ్ళటం తప్పుకదా!

కాదని చెప్పటానికే సునంద సుమంతుల పాత్రలు. వాళ్ళు లేకపోతే ఆమె గడప దాటేది కాదు.

ఇక్కడ మంచివెడ్డల విూమాంసవచ్చి సుమంతుడు 'నాకు సుఖమూ దుఃఖమూ కావాలి. రెండూ ఉన్న యీ లోకమే కావాలి' అని పలుకుతాడు. అయితే అది రచయిత గొంతు!

కలలో కనిపించిన యువకుడువంటి వ్యక్తి ఇంద్రుడై ఎదురై అమెను అనురాగభిక్ష అర్థిస్తే, ఆత్మార్పణ, శరీరార్పణ చేసుకొంటుంది అహల్య.

గౌతమమహర్షి తిరిగివస్తూ చూడరానిదృశ్యం చూచి క్రోధావేశంతో, 'నీవు శిలగా మారిపోవాలని—అహల్యనూ, 'నీ దేహం వలెనే నీ చరిత్రకూడా యీ కళంకాన్ని మోసుకు' పోతుందని ఇంద్రుణ్ణీ శపిస్తాడు.

'ఇంద్రుడి మాటలలో'—'భూలోకవాసులు తమ మధ్య సౌందర్యాన్ని బతకనివ్వరు'—రచయిత హృదయం.

ఈ నాటికలో పాటలూ, పద్యాలూ ఉన్నాయి. వచనం కొంతవరకు పౌరాణిక నాటకాలలోవలె సాగింది. అయితే వచనంలో కవిత్వం ధ్వనించింది. ప్రత్యక్షర రససాక్షాత్కారంగా నాటిక నడిచింది.

భావంలో తిఙక్ దృష్టిని నిరసించే—సంప్రదాయాల సంకెళ్ళతో నీతినియమాల జైళ్ళలో నివసించాలనుకొనే వాళ్ళెవళ్ళయినా—అవకాశం వుంది.

ప్రదర్శనలోని సాధకబాధకాల ప్రసక్తి అటుంచి అందరూ పఠింపదగిన చక్కని—రసమయ కావ్యంవంటి—నాటిక సుప్తశిల.

'సుచిత్ర ప్రణయం' ప్రదర్శనానుకూలత సంతరించుకొన్న నాటిక. ఎన్నోచోట్ల ప్రదర్శింపబడి చక్కగా రక్తి కట్టించింది.

శేఖరం ఆత్మవిశ్వాసం, అచంచలమైన పట్టుదల పాఠకుల, ప్రేక్షకుల హృదయాలకు గిలిగింతలు పెడుతాయి.

అతను పేదవాడు. బి. ఏ. చదువుకొన్నవాడు.

తెలివైనవాడు. అద్దెగది అద్దె చెల్లించలేనివాడు. వీధుల వెంట తిరిగేవాడు. 'మధ్యతరగతి యువకుడు.'

రంగనాధం శేఖరంను గూర్చి 'నువ్వు వత్తి సాప్పిక జీవివిరా. కథలు వ్రాయడానికీ నాటకాల్లో వేషాలు వెయ్యడానికీ పనికొస్తావు' అంటాడు.

అయితే శేఖరం ప్రేమించటానికికూడా పనికి వస్తానని నిరూపించుకొన్నాడు. సుచిత్రను ప్రేమించాడు. ఆ ప్రేమ వ్యక్తం చేసుకొన్నాడు. తిట్లు దీవెనలుగా స్వీకరించాడు.

సుచిత్ర కలవారి అమ్మాయి. కసురుకోవటం కళగా అభ్యాసం చేసింది. అంతగా ప్రేమించే శేఖరంను ఇంతగా తీసిపారేసింది. ఆమె నటన గమ్మత్తుగానే వుంది.

సోమయాజులు సరయిన పాత్ర! డబ్బుకోసం అలా పీడించే వాళ్ళు తక్కువమంది ఉండరు. పంతులుతో శేఖరం మాట్లాడిన తీరు, ఇచ్చిన శోకరా విచిత్రంగా వుంటాయి.

రామనాథం పుత్రికా జీవి. ఆయనకు 'ప్రపంచంలోకల్లా ప్రాణ సమానమయింది' 'కూతురు సుభద్ర'. ఆమెకోసం ఆయన చేయని పనిలేదు.

రామనాధం పాత్ర, ప్రారంభంలో ఉన్న పాత్రలు లిస్ట్‌లో చేరలేదుగానీ, చేర్చుకోవచ్చు. అదేవరి పారపాటు అయినా రామనాధంతో కలిపి నాటికలో మొత్తం ఆరు పాత్రలు. అందులో ఒక స్త్రీ పాత్ర! ప్రదర్శనకు అన్నివిధాలా అనుకూలంగా వుంది నాటిక.

శేఖరం 'ఆప్టిమిజమ్' అతన్ని రామనాథం ఇంటికి సుచిత్ర వెంట తీసుకువస్తుంది. అక్కణ్ణుంచి మంచినాటకీయతతో సాగింది నాటిక. సుచిత్రతండ్రితో శేఖరం తనను బాధించాడని చెప్పబోతుంది. ఆమె ప్రతి పదమూ మధ్యలో తుంచి, నేర్పుగా కథ అల్లుకుపోతుంటాడు శేఖరం. అనుకోకుండా మంచిఉద్యోగం ఇచ్చేస్తాడు శేఖరంకు రామనాథం.

సోమయాజులు రంగస్థల ప్రవేశం చేశాక కథ క్లైమాక్స్ అందుకొంటుంది. అప్పుడే చూస్తూవుండగా వేదికపైన ఉన్నట్టుండి దెబ్బలాట మొదలవుతుంది.

అప్పుడు సుచిత్ర మరీ సుచిత్రంగా అందరికీ ఆశ్చర్యకరంగా శేఖరం నాకు కాబోయే భర్త అని పలుకుతుంది.

అది నాటికలో చక్కని మలుపు. ప్రేక్షకులకు, పాఠకులకు కావలసిన ముగింపు. పుస్తకంలో వాళ్ళు, చదివేవాళ్ళు, రంగస్థలంమీద వున్నవాళ్ళు, ప్రేక్షకులూ అందరూ ఆనందం పొందుతారు.

'సుచిత్ర ప్రణయం' నిండా హాస్యం. వినోదం కలిగింపగలిగే నాటిక.

రెండు నాటికల ముద్రణ చక్కగా వుంది. అచ్చుతప్పులు అధికంగా లేవు.

అనాయాసంగా 'సుచిత్ర ప్రణయం', ప్రయత్నించి 'సుప్తశిల' ప్రదర్శించుకోవచ్చు.

ఉత్కంఠతో ఆనందంగా 'సుప్తశిల, వినోదంగా 'సుచిత్రప్రణయం' చదువుకోదగిన నాటికలు.

తిలక్ రచనలు అన్నీ పుస్తకాల రూపంలో ప్రచురిస్తున్న విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ కృషి ప్రశంసనీయం.

-మనోరాణి

### పురుషోత్తమ చరిత్ర

అలెగ్జాండర్‌ను ఎదిరించిన పురుషోత్తమ చరిత్రను వర్ణించే పది ఆశ్వాసాల మహాకావ్యం. రచయిత—శ్రీ పోతరాజు పురుషోత్తమరావు. పుటలు—300—వెల—4—00. ప్రాప్తిస్థానం—శ్రీ పోతరాజు పురుషోత్తమరావు, సీనియర్ తెలుగు పండితులు, మాజేటి గురవయ్య హైస్కూలు, బ్రాడీపేట, గుంటూరు - 3.

### సమస్యాపూరం

రచయిత — శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ. దీనిలో రచయిత, అడపదడప పూరించిన సమస్యలున్నాయి. పుటలు—38. వెల—0—50. ప్రాప్తిస్థానం—శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణ, ఆంజనేయస్వామి గుడివద్ద, అరండల్‌పేట, నరసారావుపేట, గుంటూరు జిల్లా

## ఏ రి న వి రు లు

సమస్యాపూరణములు : రచయిత — శ్రీ వి. పి. శ్రీరాములు. పుటలు — 26. వెల - 0—50 ప్రాప్తిస్థానం — శ్రీ వి. పి. శ్రీరాములు, అజంతా ప్రింటర్స్, పుత్తూరు.

## ప్ర తి జ్ఞా ర్జు నీ య ము

నాటకం. రచయిత శ్రీ వృషాద్రిపతి, పుటలు — 112. వెల: 2—50. ప్రాప్తిస్థానం - శ్రీ వేణుగోపాల స్వామి సేవాశ్రమము, పూడివాడ, దూళిపూడి, వయా రేపల్లె తాలూకా. గుంటూరుజిల్లా.

## శ్రీ వేంకటేశ్వర శతకము

శ్రీ వాడ్రేవు నారాయణమూర్తి. పుటలు-34. వెల : తెలియదు. ప్రాప్తిస్థానం — శ్రీ సాహితీవాహిని, పిండిప్రోలు వారివీధి, కాకినాడ.

## జై జవాన్ — జై కిసాన్

స్త్రీ పాత్రలేని నాటకం. రచయిత — శ్రీ దుగ్గిరాల గౌరీమనోహరరావు. పుటలు — 28. వెల— 1—00. ప్రాప్తిస్థానం - ఎస్. వి. ఆర్. పబ్లికేషన్స్, మండపేట, తూర్పు గోదావరిజిల్లా.

## భక్తవత్సల శతకము

రచయిత - శ్రీ సబ్బనీసు సత్యకేశవరావు; పుటలు— 30. వెల-తెలియదు. ప్రతులకు-శ్రీ సబ్బనీసు సత్య కేశవరావు, అనకాపల్లి, విశాఖ జిల్లా.

## హృ ద య వీ ణ

ఖండకావ్య సంపుటి. రచయిత—శ్రీ ముప్పగౌని నాగేంద్రగౌడు. పుటలు—54. వెల-0-50. ప్రాప్తిస్థానం - సాహితీ కళాసమితి, కల్యాణదుర్గము, అనంతపురంజిల్లా.

## ప్ర ణా ళి కా గీ తా లు

పలువురు రచించిన గీతాల సంపుటి. పుటలు : 14. వెల తెలియదు. ప్రాప్తిస్థానం - ప్రణాళికావేదిక, వ్యవసాయ కళాశాల : బాపట్ల, గుంటూరు జిల్లా.

## మొగ్గతొడిగిన ఎర్రగులాబీ

శ్రీమతి ఇందిరాగాంధీ జీవిత చరిత్ర. రచయిత— కె. ఎ. అబ్బాస్. అనువాదం-శ్రీ రావూరి భరద్వాజ. పుటలు-112. వెల-సాదా ప్రతి రూ 5-00; అట్టబైండు రూ. 7-00. రాజాబైండు 10-00 ప్రాప్తిస్థానం-ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాద్.

**Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna, The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras 1.**
**Editor : S. Sambhu Prasad**